శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణే నమః.



శ్రీమత్పరమేశ్వర నిర్మిత సర్వజగత్స్థిత

సర్వజనస్వస్వధర్మానుష్ఠానహితేన.

శ్రీమత్సనాతన బ్రహ్మర్షి విరచిత

# సనాతనధర్మసంహితాఖ్యోయం

గ్రంథః

---

శ్రీమద్గుంటూరుపుర వాస్తవ్య

బ్రహ్మశ్రీ జుజ్జూరి లక్ష్మణాచార్య జ్యేష్ఠపుత్రేణ

వేంకటరత్నాచార్యోపాధ్యాయేన

పండితానుమత్యా విరచితయా తాత్పర్య దీపికాఖ్యయా

ఆంధ్రవ్యాఖ్యయా సహితః.

పండితపరిష్కృతస్సన్

తణుకు.

శ్రీమత్సౌదామినీముద్రాయంత్రే

ముద్రాపితః ప్రకటీకృతః.

1913

---

 ప్రతిమూల్యం. రూ 1—2—0 అ. 

# విషయసూచిక.



బడును. ఈగ్రంథము పూర్తిగావించి ప్రకటననిమిత్త మెదురు చూచుచుండ బ్రహ్మశ్రీ వేదమూర్తులున్నూ, సద్ధర్మానుష్ఠాన వర్తనులున్నూ, సత్యప్రియులున్నూ, విశ్వకర్మమహావ్రతముచ్వోంచి ప్రకటించిన సాహసధురీణులున్ను, ఆశ్రియదాతలునగు మూర్తి రాజశేఖరాచార్యులవారెంతయు సహాయులైనందున ఏతత్కార్య సాఫల్యమునకు ప్రథమమార్గమాయెను. యిట్టి యుదారసాహసము గల పురుషునియందు దయామయుడగు పరమేశ్వరుండు వారలకు పుత్రపౌత్రాది సంపదల నొసంగుగాక యని పరమేశ్వరున కనేక వందన సహస్రంబు లర్పించుచుంటిని. అంతట బ్రహ్మశ్రీ వెల్లటూరి రామయ్యగారి పుత్రులున్నూ నిరంతర గురుశుశ్రూషాసక్తులును అస్మద్విద్యార్థియునగు బ్రహ్మయ్యాచార్యులుగారెంతయు బహువిధంబులతోడ్పడినందున శీఘ్రకాలంబుననే ముద్రణాకార్యము పూర్తికాబడెను. అట్టివిద్యార్థులకు విద్యా వినయసంపన్నత్వాది సమస్త సుగుణముల నభివృద్ధిచేయుగాక యని పరమేశ్వరున కనేక ప్రణామంబు లర్పించుచుంటిని. చదువరు లీగ్రంథమునందలి ప్రమాద దోషంబులను మన్నించి గుణగ్రహణ ధురీణులగుదురుగాక యని కోరుచున్నాడను.

ఇట్లు

సుజనవిధేయుడు,

జజ్జూరి వెంకటరత్నాచార్యులు.

గుంటూరు, లేక, కృష్ణాజిల్లా, ఆచంట.

శ్రీవిశ్వకర్మపరబ్రహ్మణే నమః.

శ్రీమత్సనాతనబ్రహ్మర్షయే నమః.

# సనాతనధర్మసంహిత

## ధర్మోపదేశః.

---

శ్లో॥ శ్రీమంతం నిర్గుణం శాంతం। లోకాతీతం నిరంజనం
సగుణం పంచవక్త్రం శ్రీ। విశ్వకర్మాణ మాశ్రయే. 1

తా॥ మోక్షలక్ష్మీస్తోకరూపుకొని, సకలగుణసహితమై, సమస్తలోకాతీతమై, మాయాసంగరహితమై, గుణసహితుండై, పంచవక్త్రములుగలిగినటువంటి నిర్గుణసగుణస్వరూపుండైన విశ్వకర్మను సేవింతును.

శ్లో॥ పురా కృతయుగే దేవా। స్సర్వేశాస్త్రవిధానతః
జిజ్ఞాసవో మహాభాగాః। క్షీరాబ్ధిం ప్రాపురంజసా. 2

తా॥ పూర్వకాలంబున కృతయుగమందు సమస్తదేవతలు సర్వశాస్త్రములను యథావిధిగా తెలుసుకొనవలెనని నిశ్చయించినవారై శీఘ్రముగా క్షీరసముద్రమును పొందిరి.

శ్లో॥ తత్ర శ్వేతే మహాద్వీపే। కల్పవృక్షసమావృతే
దివ్యాసనే సమాసీనం। శాంతం సదృషిసేవితం. 3
బ్రహ్మానందసుధాంభోధి। మగ్నమానస మవ్యయం
చిన్ముద్రాంకితహస్తం చ। శంఖచక్రగదాధరం. 4
పరాశక్త్యా సేవ్యమానం। భక్తాభీష్టఫలప్రదం
సనాతనం బ్రహ్మర్షిం। సాష్టాంగం ప్రణిపత్య తే. 5

తదాజ్ఞయా సమాసీనాః । పప్రచ్ఛుస్తం మహాసురాః
స్వామిన్ సర్వజ్ఞ నోబ్రూహి। సర్వాన్ధర్మాననుత్తమాన్.

తా॥ అచ్చట కల్పవృక్షాలంకృతమైన శ్వేతద్వీపమునందు మహర్షులచే సేవించబడుచున్నవాడై దివ్యసింహాసనంబున గూర్చున్నటువంటిన్నిపరబ్రహ్మానందామృతసాగరమగ్నమానమనస్కుడై నిత్యుడై చిన్ముద్రచే అలంకృతమైన హస్తములుగలవాడై శంఖచక్రగదాదులను ధరించినట్టిన్ని పరాశక్తిచే సేవింపబడుచున్నటువంటిన్ని భక్తుల కభీష్టము నిచ్చుచున్నట్టి సనాతనబ్రహ్మర్షినిగూర్చి ఆదేవతలు సాష్టాంగనమస్కారంబు లొనర్చి వారి యాజ్ఞచే కూర్చున్నవారలై దేవతలాభగవంతుని గూర్చి యిటుల ప్రశ్నవేశిరి. సర్వజ్ఞుండవైన ఓభగవంతుడా! శ్రేష్ఠమైన సర్వధర్మములనున్నూ మాకు చెప్పుమని కోరిరి.

శ్లో॥ యైర్ధర్మైర్నరా భూమౌ సామాన్యతో । ముక్తిం విందేయురుత్తమాం
ఇతి శ్రుత్వా వచస్తేషాం । సర్వజ్ఞో జగతీపతిః. 7
వక్తుమారభతే సర్వాన్ । ధర్మాన్ సో తపోనిధిః

తా॥ యేధర్మములచేత మనుష్యులు గతికల్పితులై సర్వోత్తమమైన మోక్షమును బొందుదురో ఆవిధులను జెప్పుమని కోరిన వారిప్రశ్నలను భగవంతుండు విని ఆతపోనిధి సమస్తధర్మములను చెప్పదొడంగెను.

ఇతి భగవాన్.

శ్లో॥ యూయం దేవాః కృతార్థాస్స్థ।యద్వో ధర్మాననుత్తమాన్.
శ్రోతుమిచ్ఛా భవత్తస్మాత్ । ముక్తిభాజస్తు నేతరాః

తా॥ భగవంతుండు చెప్పుచున్నాడు.ఓదేవతులారా! మీరలుసమస్తధర్మములను విననిశ్చయించినవారుగాన ధన్యులు. మీరే ముక్తిబొందుట కర్హులు. అన్యులుగారు.

శ్లో॥ తస్మాద్వక్ష్యామి వో ధర్మాన్ । వేదవేదాంతసమ్మతాన్
ఏషామాచరణాత్పుంసో । బ్రహ్మభూయాయ కల్పతే.

తా॥ యేధర్మములనాచరించుటవలన బ్రహ్మస్వరూపులగుదురో అట్టి ఉత్తమధర్మములను మీకు చెప్పెదనని భగవంతుండు చెప్పుచున్నాడు.

శ్లో॥ ధర్మేణ లోకాస్తిష్ఠంతి । ధర్మే బ్రహ్మప్రతిష్ఠితః
ధర్మప్రబోధకా వేదాః । ధర్మ ఏవ సనాతనః. 10

తా॥ ధర్మముచేత లోకములు నిలిచియున్నవి,ధర్మమునందు బ్రహ్మప్రతిష్ఠించబడియున్నాడు,వేదములు ధర్మములను దెలుపును,గానధర్మమే భగవత్స్వరూపము.

శ్లో॥ అహింసా సమతా క్షాంతి । బ్రహ్మచర్యం తపోవ్రతం
యోగాభ్యాసశ్చ స్వాధ్యాయః । యజ్ఞోదానం శమో దమః.
తుష్టిః పుష్టిశ్చ సంతోషో । దేవతారాధనం తథా
వర్ణాశ్రమసమాచారో । వేదమార్గానుసరణమ్. 12
ఋతం సత్యం తథా శ్రద్ధా । జపో మౌనం దయా తథా
గురుదైవతభక్తిశ్చ । మననం చ నిరంతరమ్. 13
ఏతాని ధర్మరూపాణి । ప్రవదంతి మనీషిణః. 14

తా॥ అహింసయు,సమత్వము, క్షాంతియు,బ్రహ్మచర్యము,తపస్సు,వ్రతము,యోగాభ్యాసము,వేదపాఠము,యజ్ఞము, దానము,శమము,దమము,సంతుష్టి,పుష్టి,సంతోషము, దేవతారాధనము, వర్ణాశ్రమాచారము,వేదమార్గావలంబనము,ఋతము,సత్యము,శ్రద్ధ,జపము,మౌనము,దయ,గురుదైవములయందుభక్తి,ఆత్మచింతనము, వీట్లను ధర్మస్వరూపము లని ఆర్యులు నుడివెదరు.

శ్లో॥ తస్మాద్ధర్మాత్పరం నాస్తి । ఇహాముత్ర సుఖాయచ
ధర్మేణ వర్తమానస్య । పురుషస్య విపశ్చితః. 15

సర్వభూతాని సద్ధనాంతే । వశత్వం మోదమాశ్రితాః
తస్మాద్ధర్మం చరేద్ధీమాన్ । ఇహలోకే తు శాశ్వతాన్.
కామాన్ భుక్త్వా పరబ్రహ్మ । చాధిగచ్ఛతి నాన్యథా. 16

తా॥ అందుచే నిహపరసుఖములనిచ్చునట్టి ధర్మమునకంటె మించిన శ్రేయము లేదు. ధర్మాత్ముడైన సత్పురుషునికి సర్వభూతములు స్వాధీనములగును, గనుక పురుషుడు ధర్మమునాచరించి ఇహలోకసౌఖ్యములననుభవించి శాశ్వతపరబ్రహ్మమును పొందును.

శ్లో॥ తస్మాద్ధ్యాయం మహాదేవాః । యూనాఖ్యాన్ ధర్మాన్ సనాతనాన్.
శ్రోతుం సమాగతా యూయం । వక్ష్యామి శృణుతాదరాత్.

తా॥ గనుక ఓ దేవతలారా! మీరు యేసనాతనధర్మములను వినగోరివచ్చితిరో ఆధర్మములను నేను వచించెదను. మీరలు సావధానమనస్కులై వినెదరుగాక.

శ్లో॥ శ్రుత్వా దేవాస్త్వ సంతోషా శ్రీభగవద్వాక్యముత్తమం
పప్రచ్ఛుస్సర్వధర్మాంశ్చ । శ్రోతుం సమ్యక్సమాగతాః.

ఇతి సనాతనధర్మసంహితాయాం ధర్మప్రశ్నోనామ ప్రథమోఽధ్యాయః.

తా॥ యీప్రకారము భగవంతునివాక్యములు దేవతలు విని సంతసించి సమస్తధర్మములను విననిశ్చయించినవారై, ఆధర్మములను భగవంతునిగూర్చి ప్రశ్నచేసినవారైరి. ఇది సనాతనధర్మసంహితయందలి ప్రథమోధ్యాయతాత్పర్యసంగ్రహము.

## అథ ద్వితీయాఽధ్యాయః.

---

### బ్రహ్మస్వరూపనిర్ణయః.

దేవా ఊచుః. శ్లో॥ సనాతనబ్రహ్మఋషే । సర్వజ్ఞానవిశారద !
పరబ్రహ్మస్వరూపంనో వద కారుణ్యసాగర ?

తా॥ దేవతలనుచున్నారు. పరబ్రహ్మస్వరూపుఁడవై, కరుణారసముద్రుఁడవైన, ఓసనాతనమహర్షీ! మాకు పరబ్రహ్మస్వరూపమును బోధించి మమ్ముకృతార్థులంజేయుమని ప్రార్థించిన బ్రహ్మర్షి చెప్పదొడంగె.

శ్రీసనాతనబ్రహ్మర్షిః.

శ్లో॥ పరబ్రహ్మస్వరూపం వో । వక్ష్యామి శృణుతాఽదరాత్
యత్ జ్ఞాత్వా నేహ భూయోఽన్య । ద్జ్ఞాతవ్య మవశిష్యతే. 2

తా॥ ఓబ్రహ్మఋషులారా! ఏబ్రహ్మస్వరూపమును దెలిసినవారికిఁ దెలియఁదగినది యితరమున్న సదో ఆబ్రహ్మస్వరూపమును మీకుఁజెప్పెదను. సావధానమానసులయి వినుండు.

శ్లో॥ బ్రహ్మస్వరూపం ద్వివిధం । నిర్గుణం సగుణం మహత్
నిర్గుణం చ నిరాకారం । మహావాక్యైకగోచరమ్. 3
సత్యజ్ఞాన మఖండం చ । శాశ్వతం శివ మవ్యయం
చిదాకాశం నిత్యశుద్ధం । బుద్ధమాత్రైక మేవ తత్ 4
సర్వవ్యాపి సర్వరూపం । సర్వమూర్తీతం నిరంజనమ్
ప్రత్యక్తత్వా దభిన్నంతు । తదఖండం పరంధ్రువమ్. 5
పంచకోశాతీతరూపం । పంచభూతవివర్జితం
తథా పంచగుణాతీతం । పంచేంద్రియపరం బృహత్. 6
సర్వావస్థాతీతరూపం । సర్వస్య హృది సంస్థితం
పిపీలికాదిబ్రహ్మాంత । మనసాం సాక్షి పరంపదమ్. 7

తా॥ బ్రహ్మస్వరూపము రెండువిధములు,అది నిర్గుణము సగుణము. ప్రథమతః నిర్గుణస్వరూపమును జెప్పెదను.ఆనిర్గుణస్వరూపము నిరాలంబము,మనోవాచామగోచరము, సత్యస్వరూపము, జ్ఞానస్వరూపము,అఖండస్వరూపము, శాశ్వతమైనది, పరమమంగళస్వరూపమైనది,అవ్యయము,స్వప్రకాశాకాశమైనది. నిత్యపరిశుద్ధము బుద్ధము,అవ్యక్తము, సర్వవ్యాపకము, సర్వస్వరూపము,ఆకాశాతీతము,నిరంజనము ప్రత్యగాత్మకంటె భిన్నముగానిది. అఖండస్వరూపము.పరంజ్యోతి,ధ్యానము అన్నమయ ప్రాణమయ మనోమయ జ్ఞానమయ ఆనందమయములకంటె అతీతము. పంచభూతరహితము పంచగుణములకతీతమున్నూ పంచేంద్రియరహితము. జాగ్రత్స్వప్నసుషుప్తి తురీయ తుర్యాతీతావస్థలకునతీతము హృత్కమలమందునివశించునది. సర్వజంతువులసాక్షి. ఇదినిర్గుణపరబ్రహ్మస్వరూపము.

శ్లో॥ సగుణం శబలం బ్రహ్మ। ఈశ్వరాఖ్యో ఖిలాత్మకః
సహస్రశీర్షపురుషో దేవో న। హస్రాక్షస్సహస్రపాత్. 8
స సర్వలోకాన్ సంవ్యాప్య। అత్యతిష్ఠ ద్దశాంగుళం
కోటిసూర్యప్రతీకాశో। కోటిచంద్రసుశీతలః. 9
విశ్వకర్తా స్వయంజ్యోతి। ర్జగన్నాటకసూత్రభృత్
సర్వజ్ఞస్సచ్చిదానంద। స్సర్వకర్తా స్వయంప్రభుః. 10
సృష్టి స్థితి ప్రణాశాంశ్చ। తిరోధానం చ నిర్వృతిం
సమ్యక్కరోతి లీలార్థం। విరాడ్బ్రహ్మస్వకారణః. 11

తా॥ మాయాశబలితుండైన పరబ్రహ్మ సగుణుడనిపించుకొనును.ఆయన ఈశ్వరుడు. సర్వస్వరూపుడు సహస్రశిరస్సులు గలవాడు సహస్రనేత్రములున్నూ సహస్రపాదములున్నూ గలవాడు సమస్తలోకములను వ్యాపించి పదియంగుళములు మిగిలినవాడు ఆయన కోటిసూర్యప్రకాశి కోటిచంద్రశీతలుడు విశ్వకర్త స్వయం

ప్రకాశమున జన్మనాటకసూత్రధారి సర్వజ్ఞుడు సచ్చిదానందుడు. సర్వకర్త స్వయంప్రభువు. సృష్టి స్థితి నాశము తిరోధానము అనుగ్రహము అను క్రీడచే నాచరించును.

శ్లో॥ తస్యాప స్పంచవక్త్రాణి । సర్వేశస్య మహాత్మనః
సద్యోజాతం పూర్వముఖం । కోటిసూర్యసమప్రభమ్. 12
దక్షిణం వామదేవంచ । కాలాగ్నిసమసన్నిభం
అఘోరం పశ్చిమం ప్రోక్తం । చంద్రకోటిసమప్రభం 13
తత్పురుషం చోత్తరం తు । స్వప్రకాశ మనామయం
ఊర్ధ్వ మీశానవదన । మఖండజ్యోతిరూపకమ్. 14

తా॥ ఆయనకు సద్యోజాతాది అయిదు ముఖములు గలవు. వారి సద్యోజాతసంజ్ఞగల పూర్వముఖము కోటిసూర్యసమానకాంతిగలది. వామదేవసంజ్ఞగల దక్షిణముఖము ప్రళయకాలాగ్నితో సమానకాంతిగలది అఘోరసంజ్ఞగల పశ్చిమముఖము కోటిచంద్రులసమానకాంతిగలది. తత్పురుషసంజ్ఞగల ఉత్తరముఖము నిరుపాధికమైన స్వప్రకాశముగలది. ఈశానసంజ్ఞగల ఊర్ధ్వముఖము అఖండసచ్చిదానందపరంజ్యోతి స్వరూపమైనది.

శ్లో॥ తత్తేజసా ప్రకాశ్యంతే। సోమ సూర్యాఽనలాదయః
శివం ప్రశాంతం సర్వజ్ఞం । లోకాతీతం నిరంజనమ్. 15
ఏవం పంచముఖో బ్రహ్మా । సేవ్య స్సద్భి ర్విముక్తయే
తద్ధ్యానేన వినశ్యంతి । సర్వకర్మాణి కృత్స్నశః. 16

తా॥ యీపరమేశ్వరునియొక్క స్వప్రకాశముచే సూర్యాదిసమస్తగోళములు ప్రకాశించును. ఆపరశివతత్వము శాంతము సర్వజ్ఞము సర్వలోకాతీతము నిరంజనము యిటువంటి పంచముఖములు గల పరబ్రహ్మమే మోక్షముకొరకు సత్పురుషులచే సేవించదగినవాడు! ఆపరమాత్మయొక్క ధ్యానయోగముచే పుణ్యపాపాత్మకములైన సర్వకర్మలు నశించును.

శ్లో॥ తదుపాసనయా జంతు । ర్ముచ్యతే భవబంధనాత్
స లోకానాం పతి స్సాక్షీ । విశ్వకర్మా విభుః ప్రభుః. 17
కర్తా కారయితా భోక్తా । భర్తా ధారయితా తథా
సర్వబ్రహ్మాండభాండానాం । మూలాధారో మహేశ్వరః 18

తా॥ ఆయనయొక్క ఉపాసనముచేత భవబంధములు వదలును. ఆయనే లోకాధిపతి సర్వసాక్షి విశ్వకర్మ విభుడు సమర్థుడు ఆయనే చేయువాడు చేయించువాడు అనుభవించువాడును భరించువాడును. భరింపచేయువాడును సర్వబ్రహ్మాండభాండములకు ఆధారభూతుడును నియామకుడు.

శ్లో॥ సర్వరాట్సర్వగుణాధ్యక్షః । సర్వసత్వప్రకాశకః
తత్సంకల్పాద్విజాయంతే । సర్వబ్రహ్మాండకోటయః, 19
తన్మహిమ్నా స్థితాస్సర్వ । లీయంతే తేఽంతరే హి వై.

తా॥ ఆయనమాత్మ సర్వాధికారియు సర్వగుణాధిపుడు సమస్తవస్తువులను ప్రకాశింపచేయువాడు ఆయనసంకల్పమాత్రముచే ననేకకోటిబ్రహ్మాండములు పుట్టుచున్నవి. ఆయనమహిమచే నిలచియున్నవి. ఆయనయందు కలియుచున్నవి.

శ్లో॥ తిరోధత్తే స యోన్తే తాః । సర్వానుగ్రహకారకః. 20
ఏవం విధమహాశక్తిః । పరబ్రహ్మ ప్రకీర్తితః
ఏవం విదిత్వా హే దేవాః । సుఖం ప్రాప్స్యథ సర్వదా. 21

ఇతి సనాతనధర్మసంహితాయాం బ్రహ్మస్వరూపనిర్ణయో నామ ద్వితీయోఽధ్యాయః,

తా॥ యీబ్రహ్మాండములను తనయందు దాచును. ఈయనే సర్వానుగ్రహకర్త. యిట్టిమహామహిమగలపరబ్రహ్మ సగుణుడని చెప్పబడును. గనుక ఓ దేవతలారా! యీతత్వమును తెలుసుకొని మీరలు మోక్షసుఖమును బొందుదురుగాక. ఇదిసనాతనధర్మసంహితయందలి ద్వితీయాధ్యాయతాత్పర్య సంగ్రహము.

## అథ తృతీయోఽధ్యాయః.

### ఉపాసనాత్రయః.

దేవాః.

శ్లో॥ సనాతన సర్వేశ! సర్వజ్ఞ! । బ్రహ్మనిష్ఠావిదాంవర!
పరబ్రహ్మోపాసనం నో । వద ముక్తిర్భవేద్యతః. 1

దేవతలడుగుచున్నారు.

తా॥ పరబ్రహ్మతత్వజ్ఞుండవైన ఓసనాతనబ్రహ్మర్షీ! మాకు బ్రహ్మోపాసనక్రమ ముపదేశింపుడని కోరిరి.

బ్రహ్మర్షిః

శ్లో॥ శృణుధ్వం దేవతా! సర్వే । బ్రహ్మోపాసన ముత్తమం
యస్యాఽభ్యసనమాత్రేణ । ముక్తిర్హస్తగతా భవేత్. 2

బ్రహ్మర్షి పలుకుచున్నాడు.

తా॥ ఓ దేవతలారా! యేబ్రహ్మోపాసనవలన మోక్షము హస్తగతమగునో ఆయుపాసనాక్రమమును శ్రద్ధతో వినెదరుగాక.

శ్లో॥ తపసా క్షీణపాపస్య । శాంతి దాంతి యుతస్య చ
బ్రహ్మచర్యాపరస్యాఽపి । తథా భూతదయావతః. 3
ధైర్యస్థైర్యయుతస్యాఽపి । సర్వభోగవిరాగిణః
వక్తవ్యా బ్రహ్మవిద్యా సా । నేతరాయ కదాచన. 4

తా॥ తపస్సుచే క్షీణపాపుడయి శమదమాదులతో కూడుకొని బ్రహ్మచర్యవ్రతస్థుడై భూతదయగలిగి ధైర్యస్థైర్యములుగలిగి సమస్తభోగనిరాశుడయిన శిష్యునకు యీసర్వోత్తమమైన బ్రహ్మవిద్య జెప్పవలయును. అన్యులకు చెప్పరాదు.

శ్లో॥ ఏకాంత సేవీ లఘ్వాఽశీ । యత వాక్కాయ మానసః
ధ్యాన యోగపరో నిత్యం । వైరాగ్యం చ సమాశ్రితః. 5

కామక్రోధాదిరహితః । సదా చైతన్యమానసః
ముముక్షయా సుసంపన్న । శ్శ్రద్ధాభక్తిసమన్వితః. 6
గురుం శుశ్రూషయా ప్రీత్యా । స్తోషయే దుపచారకైః
తే నోపదిష్టమార్గేణ । బ్రహ్మోపాసన మాచరేత్. 7

తా॥ నిర్జనస్థలమును సేవించువాడును మితాహారుడును, నియతమైనమనోవాక్కాయములు గలవాడును నిత్యధ్యానయోగాసక్తుడును విరాగియు అరిషడ్వర్గరహితుడును ఎల్లప్పుడు నేకచిత్తము గలవాడును మోక్షేచ్ఛ గలవాడును శ్రద్ధాభక్తిసంపన్నుడున్నాయిటువంటిసాధకుడు శుశ్రూషచే గురువును సంతసింపచేయవలయును, ఆ గురూపదేశమార్గముచే పరబ్రహ్మ నుపాసించవలయును.

శ్లో॥ విజనే పుణ్యదేశే తు । నిర్మలే నిర్భయే సమే
యోగాభ్యాసనిమిత్తం వై । వేదికాం పరికల్పయేత్. 8

తా॥ విజనము పవిత్రము నిర్మలము వ్యాఘ్రాదిభయరహితము సమమునగు స్థలమందు యోగాభ్యాసముకొరకు అరుగును చేయవలయును.

శ్లో॥ తస్యా ముపరి వాసోభిః । కంబళైశ్చ కుశోత్తరైః
ఆసనం తు ప్రకల్ప్యేత । విఘ్నఘ్నో యోగసిద్ధయే, 9

తా॥ ఆ వేదికపైన వస్త్ర చిత్రాసన దర్భాసనములచే యోగసిద్ధికొరకు విఘ్నఘ్నాసన మేర్పరచవలయును.

శ్లో॥ తస్యోపరి సమాసీన । ఋజుకాయశిరోధరః
నాసికాగ్రం సమీక్షేత । సమ్యగ్లక్ష్యైకసిద్ధయే. 10
అర్ధోన్మీలితనేత్రస్స । న్నంతర్లక్ష్యసమన్వితః
ధ్యాయేత్తం ప్రత్యగాత్మానం । సర్వసాక్షిణ మవ్యయం. 11

తా॥ దానియందు కూర్చుని సమశరీరకంఠముగలవాడై లక్ష్యసిద్ధికొరకు నాసాగ్రమును చూడవలయును అరకన్నుమూసి

అంతర్లక్ష్యముగలవాఁడై మనస్సాక్షియైనపరబ్రహ్మను ధ్యానము చేయవలయును.

శ్లో॥ పంచకోశాతీతరూపం। శరీరత్రయవర్జితం
అవస్థాత్రయనిర్ముక్తం। సత్వాదిగుణవర్జితం. 12
ఓంకారగమ్యం సర్వత్రి। సర్వరూప మనామయం
సచ్చిదానందరూపం తు। సర్వాధిష్ఠాన మవ్యయం. 13
శాశ్వతం పరమం నిత్యం। నిర్గుణం తమసఃపరం
స్వహృదబ్జే నిరీక్షేత। మనస్సాక్షిత యా బుధః. 14

తా॥ ఆపరబ్రహ్మము పంచకోశములకు అతిరిక్తము స్థూల సూక్ష్మకారణ దేహములు లేనిది జాగ్రత్స్వప్నసుషుప్తులనంటనిది పంచగుణరహితమైనది ఓంకారధ్యానముచే పొందదగినది అంతటా స్వస్వరూపమై నిండియున్నది. సచ్చిదానందరూపమై సర్వాధారమైనది అవ్యయము శాశ్వతము పరమునిత్యమునిర్గుణముఅజ్ఞానాతీతము ఇట్టిపరబ్రహ్మను తనహృదయకమలమందు మనస్సాక్షిగా భావించి చూడవలయును.

శ్లో॥ నేతినేతీతి వాక్యైశ్చ। నిరస్య సకలం జగత్
యచ్ఛిష్యతే పరంజ్యోతి। స్తదేవ పరమంపదమ్. 15
చిదానందవశం కృత్వా। మనస్సాక్షిత్వాత్
స్వప్నం నిద్రాం తథా జాగ్ర। న్నిరస్య బ్రహ్మభావనాత్. 16
జ్ఞానానందస్వరూపేణ। తిష్ఠే ద్యోగీ సదాశుచిః
తస్య నస్యంతి కర్మాణి। పుణ్యపాపాభిధాని చ. 17

తా॥ సర్వదృశ్యము సనాత్మయని తోసివేయగా యేదృక్కు మిగులునో అదియే పరబ్రహ్మము. మనస్సును బ్రహ్మనందాధీనముచేసి పరబ్రహ్మభావనవలన అవస్థాత్రయము నణచి పరమానం

దస్వరూపముచే యోగనిష్ఠుడు పరబ్రహ్మస్వరూపుడై యుండవల
యును. అతనికి సమస్తకర్మములున్నూ నశించును.

శ్లో॥ నిర్మలో రాజతే విద్వాన్ । బ్రహ్మరూపాఽతినిర్భయః
జీవన్ముక్తి మవాప్యాంతే । పరబ్రహ్మణి లీయతే. 18

తా॥ తదనంతరమందు పండితుడు సంసారభయరహితుడై
బ్రహ్మస్వరూపుడై వెలుంగును జీవన్ముక్తుండై దేహాంతమందు పర
బ్రహ్మయందు కలియును.

శ్లో॥ అథవా సగుణం బ్రహ్మ । సృష్టిస్థిత్యాదికారణమ్,
సర్వజ్ఞం సర్వగం శాంతం । సర్వలోకమహేశ్వరం. 19
పంచవక్త్రం తమీశానం । విశ్వకర్మాణ మవ్యయమ్
కోటిసూర్యప్రతీకాశం । భక్తానుగ్రహకారకమ్. 20

తా॥ అటుగాక నిర్గుణబ్రహ్మోపాసనాధికారరహితుడు
పంచకర్తయు సర్వజ్ఞుడు అన్నిటియందున్నవాడు శాంతుడు సర్వలో
కాధిపతి పంచముఖుడున్నూ ఈశ్వరుడున్నూ విశ్వకర్మయుఅవ్యయు
డుకోటిసూర్యకాంతిగలవాడు భక్తులయందుదయగలవాడు.

శ్లో॥ హృత్పద్మమధ్యే సేవేత । యతవాక్కాయమానసః
సుఖాసనే సమాసీన । ఏకచిత్తస్సదాశుచిః. 21
అష్టాక్షరేణ మంత్రేణ । జపయజ్ఞవిధానతః
భక్తిభావపరో భూత్వా । యజేత్తం పరమేశ్వరమ్. 22

తా॥ అయినట్టిసగుణబ్రహ్మను త్రికరణశుద్ధిగా స్వహృద
యకమలమందు సేవించవలయును సుఖాసనమున గూర్చున్నవాడై
ఏకచిత్తుడు పరిశుద్ధుడునయి జపయజ్ఞవిధిచే "ఓం నమః పరబ్రహ్మ
ణే" అనుఅష్టాక్షరిని యథాశక్తి జపముచేయవలయును భక్తిభావనచే
భగవంతుని సేవించవలయును.

శ్లో॥ హృత్పద్మమధ్యే స్వావర్ణ్ణ । మానసం తు పరికల్పయేత్
తస్యోపరి త మీశానం । భావయేస్థిత మవ్యయమ్. 23
తస్య పూజాతు కర్తవ్యా । మానసీభక్తి పూర్వకా
హృదబ్జే సంస్థితస్యాస్య । ధ్యానమావాహనంతథా. 24

తా॥ హృదయకమలమందు రత్నఖచితసింహాసన మేర్పర చిదానియందు పరబ్రహ్మను భావించవలయును. భక్తిపూర్వకముగా మానసికపూజ చేయ్యవలయును హృత్పద్మమందున్న యీపంచముఖబ్రహ్మను ధ్యానావాహనాది షోడశోపచారపూజలు యథావిధిగా మనస్సుతో కల్పించవలయును.

శ్లో॥ సింహాసనం తథా పాద్యం । మర్ఘ్యం మాచమనీయకం
మధుపర్కం తథా స్నానం । వస్త్రం యజ్ఞోపవీతకమ్, 25
గంధపుష్పం తథా పూజా । వివిధైః పుష్పసంచయైః
తులసీబిల్వపత్రైశ్చ । మనసైవ పరికల్పయేత్. 26
ధూపం దీపం చ నైవేద్య । మమృతాహారలక్షణం
తాంబూలం చైవ మనసా । దేవదేవస్య కల్పయేత్. 27
నీరాజనం మంత్రపుష్పం । ధ్యానం వేదోక్తమంత్రకైః
పరిక్రమణనమస్కారాన్ । మనస్సైవ పరికల్పయేత్. 28
ఏవం పూజాం తు నిర్వర్త్య । మనసా బ్రహ్మధారయేత్
తస్య నశ్యంతి పాపాని । బ్రహ్మానందం తు వర్ధతే. 29

తా॥ యీప్రకారము షోడశోపచారపూజ లొసర్చి మనస్సునందా పరబ్రహ్మను నిలుపుకొని తదనంతరమందు పరంజ్యోతియందు లీనమగుపురుషునికి సమస్తపాపములు నశించును. బ్రహ్మానందము లభించును.

శ్లో॥ భక్తియోగేన యుక్తస్య । సర్వత్ర విజయో భవేత్.
తస్మాత్ ధ్యేయం సదా దేవః । భక్తియోగపురస్సరం. 30

జయధ్వం సర్వగం దేవం । పంచవక్త్రం స్వయం విభుమ్
యుష్మాకం వరదో భూత్వా । సర్వలోకమహేశ్వరః. 31
సర్వకామప్రదో నిత్యం । భవిష్యతి న సంశయః
ఇతి సనాతనధర్మసంహితాయాం బ్రహ్మోపాసనవిధిర్నామ తృతీయోధ్యాయః.

తా॥ భక్తియోగపరులకు ఇహపరములయందు జయముగలుగునుగాన ఓదేవతలారా! మీరు భక్తిపరులయి ఆభగవంతుని సేవించినచో సర్వలోకములయందు జయము గలుగఁజేయును. సంశయము లేదు.

ఇది సనాతనధర్మసంహితయందలి తృతీయాధ్యాయ
తాత్పర్యసంగ్రహము.

---

## అథచతుర్థోఽధ్యాయః.



### బ్రహ్మాండోత్పత్తిః.

దేవాః. శ్లో॥ స్వామిన్! సర్వార్థతత్వజ్ఞ! । దేవానాంహితకారక!
బ్రహ్మాండసృష్టింనోబ్రూహి। యస్మాజ్జాతమిదంజగత్

తా॥ దేవతలడుగుచున్నారు,, దేవతలకు యోగక్షేమపాలకుండయినటువంటి ఓబ్రహ్మర్షీ! యీబ్రహ్మాండమేప్రకార ముత్పన్నమాయెనో ఆయుత్పత్తిక్రమమును మాకు శెలవిమ్మనికోరిన బ్రహ్మర్షి చెప్పుచున్నాడు,

శ్లో॥ శృణుధ్వం దేవతాస్సర్వే । సావధానధియో ముదా
యస్మాజ్జాత మిదంసర్వం । బ్రహ్మాండం సచరాచరం.. 2

తా॥ ఓ దేవతలారా! యేపరబ్రహ్మవలన చరాచరాత్మకమైన బ్రహ్మాండము గలిగెనో తత్క్రమమును చెప్పెద సావధానమనస్కులై వినుండు.

శ్లో॥ సృష్టేః పూర్వం బుధా నాఽఽసీత్ । బ్రహ్మాండం సచరాచరం
ఏకమేవ స్థితో దేవః । సత్యజ్ఞానాదిలక్షణః. 3
తస్మిన్ స్థితా మహాశక్తిః । బ్రహ్మణస్తత్స్వరూపిణీ
సూర్యే యథా ప్రభా చంద్రే । జ్యోత్స్నాఽగ్నౌ చ యథోష్ణతా

తా॥ సృష్టికి పూర్వము చరాచరాత్మకమైన బ్రహ్మాండము లేదు. సత్యజ్ఞానాత్మకుడయిన పరబ్రహ్మమే యుండెను. ఆబ్రహ్మమునందు తదభిన్నస్వరూపమైన యొక మహాశక్తి గలదు. ఆశక్తి సూర్యునియందు కాంతివలెను. చంద్రునియందు వెన్నెలవలెను అగ్నియ యుష్ణమువలెను నెక్కొని యుండెను.

శ్లో॥ తామభిన్నాం మహాశక్తిం । స్వస్మిన్నేవ సముద్గతాం
సదృష్ట్వా స మహాదేవః । సృష్టిం చాస్యాః ప్రచోదితః. 5
తస్మాదవ్యక్తముత్పన్నం । సర్వలోకైకకారణం
తస్మాన్మహత్తత్త్వమభూత్ । పంచభూతైకకారణం. 6
తస్మాదహంకృతిర్జాతా । సర్వానుగుణవర్తిని
అహంకారాచ్చ భూతానాం । తన్మాత్రాణి ప్రజజ్ఞిరే. 7

తా॥ తనయందు నిలిచి తనకంటె భిన్నముగాని యామహాశక్తిని ఆపరబ్రహ్మము సృష్టిచ్ఛచే చూచెను. అనంతరము సర్వలోకకారణమైన అవ్యక్తతత్త్వము గలిగెను. దానివలన పంచభూతకారణమైన మహత్తత్త్వము గలిగెను. ఆమహత్తత్త్వమువలన సర్వగుణాత్మకమయిన అహంకారము గలిగెను. అహంకారమువలన, శబ్దస్పర్శరూప రస గంధాత్మకములైన పంచభూతతన్మాత్రలు గలిగెను

శ్లో॥ ఆకాశాద్వాయురుత్పన్నో । తస్మాదగ్నిస్తతో జలం
తస్మాచ్చ పృథివీ జాతా । తతోఽషధయోఽభవన్. 8
ఓషధీభ్యోఽన్నమభవ । దన్నాద్భూతాని జజ్ఞిరే
తస్మాత్పురుషయేవాఽసౌ । జాత స్థూలశరీరకః. 9

తా॥ ఆకాశమువలన వాయువు వాయువువలన అగ్నియు అగ్నివలన జలము జలమువలన పృథివియు వరుసగా గలిగెను. ఆ పృథివివలన ఓషధులు గలిగెను. ఓషధులవలన అన్న ముత్పన్న మాయెను. ఆఅన్నమువలన జంతువులు గలిగెను. అందు జీవుడు స్థూలశరీరము గలవాఁడాయెను.

శ్లో॥ పరబ్రహ్మ స్వతేజస్సు । ప్రకృతౌ చాప్యసిక్షిపేత్
తదండ మభవ ద్ధైమం । లోకాధారం సుభాస్వరమ్. 10
యస్మి న్నేతే చ మహాలోకా । లోకపాలాశ్చ సర్వశః
తస్మిన్నేవ స్థితాస్సర్వే । హ్యయాఽఽజ్ఞావశవర్తినః. 11

తా॥ ఆపరబ్రహ్మము తనయంశను ప్రకృతియందుంచెను ఆయంశమే స్వర్ణమయమై ప్రకాశమైన బ్రహ్మాండస్వరూపముగా మారెను. ఆబ్రహ్మాండమునందు పదిలోకములు లోకపాలకులు గలిగిరి. యీలోకపాలకులు భగవదాజ్ఞకు లోబడి బ్రహ్మాండమందు నివసించిరి.

శ్లో॥ కాలకర్మగుణోపేతా । జీవా స్తద్వశవర్తినః
ప్రజాయంతే విలీయంతే । కర్మభోగైకతత్పరాః. 12
సర్వేశ్వరాజ్ఞయా వాయు । ర్వాతి సూర్య స్తపత్యసౌ
మేఘో వర్షతి దేవేశో ॥ హ్యగ్ని ర్జ్వలతి తద్భయాత్. 13

తా॥ కాలకర్మగుణయుక్తులైన అనంతజీవులు భగవదాజ్ఞావశవర్తులు. కర్మభోగానుసారముగా నీబ్రహ్మాండమునందే పుట్టుచు చచ్చుచు వివశులై సంసారచక్రమునందు తిరుగుదురు. వాయుదేవుడు భగవదాజ్ఞచే వీచును. సూర్యుడు తపింపచేయును పర్జన్యుడు వర్షించును అగ్ని యతనిభయముచే మండును.

శ్లో॥ తదాజ్ఞయా భయాచ్చైవ । మృత్యుర్ధావతి పంచమః
అండస్యాఽంత స్త్విమే లోకాః । పంచపంచప్రకీర్తితాః. 14

ఏదాజ్ఞయా ప్రవర్తంతే । తస్మిన్నేవ పరేపితా
బ్రహ్మాండం తచ్ఛరీరం స్యాత్ । తస్యాన్తస్సర్వమహోకతః. 15

తా॥ ఆ భగవదాజ్ఞచే భయమునకే మృత్యువు ప్రాణులను సంహరించును. యీపదిలోకములు బ్రహ్మాండాధారముచేతనే యున్నవి యీలోకములు ఆయనయందే పుట్టి ఆయనయందే లీనమగును. బ్రహ్మాండమే ఆ విరాట్పురుషశరీరము.

శ్లో॥ అతలం పాదదేశస్స్యాత్ । వితలం జానుదేశకం
సుతలం తూర్వుదేశస్స్యాత్ । రసాతలం కటిః స్మృతా. 16
పాతాళం లింగదేశస్స్యాత్ । స్వదేశస్య మహాత్మనః
భూలోకో నాభిదేశస్స్యాత్ । భువస్సు హృదయస్థలం. 17
సువర్లోక స్తథా కంఠః । మహర్లోకో ముఖం విభోః
జనోలోకః శిరః ప్రోక్తం । విరాడాకారస్య తస్య తు. 18
ఏవం బ్రహ్మాండరూపస్సః । పరబ్రహ్మ స్వయం విభుః
తస్మిన్నేవ స్వతస్సృష్ట్వా । ప్రవిశ్య చ తదంతరే. 19
క్రీడనం కురుతే దేవః । స్వాతంత్ర్యపరమేశ్వరః.

తా॥ అతలలోకము భగవంతునకు పాదస్థానము. వితలము మోకాలు సుతలము తొడ రసాతలము మొలకట్టు పాతాళము గుహ్యము ఆపరమాత్మకు భూలోకము నాభి భువర్లోకము వక్షస్థలము సువర్లోకము కంఠము మహర్లోకము లలాటము జనలోకము శిరస్సు యీప్రకారము విరాట్స్వరూపమునకు బ్రహ్మాండశరీరము. యీస్వయంభువయిన పరబ్రహ్మ బ్రహ్మాండస్వరూపుడయి తనయందు తనను సృష్టిచేసుకుని ఆ బ్రహ్మాండమందు ప్రవేశించి ఆస్వతంత్రుడయిన పరమాత్మ క్రీడించును.

శ్లో॥ విరాడ్ఢిరణ్యరూపశ్చ । హ్యవ్యాకృత ఇతీరితః. 20
తురీయః పరమాత్మేతి । పంచధా వర్తతే పరః

తదాజ్ఞయా పరివర్తంతే । సదా బ్రహ్మాండకోటయః. 21
తదీక్షణాకృతా లోకా । లీయంతే తన్నిమీలనే.

తా॥ యీబ్రహ్మయే విరాట్ అనిన్నీహిరణ్యగర్భుడనిన్నీ అవ్యాకృతుడనిన్నీ తురీయుడనిన్నీ పరమాత్మయనిన్నీ పెద్దలచేనయిదునిధములయి యున్నట్టు తలంచబడును. ఆయన యొక్క అజ్ఞచే అనేకకోటిమండలములు ప్రవర్తించును, ఆయనకన్నుతెరచుటవలన గలిగినలోకములు ఆయనకన్నుమూయుటచే ఆయనయందే లయించును.

శ్లో॥ ఏవం బ్రహ్మాండరూపస్సన్ । విహరత్యజ ఈశ్వరః. 22
తస్మాద్దేవాః జగత్సర్వం । యాతవ్యం తత్స్వరూపకమ్.
బ్రహ్మాండసృష్టిః కథితా । యుష్మాకం ధర్మవర్తినాం. 23
తస్మాద్దేవద్విధిద్వైవ్యం । సంశయం వో విముంచత

ఇతి సనాతనధర్మసంహితాయాం బ్రహ్మాండోత్పత్తిర్నామచతుర్థోధ్యాయః.

తా॥ యీప్రకారము బ్రహ్మాండరూపుడయి భగవంతుడు విహరించును. గనుక దేవతలారా! యీజగత్తును బ్రహ్మముగానే తెలుసుకొనవలయును. గనుక బ్రహ్మాండోత్పత్తిని తెలుసుకునినం దేహరహితులయి మీరుబ్రహ్మస్వరూపులయి వర్తింతురుగాక.—

ఇది సనాతనధర్మసంహితయందు చతుర్థాధ్యాయ
తాత్పర్య సంగ్రహము.

---

అథపంచమోఽధ్యాయః.



వర్ణాశ్రమధర్మనిరూపణమ్.

శ్లో॥ దేవా స్సర్వే సమస్కృత్య । భగవంతం సనాతనమ్
వర్ణాశ్రమవిధిం తే వై । పప్రచ్ఛ ర్వినయాన్వితాః.

బ్రహ్మర్షిస్త్వనువాచేదం । వర్ణాశ్రమసులక్షణం
దేవా స్సృష్టిశ్చ సంతుష్టా । స్త్వద్భక్త్యా చ ముదాన్వితాః. 2

తా॥ సమస్తదేవతలు సనాతనబ్రహ్మర్షిని గూర్చి నమస్కరించి భక్తియుక్తులయి వర్ణాశ్రమవిధుల నడిగినవారయిరి. అనంతరమూ దేవతలయొక్క భక్తివిషయములకు సంతసించి ఆబ్రహ్మర్షి వర్ణాశ్రమవిధిని చెప్పుచున్నాడు.

శ్లో॥ శృణుధ్వం దేవతా । స్సర్వే ధర్మం వర్ణాశ్రమస్య తు
పూర్వం పంచముఖో బ్రహ్మ । విశ్వాత్మా చ బభూవహ. 3
తస్య పంచముఖేభ్యశ్చ । జాతాః పంచర్షయ శ్శుభాః
సానగశ్చాపి బ్రహ్మర్షి । స్సనాతనఋషి స్తథా. 4
అహంభూనాభ్యో మహర్షిశ్చ । ప్రత్నర్షిశ్చ తథాఽపరః
సువర్ణాఖ్య శ్చ బ్రహ్మర్షి । ర్జాతా స్సత్వప్రధానకాః. 5

తా॥ ఓ దేవతలారా! వర్ణాశ్రమవిధిని వినుడి పూర్వము సర్వాత్మస్వరూపుండయిన పంచముఖబ్రహ్మ యుండెను. ఆయనయొక్క పంచముఖములవలన అయిదుగురు బ్రహ్మఋషులు పుట్టిరి. సత్వప్రధానులయిన సానగ సనాతన అహంభూన ప్రత్న సువర్ణ అనుఅయిదుగురు ఋషులు గలిగిరి.

శ్లో॥ త ఏవ పంచకర్తార । స్సర్వలోకస్య కీర్తితాః
మను ర్మయ స్తథా త్వష్టా । శిల్పీ దైవజ్ఞ నామకః, 6
తే యుక్తాః పంచశక్తిభి । ర్బ్రాహ్మణాన్ సస్సృజు శ్శుభాన్.

తా॥ వారే సర్వలోకములకు సృష్టి స్థితి లయ తిరోధానానుగ్రహ కర్తలు యీపంచకర్తలనామములు మను మయ త్వష్ట శిల్పి విశ్వజ్ఞులని చెప్పబడును. యీపంచకర్తలు పంచశక్తులవలన లోకహితార్థులైన బ్రాహ్మణులను సృజియించిరి.

శ్లో॥ తద్బాహుభ్యాం క్షత్రియాశ్చ । జాతా లోకైకనాయకాః ।
తదూరుభ్యాం విశో జాతాః । లోకవర్తనహేతవః
పద్భ్యాం శూద్రా అజాయంత । క్రోధాచ్చండాలజాతయః.

తా॥ ఆవిరాట్పురుషునియొక్క బాహువులవలన క్షత్రియులు ప్రభువులుగా పుట్టిరి ఆయనయొక్క ఊరువులవలన లోకప్రవర్తకులైన వైశ్యులు గలిగిరి ఆ భగవంతునిపాదములవలన శూద్రులు గలిగిరి. తామసమువలన చండాలులు గలిగిరి.

శ్లో॥ సత్వప్రధానం బ్రాహ్మణ్యం । క్షాత్రం రాజస ముచ్యతే
వైశ్యం రజస్తమోమిశ్రం । తామసం శూద్ర ముచ్యతే
చాండాలం సూరిభిః ప్రోక్తం । మహాతామసజం భువి
తస్మాత్పంచవిధం జ్ఞేయం । మానుషాణాం కులం బుధైః.

తా॥ బ్రాహ్మణవంశము సాత్వికప్రధానమైనది క్షత్రియవంశము రజోగుణప్రధానమైనది వైశ్యవంశము రజస్తమోగుణమిశ్రమమైనది శూద్రవంశము తామసగుణప్రధానమైనది చండాలకులము మహాతామసగుణప్రధానమైనది ఆకారణమువలన పండితులచే మనుష్యులకు కులములైదువిధములుగా నియమింపబడెనని తెలుసుకొనవలయును.

శ్లో॥ సత్వం రజస్తన్మిశ్రం । తామసం గాఢతామసం
వర్ణానాం తం గుణాన్ జ్ఞేయాః । ప్రభావా ద్విశ్వకర్మణః.

తా॥ సత్వము రాజసము మిశ్రము అనగా రాజసతామసమిశ్రము తామసము గాఢతామసము ఈ అయిదుగుణములు ఐదువర్ణములకు స్వభావములుగా విశ్వకర్మయొక్క ప్రభావమువలన గలిగెనని తెలియవలయును.

శ్లో॥ తపఃక్షాంతి ర్దయా శౌచం । మాన మింద్రియనిగ్రహః
విద్యాభ్యాసో ఋజుత్వం చ । సదా సత్యప్రభాషణమ్. 10

సంతుష్టి స్సమతా చేతి । బ్రాహ్మం కర్మ స్వభావజం

తా॥ తపస్సు ఓర్పు దయ శుచిత్వము మౌనము ఇంద్రియ నిగ్రహము వేదపాఠము అనుకూల సత్యసంభాషణ సంతోషము సమభావము బ్రాహ్మణులకు స్వభావకర్మములు.

శ్లో॥ తేజో ధార్ష్ట్యంచ శౌర్యంచ । దాన మీశ్వరతా తథా. 11
యుద్ధోత్సాహ శ్చ విద్వత్త్వం । ధైర్యం దాక్షిణ్యమేవచ
విషయే ష్వనసక్తిత్వం । యుద్ధే చాప్యపలాయనమ్ 12
ధర్మాణాం రక్షణం చేతి । క్షాత్రం కర్మ స్వభావజం

తా॥ తేజస్సు ధృష్టత్వము శౌర్యము దానము అధికారత్వము యుద్ధమందు వెనుకదీయకుండుట వర్ణాశ్రమధర్మసంరక్షణము ఇవి క్షత్రియులకు స్వభావకర్మము.

శ్లో॥ అద్రోహ స్త్వవ వాణిజ్యం । ధనవృద్ధి స్తథా ధృతిః 13
దైవబ్రాహ్మణభక్తి శ్చ । గవాంపాలన మేవచ
ఈశ్వరోపాసనం చేతి । వైశ్యం కర్మ స్వభావజమ్. 14

తా॥ మోసముచేయక వర్తకముచేయుట వస్త్రవ్యాపారము ధైర్యము దేవబ్రాహ్మణవిశ్వాసము గోసంరక్షణము భగవత్సేవయు వైశ్యకులమునకు సహజకర్మము.

శ్లో॥ దాసత్వం దైవభక్తి శ్చ । బ్రాహ్మణోపాసనం తథా
హింసాచౌర్యవిహీనత్వం । శౌద్రంకర్మ స్వభావజమ్. 15

తా॥ బ్రాహ్మణాదిసేవ బ్రాహ్మణుల నుపాసించుట హింసాచోరత్వము లేకయుండుట శూద్రకులమునకు సహజకర్మము.

శ్లో॥ తేషాం వృత్తిం ప్రవక్ష్యామి । వర్ణినాం జీవహేతుకాం
యాజనం చతథావిద్యా । ధ్యాపకత్వ ప్రతిగ్రహం. 16
పంచకృత్యేషు నైపుణ్యం । శిల్పశాస్త్రవ్యభిజ్ఞతా
వాస్తుశాస్త్రాభిజ్ఞతాచ । ధాతువాద స్తథైవచ. 17

జీవికాభి రనేకాభి । హింసాచౌర్యాదికం వినా
బ్రాహ్మణో జీవనం కుర్యా । త్సదా సంతుష్టమానసః. 18

తా॥ ఆపద్గ్రస్తులకు జీవనోపాధిని చెప్పుచున్నాను. యజ్ఞము చేయించుట విద్య చెప్పుట దానముపుచ్చుకొనుట, శిల్పశాస్త్రమునుగుర్తెఱిగి అయోదారుతామ్రశిలసువర్ణకర్మలయందుపాండిత్యము వాస్తుశాస్త్రవిజ్ఞత్వము ధాతువాదము అవగా నయినన్ని అటువంటి హింసాచౌర్యరహితములయిన అనేకసద్వృత్తులచే యదృచ్ఛాలాభసంతుష్టిగలిగి బ్రాహ్మణులు జీవించవలయును.

శ్లో॥ యుద్ధే శత్రూన్పరాజిత్య । ధర్మాత్ శుద్ధమనా శ్శుచిః
ప్రజానాం రక్షణం కుర్వ । న్సర్వదా విజితేంద్రియః. 19
స్వభృత్యానాం రక్షణంతు । కుర్వ న్రాజా త్వతంద్రితః
దండనీత్యాదివిద్యాభి । ర్వినీతో గురుభి ర్దృఢం. 20
ధనార్జనపరో నిత్యం । ధర్మశాస్త్రవిధానతః
ఔరసానివ పశ్యేత । స్వరాజ్యస్థా స్సదా ప్రజాః, 21
ఏవం ధర్మరతో భూత్వా । క్షత్రో జీవేన నాన్యథా
స్వవంశ్యాన్ క్షత్రియో రాజా । స్వకులోచితకర్మభిః. 22
వర్తయేత్ జీవికాదానాత్ । స్వజనస్య చ రక్షకః

తా॥ ధర్మయుద్ధమందు శత్రుల నోడించి పరిశుద్ధచిత్తముచే ద్రవ్యమార్జించి నియతమనస్కుండయి ప్రజాసంరక్షణచేయుచు, స్వభృత్యులనుప్రమాదములేక రక్షించుచుగురువులచే శిక్షించబడి దండనీత్యాదివిద్యలచే నిత్యము ద్రవ్యార్జనపరుండయి తనరాజ్యమందలి ప్రజలను తనపుత్రులవలెభావించవలయును. యీధర్మములచే క్షత్రియుడు జీవించవలయును. యితరవృత్తులయందు చేరరాదు. క్షత్రియుడయినప్రభువు స్వవంశజులను హీనవృత్తియందు చేరనీయక స్వకులోచితవ్యాపారములచే రక్షించవలయును.

శ్లో॥ క్రయవిక్రయణం కుర్యాత్ । వ్యాపారేణ తథా కృషిం. 22
పశూనాం పాలనం కుర్వన్ । స్థైర్యవాన్ ధైర్యవాన్ శుచిః
ధర్మార్జనం ప్రకుర్వీత । బుద్ధ్యా శాస్త్రవిధానతః. 23
విశ్వస్తానాం న్నవంచీయాత్ । దైవస్య స్వస్వపీష్ఠపి ధార్మికః
గవాం సంరక్షణం కుర్యాత్ । ద్దయాదాక్షిణ్యాన్వితస్వరః. 24
ఏవం విధవ్రతీ భూత్వా । వైశ్యో జీవేత నాన్యథా.

తా॥ మోసములేనివ్యాపారము చేయుచున్నవాడయి వ్యవసాయము చేయును గోసంరక్షణచేయును ధైర్యస్థైర్యములు శుద్ధులుగలవాడయి న్యాయమైనవృత్తిచే ధనసంపాదనచేయవలయును ధర్మాత్ముడయినవైశ్యుడు నమ్మినవారిని మోసముచేయరాదు. అమితదయచే గోసంరక్షణ చేయవలయును యీలాగువ్రతస్థుడై వైశ్యుడు జీవించవలయును.

శ్లో॥ బ్రాహ్మణాన్ ప్యుపాసీత । పరమార్థవిద శ్శుచిః
మోక్షార్థీ నిర్మలః కుర్యాత్ । ద్దయివతోపాసనం తథా. 28
హింసా చౌర్యాది రహిత । శ్శూద్రో జీవేత నాన్యథా
హింసా చౌర్యాది రహిత । శ్చండాల శ్శ్రేష్ఠసేవయా. 29
జీవేత చాన్యథా కుర్వన్ । రౌరవం నరకం వ్రజేత్
ఏవం వః కథితో ధర్మో । వర్ణానాం దేవతా శ్శుభాః
విదిత్వైవనం నర స్సమ్య । గిహాముత్ర సుఖం వ్రజేత్. 30
ఇతి సనాతనధర్మసంహితాయాం వర్ణధర్మోనామ పంచమోఽధ్యాయః.

తా॥ శూద్రుడు ఇహపరసాధనముకొరకు మహాత్ములను సేవించవలయును ధనార్జనకొరకు రాజసేవ చేయవలయును పరిశుద్ధుడయి ధనార్జనకొరకు వైశ్యులనుకూడా సేవించవలయును. గోసంరక్షణ అశ్వరక్షణ గజరక్షణ కోటలుమున్నగునవి కాపాడుట ఇది

ధనార్జనకొరకు చేయవలయును బ్రహ్మవేత్తలైన బ్రాహ్మణులను శుద్ధమనస్కుడయి మోక్షార్థియై సేవించవలయును. అటువలెనే భగవంతుని సేవించవలయును. హింసయు చోరత్వము లేనివాడయి శూద్రుడు జీవించవలయును. ఛండాలులు హింసా దొంగతనములు లేక పై నాలుగువర్ణములను సేవించి జీవనము చేసేది లేనియెడల నరకమును చెందును. ఓ దేవతలారా! వర్ణధర్మ చెప్పబడెను. యీధర్మములను తెలుసుకున్నవాడు ఇహపరసుఖములను పొందును.

ఇది సనాతనధర్మసంహితయందలి పంచమాధ్యాయ
తాత్పర్యసంగ్రహము.

అథ షష్ఠోధ్యాయః.

బ్రహ్మచర్యాశ్రమధర్మాః.

బ్రహ్మర్షి రువాచ.

శ్లో॥ అథ బ్రహ్మచారిణాం ధర్మాన్ వక్ష్యే । దేవతాః శ్రుణుతాదరాత్
యాన్ వై విజ్ఞాయ మర్త్యేషు । ముక్తిభాజో భవంతిహి. 1

తా॥ బ్రహ్మర్షి చెప్పుచున్నాడు. ఓ దేవతలారా! యే ఆశ్రమవిధులను గుర్తెరిగినవారు ముక్తిని పొందుదురో ఆవిధిని చెప్పెదవినుడి.

శ్లో॥ ఉపనీతో వటుర్వేదా । నధీయీత సమాహితః
దండం యజ్ఞోపవీతంచ । మేఖలాం చ తథైవ చ 2
చిత్రాసనం చ కాషాయం । శుక్లం వా వస్త్రముత్తమం
ధారయేన్మంత్రితో విద్వాన్ । స్వసూత్రోక్తయికమార్గతః.

తా॥ వటువు ఉపనీతుడయి శ్రద్ధతో వేదములనుజదువవలయును దండము యజ్ఞోపవీతము మేఖలము అపగాదర్భత్రాడు చి

చిత్రాసనము కాషిదిగాని శుభ్రమైనదిగాని వస్త్రము న్యాయ్యమాత్ర ప్ర
కారము ధరించవలయును

శ్లో॥ భిక్షాహారో యథాకామం గురుశుశ్రూషణే రతః
ధారయేచ్చ స్వశాఖోక్తం । దండం కేశాంతికం వటుః. 4
అశ్వత్థో వా ఋజుం సౌమ్య । మవ్రణం త్వగ్విభూషితం
సాయంప్రాత రుపాసీత । సంధ్యాం బ్రాహ్మ్య స్సమాహితః.

తా॥ తనఇచ్ఛకొలది మధుకరాన్నము భక్షించి గురుశుశ్రూషచేయుచు తనపరిమాణముగల స్వశాఖోక్తదండమును ధరించవలయును. స్వశాఖదండము దొరకనిచో పుప్పిలేనిచర్మముగల అశ్వత్థదండముధరించేది సాయంప్రాతఃకాలములయందు సంధ్యావందనమాచరించవలయును.

శ్లో॥ కామంక్రోధంతథాలోభం । మోహంచైవవివర్జయేత్
అగ్నికార్యం తథా కుర్యా ! త్సాయంప్రాత స్స్వసూత్రతః.
దేవాన్ ఋషీన్ పితౄన్ స్నాత్వా । తర్పయేద్బ్రాహ్మణోత్తమః
సమిద్ధాగ్నిసముద్భవేన । విరజానలజేన చ. 6
అగ్నిహోత్రసముద్భవేన । భస్మనానలజేన తు
అగ్నిరిత్యాదిభి ర్మంత్రై । ర్పంచాజ్యాహుతిపూర్వకమ్. 7

తా॥ కామక్రోధాదులను విడువవలయును. స్వసూత్రప్రకారము సాయంప్రాతఃకాలములయందగ్నికార్యము చేయవలయును. స్నానమాచరించి దేవర్షిపితృతర్పణములను చేయవలయును. జలముతోసహా అగ్నిరిత్యాదిమంత్రములచే అగ్నికార్య భస్మమును ధరించేది.

శ్లో॥ విమృజ్యాంగాని సర్వాణి । సముద్ధూళ్య తతః పరమ్
తిర్యక్త్రిపుండ్ర మురసా । లలాటేన కరాదిభిః.

గ్రీవ కూర్చ శుచి ర్భూత్వా । బ్రహ్మధ్యాన పరాయణః
సద్యోజాతాదిభి ర్మంత్రై । ర్ధారయేద్బ్రాహ్మణస్సదా. 9
త్రియాయుషం జామదగ్నేతి । సర్వమంత్రైశ్చ బ్రాహ్మణః
పర బ్రహ్మార్చనం కుర్యా । త్పుష్పాద్యైః పత్రితోఽ స్వతః.10

తా॥ ముందు వట్టి భస్మము శరీరమున పూసి అనంతరం శిరోలలాట భుజ వక్ష హస్తములయందుంచుకునేది. శుచిర్భూతుడయి పరబ్రహ్మను ధ్యానించవలయును సద్యోజాతాది మంత్రములు చేతను త్ర్యాయుషం అను మంత్రము చేతను భస్మ ధరించవలయును. పుష్పములచేగాని పత్రములచేగాని పరమాత్మను పూజించవలయును.

శ్లో॥ మాతరం పితరం జ్యేష్టం । తథా వృద్ధం స్వకం గురుం
అధ్యాత్మజ్ఞానినం నిత్యం । శ్రద్ధయా వాభివాదయేత్. 11
అసావహంభో నామాస్మి । సమ్యక్ప్రణతిపూర్వకమ్
ఆయుష్మాన్భవ సౌమ్యేతి । వాచ్యో బ్రహ్మాభివాదనే. 12
అకారశ్చాస్య నామ్నోఽంతే । వాచ్యః పూర్వాక్షరప్లుతః
వ్యత్యస్తపాణినా కార్య । ముపసంగ్రహణం గురోః. 13

తా॥ తల్లిని తండ్రిని అన్నను పెద్దలను స్వగురువును వేదాంతిని "అహంభో అభివాదయే" అని శ్రద్ధతో నిత్యమున మస్కరించవలయును. చేతులును కుడి యెడమలుమార్చి గురువును నమస్కరించేది.

శ్లో॥ సవ్యేన సవ్యస్స్ప్రష్టవ్యో । దక్షిణేనతు దక్షిణః
లౌకికం వైదికం వాపి । తథాధ్యాత్మికమేవ వా. 14
ఆదదీత యతో జ్ఞానం । తం పూర్వమభివాదయేత్
మాతా పితృస్తు వంశ్యాశ్చ । గురువంశ్యా స్తథాధికాః. 15
అనువర్తేత మనసా । వాచా కాయేన సర్వదా
గురుం స్పృష్ట్వాసముత్తిష్టే । న్నమస్కృత్వా కృతాంజలిః.16

తా॥ యెడమచేతిచే సమిధలున్నూ కుడిచేతిచే కుడికాలున్నూ తాకించి గురువుకు నమస్కరించేది లౌకికమయినటువంటి విద్యలను నేర్పుగురువులు చెప్పేవారికి ముందుగ నమస్కరించేది మనోవాక్కాయకర్మలచేత తల్లిదండ్రులనున్నూ గురుజనులనున్నూ అనుసరించవలయును. గురువు వచ్చినప్పుడు లేచి నమస్కరించి వినయముగా సంభాషించవలయును.

శ్లో॥ తేనైవాభిహితం పఠ్యాత్ । స్వయమాసీనో న్యధావతః
సత్యమేవ వదేన్నిత్యం । మధురం చ న విస్మరేత్. 17
నిత్యనైమిత్తికం కర్మ । మోక్షకామనయాఽథవా
విద్యార్థమితి బుధ్యా వా । శాంతో భూత్వా సమాచరేత్.
భిక్షామాహృత్య నియతో । గృహేభ్యో బ్రాహ్మణానామ్
నివేద్య గురవేఽశ్నీయాత్ । ద్విశ్చాపి దినే దినే. 19
భవత్పూర్వం చరేద్భైక్ష్య । ముపనీతో వటుస్తథా
భవన్మధ్యం తు రాజన్యో । వైశ్యస్తు భవదుత్తరం. 20
అభిశస్తేషు సర్వేషు । భిక్షాం నిత్యం వివర్జయేత్.

తా॥ ఆయన యాజ్ఞవలన కూర్చుండవలయును. నిత్యమున్నూ సత్యము సంభాషించవలయును. చదివినది మరువరాదు. నిత్యనైమిత్తిక కర్మలు శాంతుడయి విద్యనిగాని మోక్షమునకుగాని చేయవలయును. బ్రాహ్మణగృహములవల్లనుంచి మధుకరాన్నము సంపాదించి, గురువునకు చూపి వారి యాజ్ఞవలన భక్షించేది బ్రాహ్మణుడు "భవాన్ భిక్షాందేహి" యనిన్ని క్షత్రియుడు "భిక్షాంభవాన్ దేహి" యనిన్ని వయిశ్యుడు "భిక్షాందేహి భవాన్" అనిన్ని బ్రహ్మచర్యమందు భిక్షాన్నమును సంపాదించవలయును.

శ్లో॥ ప్రాఙ్ముఖోఽన్నాని భుంజీత । సూర్యాభిముఖ ఏవవా. 21
ప్రక్షాళ్య చరణౌ హస్తౌ । ద్విరాచమ్యాఽన్నభుగ్భవేత్.

ప్రాణాయామేత్యాదిభిర్మంత్రైః । హుత్వా ప్రాణాహుతీః పృథక్.

తా॥ పాదప్రక్షాళనము చేసి రెండుసార్లు ఆచమనంచేసి తూర్పుముఖముగా గాని సూర్యాభిముఖుడుగాగానిఅయి భుజించవలయును తరువాత ప్రాణాహుతిపూర్వకముగాభుజించవలయును.

శ్లో॥ వేదాభ్యాసైకనిష్ఠశ్చ । నాన్యస్మింస్తిరతో భవేత్.
ఏవమభ్యాసతస్తస్య । వైరాగ్యంజాయతే యది, 23
పరివ్రజేత్పరమే హంసే । మోక్షకామనయోద్భృతః
నైష్ఠికోవా గృహీవాపి । భవేత్కామీ యథారుచి. 24

ఇతి సనాతనధర్మసంహితాయాం బ్రహ్మచర్యాశ్రమవిధిర్నామ షష్ఠోఽధ్యాయః.

తా॥ వేదాభ్యాసము చేయుచు ఇతరమంత్రాదులనభ్యసించరాదు. ఈప్రకారము విరాగియైతే విధిపూర్వకముగా సన్యసించవలయును. సకామియైతే స్నాతకుడుగాని గృహస్థుడుగాని కావలయును ఇది సనాతనధర్మసంహితయందలి షష్ఠోఽధ్యాయతాత్పర్య సంగ్రహము

---

అథ సప్తమోఽధ్యాయః.

గృహస్థాశ్రమవిధిః.

బ్రహ్మః.

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామి । గార్హస్థ్యంసంగ్రహేణతు
అధీత్య వేదాన్విధివ । ద్బ్రహ్మచర్యేణ వర్త్మనా. 1
ఆచార్యానుజ్ఞయా యుక్త । స్స్నాత్వా గార్హస్థ్యమాచరేత్
అథానుకూలే గోత్రే చ । ప్రవరాదివివర్జితే. 2
స్వసూత్రేచైవ మార్గేణ । వరయేత్కులజాం స్త్రియం
సర్వలక్షణసంపన్నాం సాధ్వీం కన్యాంవివాహయేత్. 3

శ్లో॥ యాజనాఽధ్యాపనాభ్యాం చ । విశుద్ధేభ్యః ప్రతిగ్రహాత్
యాత్రార్థ మార్జయే ద్ద్రవ్యం । యాగార్థం చ బుధో త్తమాః

తా॥ యజ్ఞముచేయించుట వేదముచెప్పుట ధర్మనిష్ఠవలన ప్రతిగ్రహించుట యజ్ఞార్థమున్నూ యాగార్థమున్నూ వీటివలన ధనము సంపాదించవలయును.

శ్లో॥ నిర్జనే నిర్భయే దేశే । విణ్మూత్రాది న్విసర్జయేత్
ప్రక్షాళయే ద్గుదం శిశ్నం । పాదద్వంద్వం కరద్వయం. 9
మృజ్జలాభ్యాం యథాశక్తి । గంధలేపనివృత్తయే
యావన్మాత్రాత్ సమ్యక్ఛుద్ధి । స్తావచ్ఛౌచం విధీయతే. 10

తా॥ నిర్జనము నిర్భయము నగుప్రదేశమందు మలమూత్ర విసర్జన చేయవలయును. ఆయాయవయవములను విశేషముగా శుద్ధి చేయవలయును గంధాదినివృత్తికొరకు మృత్తికాశౌచము చేయవలయును మనశ్శుద్ధికలుగువరకు నీప్రకారముశుద్ధిచేయవలయును.

శ్లో॥ పశ్చా దాచమనం కుర్యాత్ । ద్దంతకాష్ఠం సమాచరేత్
ద్విరాచమ్య పునస్స్నాత్వా । కృత్స్న శేషం సమాపయేత్.
ప్రాణాయామత్రయం కుర్యాత్ । గాయత్రీం చ జపే న్నరః
ఉపస్థానం తతః కుర్యాత్ । ద్వేదపారాయణం తతః. 12

తా॥ అనంతరము ఆచమనముచేసి దంతకాష్ఠము సంపాదించవలయును. దంతధావనానంతరమందు రెండుసార్లు ఆచమనం చేసి స్నానముచేయవలయును అనంతరం సంధ్యను ఉపాసించవలయును మూడుప్రాణాయామములుచేసి అనంతరమందు గాయత్రీ జపంచేయవలయును తదుపరి సూర్యునుపాసించి వేదపారాయణము చేయవలయును.

శ్లో॥ బ్రహ్మయజ్ఞం తతఃకుర్యాత్ । న్మధ్యాహ్నేవ సమాచరేత్
అన్యాని యాని కర్మాణి । తాని నిత్యం సమాచరేత్. 13

అగ్నికార్యం తతః కుర్యాత్ । ద్బలికర్మాదికం తథా
నిత్యశ్రాద్ధం తథా దాన । మశక్తానాం చ గచ్ఛతామ్. 14
దయాం సర్వేషు భూతేషు కుర్యాద్గార్హస్థ్య మానవః
యతిసంరక్షణం కుర్యా । దన్నపానాదిభిస్సదా. 15

తా॥ అనంతరము బ్రహ్మయజ్ఞము చేయవలయును, మాధ్యాహ్నముకూడా యథాప్రకారమాచరించి వైశ్వదేవము చేసి భూతములకు బల్యన్నము పెట్టవలయును నిత్యపితృతర్పణమును కొంచెముగా దానమును అనాథరక్షణయును సర్వభూతదయయు గృహస్థుడాచరించవలయును అన్నపానాదులచే యతిని పూజించవలయును.

శ్లో॥ ఏకవారం గృహీ నిత్య । మశ్నీయాదుత్తమం హితమ్
ద్వివారం వా సమశ్నీయా । ద్ద్వాత్రింశద్గ్రాస ముద్వహేత్.
జంబీరఫలతుల్యేన । గ్రాసం ప్రాశ్నీత సమోదవాన్
హోమే జలే చ భుక్తౌ చ । గురువృద్ధాద్యుపాసనే. 17

తా॥ గృహస్థు దినమునకు ఒకసారిగాని రెండుసార్లుగాని ముప్పదిరెండు కబళములు భుజించేది నిమ్మపండంత ప్రమాణముగా అతిసంతోషముగాని అతిదుఃఖముగాని లేనివాడయి గ్రాసమును భక్షించవలయును. హోమదేవపూజాదులు సయజ్ఞోపవీతుండయి చేయవలయును.

శ్లో॥ తద్ధైవాఽఽచమనే యజ్ఞో । పవీతి స్యాన్న చాఽన్యథా
వైణవీం ధారయేద్యష్టిం । సోదకం చ కమండలుం. 18
ఉద్ధూళనం సకృత్కుర్యా । త్సర్వదాచోక్తవర్త్మనా
త్ర్యంబకేన మంత్రేణ । సతారేణాఖిలేన చ. 17

తా॥ ఉదకముతోకూడిన పాత్రయును వెదురు కఱ్ఱయు ధరించవలయును. ముందు త్రియంబకమంత్రముచే భస్మము పూసు

సన్యసేత్సర్వకర్మాణి । వేదాంతాభ్యాసయత్నవాన్
వేదాంతశ్రవణాభావే । పతితోఽయం భవేద్ధ్రువమ్ 27

తా॥ నిత్యము సత్క్రియములను వదించవలయును, బ్రాహ్మణు డీప్రకారముచేసి విరక్తుడైనయెడల వేదాంతాభ్యాసముచే కర్మ సన్యాసికావలయును సన్యసించివేదాంతవిచారణలేనియెడలపతితుడగును.

శ్లో॥ విరక్తోఽప్యముముక్షుశ్చే । ద్ధంసోవా సన్యసేద్గృహే
బహూదకోవా శక్తశ్చే । న్యసేద్బ్రాహ్మణః కుటీచరః. 28
అవిరక్తో గృహే చాంతే । వానప్రస్థం సమాశ్రయేత్
అథవా యావదాయుష్యం । గార్హస్థ్యం సమ్యగాచరేత్. 29

తా॥ ఆసన్యాసమునందు తనయధికారముకుతగినటుల కుటీచక బహూదక హంస పరమహంసలలో నొకడు కావలయును వైరాగ్యముచాలనిచో గృహస్థాశ్రమమునుండి వానప్రస్థముస్వీకరించవలయును. వైరాగ్యములేనిచో అంతకాలమువరకు గృహస్థుగానే యుండవలయును.

శ్లో॥ గృహస్థాదాశ్రమాత్సర్వే । సముత్పన్నా స్సురక్షితాః
తస్మాద్గృహాశ్రమవస్యా । దవిరక్తోబుధస్తథా. 30

ఇతి సనాతన ధర్మసంహితాయాం గృహస్థాశ్రమ విధిర్నామసప్తమోఽధ్యాయః.

తా॥ విరక్తలేనిపండితుడు గృహస్థుడేకావలయును. యేలయనగా గృహస్థునివలననితరులు రక్షించబడుదురు. గాన గృహస్థాశ్రమము శ్రేష్ఠతరము.

ఇదిసనాతనధర్మసంహితయందలి సప్తమాధ్యాయ
తాత్పర్యసంగ్రహము.

---

## అథ అష్టమోఽధ్యాయః.

### వానప్రస్థాశ్రమవిధిః.

శ్లో॥ అథాఽతస్సంప్రవక్ష్యామి । వానప్రస్థాశ్రమం సురాః
పుత్రే భార్యాం వినిక్షిప్య । గృహీత్వావా సమాహితః 1
శుక్లపక్షే శుభే వారే । శుభనక్షత్రసంయుతే
సుముహూర్తే వనం గచ్ఛే । ద్గృహస్థశ్చోత్తరాయణే. 2

తా॥ ఓదేవతలారా! వానప్రస్థాశ్రమమును చెప్పెద వినుడు వానప్రస్థాశ్రమము పొందనిశ్చయించిన పురుషుడు తనభార్యను పుత్రులయధీనము చేసిగాని వెంటబెట్టుకొనిగాని ఉత్తరాయణమందు శుక్లపక్షమందు శుభములయిన తిథి వార నక్షత్రశుభలగ్నములయందు అరణ్యమును ప్రవేశించవలయును.

శ్లో॥ యమాదిసహిత శ్శుద్ధ । స్తపఃకుర్యా త్సమాహితః
శాకమూలఫలాశీ స్యా । త్తే నేశం పూజయే ద్బుధః 3
గ్రామా దానీయ వాఽశ్నీయా। ద్గ్రాసా న్షోడశ బుద్ధిమాన్
జటాంచ బిభృయాత్తద్వ । న్నఖరోమాణి నోత్సృజేత్. 4

తా॥ యమనియమాదులతోకూడుకొని శుద్ధమనస్కుడై అరణ్యమందు శాకాదులను భక్షించి సావధానుడయి భగవంతుని ధ్యానించవలయును. అరణ్యమందు దొరకనిచో ఫలాదులనుగ్రామములనుండి తెచ్చుకొనిపదునారుకబళములను భక్షించవలయును జడలనుధరించి క్షౌరవర్జితుడయి గోళ్ళను పెంచవలయును.

శ్లో॥ వేదాభ్యాసం సదాకుర్యా । ద్వాగ్యతస్సుసమాహితః
అగ్నిహోత్రం చ జుహుయా । త్పంచయజ్ఞం సమాచరేత్.

తా॥ శుద్ధమనస్కుడయి చదివిన వేదమును పారాయణము
చేయవలయును. అగ్నియందు హోమముచేసి దేవయజ్ఞ బ్రహ్మ
యజ్ఞ పితృయజ్ఞ మనుష్యయజ్ఞములను చేయవలయును.

శ్లో॥ చీరవాసా భవేత్కుర్యా । త్స్నానం త్రిషవణం బుధః
సర్వభూతానుకంపే స్యా । త్ప్రతిగ్రహవివర్జితః. 6
ఏకవారం సమశ్నీయా । ద్రాత్రౌ ధ్యానపరో భవేత్

తా॥ నారచీరెలు ధరియించి త్రికాలములయందు స్నానం
చేయవలయును దానముతీసుకొనుట విడిచి సర్వభూతదయాపరుడై
నిత్యము నొకసారిభుజించి రాత్రియందు పరమాత్మధ్యానము చేయ
వలయును.

శ్లో॥ జితేంద్రియో జితక్రోధో । భవే దధ్యాత్మచింతకః. 7
భూమౌ శయీత గాయత్రీం । సతతంచజపే ద్బుధః
పరబ్రహ్మాష్టాక్షరం తు । మంత్రం ధ్యాయీత శుద్ధధీః. 8

తా॥ యింద్రియములను జయించి కామక్రోధాదులను
వర్జించి బ్రహ్మనిష్ఠను జెందవలయును భూమియందు పరుండవలెను.
నిత్యము గాయత్రియు విశ్వకర్మాష్టాక్షరీమంత్రమున్నూ జపముచే
యవలయును.

శ్లో॥ క్రోధ పైశున్య నిద్రాది । దూరతః పరివర్జయేత్
కృచ్ఛ్రచాంద్రాయణం కుర్యా । న్మాసి మాసి వనే స్థితః. 9
గ్రీష్మేపంచతపాశ్చ స్యా । ద్వర్షాస్వభ్రావకాశదః
ఆర్ద్రవాసాస్తు హేమంతే । క్రమశో వర్ధయే త్తపః. 10

తా॥ క్రోధ దుష్టబుద్ధి నిద్రాదులను దూరముగావిడుపించ
వలయును. ప్రతిమాసమందు కృఛ్రచాంద్రాయణాది వ్రతములాచ
రించవలయును గ్రీష్మఋతువునందు పంచాగ్ని మధ్యస్థుడయిన్నీ
వర్షఋతువునందుఆవరణములేనివాడయిన్నీ హేమంత ఋతువునందు

తడివస్త్రముతోగాని జలమందు కూర్చునిగాని క్రమముగా తపస్సును వృద్ధిపరచవలయును.

శ్లో॥ ఉపస్పృశ్య త్రిషవణం । పితృదేవాం శ్చ తర్పయేత్
ఏకపాదేన సంతిష్ఠే । ద్వాయుభక్షో జితేంద్రియః. 11
పయః పిబేచ్ఛుక్లపక్షే । కృష్ణపక్షే చ భస్మనామ్
శీర్ణపర్ణాశనో వాస్యా । త్కృచ్ఛ్రం వా వర్తయే త్సదా. 12

తా॥ మూడుకాలములయందు ఆచమానము చేయవలయును పితృదేవతాతర్పణము నిత్యముచేయవలయును ఒకపాదము మీాద నిలచి జపముచేసి జితేంద్రియుడయి వాయువును భక్షించవలయును శుక్లపక్షమం దుదకపానమున్నూ కృష్ణపక్షమందు భస్మము గాని రాలినఆకులుగాని భక్షించవలయును. కృచ్ఛ్రవ్రతమునాచరించవలయును.

శ్లో॥ యోగాభ్యాసపరోభూత్వా । ధ్యాయే ద్బ్రహ్మ సనాతనమ్
చిత్రాసనీ సోత్తరయో । శుక్లయజ్ఞోపవీతవాన్. 13
అథవా ఽగ్నిం సమారోప్య । స్వాత్మనిధ్యానతత్పరః
అనగ్ని రనికేతస్స్యా । న్మన్త్రిరో మౌనపరో భవేత్. 14

తా॥ నిత్యము చిత్రాసనమునందుకూర్చుని ఉత్తరీయమున్నూ యజ్ఞోపవీతమున్నూ ధరించి మనస్సునందు పరబ్రహ్మోపాసన చేయవలయును. అటుగానిచో అగ్నులనాత్మారోపణచేసుకుని అగ్నిహోత్రమున్నూ పర్ణశాలయు లేనివాడయినిత్యముసమాధిచేయవలయును.

శ్లో॥ సదోపనిషదభ్యాసే । యత్నవాన్ స్యాత్సమాహితః
త్రిపుండ్రోద్ధూళనం కుర్యా । ద్బ్రహ్మాస్త్రోక్తమంత్రితః. 15
యదా వైరాగ్య ముత్పన్నం తదైవప్రవ్రజేద్వనీ
బహూదకో వా హంసో వా । ముముక్షుః పరహంసకః. 16

సర్వసంగ్రహరూపేణ । సత్యముక్తం మయానఘాః
తస్మాత్సర్వప్రయత్నేన । శ్రద్ధయా విద్ధి సువ్రతాః. 17

ఇతి సనాతనధర్మసంహితాయాం వానప్రస్థాశ్రమవిధిర్నామ అష్టమోఽధ్యాయః.

తా॥ నిత్యము శుద్ధమనస్కుడయి వేదాంతముల నభ్యసించవలయును. గృహస్థునివలెనే భస్మధారణము చేయవలయును. విరక్తి అధికమైనప్పుడు సన్న్యసించవలయును. అందు బహూదకుడుగాని కుటీచకుడుగాని హంసగాని పరమహంసగాని కావలయును. ఓ దేవతలారా! సంగ్రహరూపముగా నాచే చెప్పబడినసీధర్మములను శ్రద్ధతో గ్రహింతురుగాక.

ఇది సనాతనధర్మసంహితయందలి అష్టమాధ్యాయ
తాత్పర్యసంగ్రహము.

---

## అథ నవమోఽధ్యాయః.

---

### సన్న్యాసాశ్రమవిధిః.

బ్రహ్మర్షిః.

శ్లో॥ అథాఽతస్సంప్రవక్ష్యామి । సన్న్యాసాశ్రమ ముత్తమమ్
పంచవిధాస్తు శిష్టాస్తే । భిక్షవో వృత్తిభేదతః. 1
కుటీచకో సురశ్రేష్ఠా । స్తథైవచ బహూదకః
హంసః పరమహంసశ్చ । తేషాం వృత్తిం వదామి వః. 2

తా॥ బ్రహ్మర్షి చెప్పుచున్నాడు. ఓ దేవతలారా! అనంతరమందు సన్న్యాసాశ్రమము చెప్పెద వినుండు. సన్న్యాసులు కుటీచకులనిన్ని బహూదకులనిన్ని అయిదువిధములు వారియొక్క వృత్తిని చెప్పెద వినుండు.

శ్లో॥ కుటీచరశ్చ సన్యాసీ । స్వే స్వేవర్త్మని నిశ్చితః
భిక్షా మాదాయ భుంజీత । స్వబంధూనాం గృహేగృహే. 3
శిఖా యజ్ఞోపవీతీస్యా । త్రిదండీ సకమండలుః
సపవిత్రశ్చ కాషాయీ । గాయత్రీం చ జపే త్సదా. 4

తా॥ కుటీచరసన్యాసి స్వకులగృహములయందు భిక్షసంపాదించవలయును. ఈయన కమండలమును త్రిదండమును శిఖాయజ్ఞోపవీతములున్నూ పవిత్రమున్నూ కాషాయవస్త్రమున్నూ ధరించి గాయత్రినిజపించవలయును.

శ్లో॥ సర్వాంగోద్ధూళనం కుర్యా । త్త్రిపుండ్రం చ త్రిసంధిషు
పరబ్రహ్మార్చనం కుర్యా । చ్ఛ్రద్ధయైవ దినేదినే. 5
బహూదకశ్చ సన్యాసీ । బంధుపుత్రవివర్జితః
పంచాగారం చరేద్భిక్షు । మేకాన్నం పరివర్జయేత్. 6

తా॥ సర్వావయవములయందు భస్మముధరించవలయును, ప్రతిదినమున్నూ పరబ్రహ్మను పూజించవలయును, బహూదకసన్యాసి బంధుపుత్రాదులను విడువవలయును. అయిదుగృహములయందు భిక్షచేయవలయును. ఒకయింట భిక్షచేయరాదు.

శ్లో॥ దర్భస్తంభేన సన్నద్ధం । త్రిదండం చ మనోరమం
పాత్రం జలపవిత్రం చ । కౌపీనంచ కమండలుమ్. 7
ఆచ్ఛాదనం తథా కంథాం । పాదుకాం ఛత్రి మద్భుతం
యోగదండం బహిర్వస్త్రం । మృక్షనిత్రం కృపాణికాం 8
సర్వాంగోద్ధూళనం తద్వ । త్త్రిపుండ్రం చైవ ధారయేత్.

తా॥ దర్భస్తంభముతో కట్టినత్రిదండమున్నూ జలముచే పవిత్రమైనకమండలమున్నూ కౌపీనమున్నూ గొడుగు పాదుకలు పచ్చంబడయు యోగదండమున్నూ పయివస్త్రము త్రివ్వుటకు గొడ్డా

తిలకము సూనకర్ణియు సర్వావయవములయందు భస్మముపూసి త్రిపుండ్రములున్ను ధరించవలయును.

శ్లో॥ శిఖాం యజ్ఞోపవీతంచ । దేవతారాధనే రతః।
స్వాధ్యాయే సర్వదా వాచ । ముత్సృజే ధ్యానతత్పరః 10
సంధ్యాకాలే చ సావిత్రీం । జపన్కర్మ సమాచరేత్
హంసః కమండలుం శిక్యా । భిక్షాపాత్రం తథైవచ. 11
కంథాం కౌపీన మాచ్ఛాద్యాం । త్యాగవస్త్రం బహిఃపటం
ఏకం తు వైణవం దండం । ధారయే న్నిత్య మాదరాత్.12

తా॥ శిఖాయజ్ఞోపవీతధారియై దేవపూజచేయవలయును. వేదమును పఠించుచు భగవద్ధ్యానముచేయుచు లోకవార్తను పలుకరాదు. సంధ్యాకాలములయందు గాయత్రిని జపించవలయును. పరమహంసకమండలమును భిక్షాపాత్రమును బొంతను దండమును ఆచ్ఛాది అంగవస్త్రమును బహిర్వస్త్రమునుఒక వెదురుకర్రనునిత్యము ధరింపవలయును.

శ్లో॥ త్రిపుండ్రోర్ధ్వపుండ్రధారణం కుర్యా । త్పంచవక్త్రంపరిపూజయేత్,
అన్తేం గ్రాసాం త్యక్త్వా న్నిత్య । మశ్నియా త్సశిఖం వపేత్.
సంధ్యాకాలే తు సావిత్రీ । జప మధ్యాత్మచింతనం
మౌనసేవాం తథాకృచ్ఛ్రం । తథాచాంద్రాయణాదికమ్.14
కుర్యా గ్గ్రామైకరాత్రేణ । న్యాయేనైవ సమాచరేత్.

తా॥ పూర్వవతుగా భస్మధారియై పంచముఖబ్రహ్మను పూజించవలయును శిఖాయజ్ఞోపవీతములు తీసి వేయవలయును మెనిమిదిముద్దలు అన్నమును భక్షించవలయును. సంధ్యాకాలములయందుగాయత్రిని జపించి వేదాంతవిచారణ చేయవలయును. మౌనముగానుండవలయును. కృచ్ఛ్రచాంద్రాయణముచరించవలయును. నిత్యమొకగ్రామము తిరిగి న్యాయవర్తన చేయవలయును.

శ్లో॥ పరమహంసస్త్రిదండం చ । రజ్జుం దర్భేణ నిర్మితం. 15
శిక్యం జలపవిత్రం చ । పవిత్రం చ కమండలుమ్
శిఖాయజ్ఞోపవీతం చ । నిత్యకర్మ పరిత్యజేత్. 16
కౌపీనాచ్ఛాదనం వస్త్రం । కంథాం శీతంవారికామ్.

తా॥ పరమహంస త్రిదండమున్నూ, దర్భత్రాడున్నూ, చిక్కమున్నూ జలపవిత్రముయిన కమండలమున్నూ ధరించవలయును శిఖాయజ్ఞోపవీతములున్నూ నిత్యకర్మలున్నూ విడువవలయును గోచియు, గంతయు ధరించేది

శ్లో॥ నాగపట్టం బహిర్వస్త్రం । పాదుకాం ధత్రి ముద్ధృతం. 17
అక్షమాలాం చ గృహ్ణీయాత్ । ద్వైణవం దండ మవ్రణమ్
“అగ్ని” ఇత్యాదిభి ర్మంత్రైః భస్మనా గుద్ధూళనం సదా. 18
“ఓం” మిత్యేవ తత్రైః ప్రోక్ష్య । సహంసేన త్రిపుండ్రకమ్

తా॥ నాగపట్టమున్నూ వస్త్రమున్నూ పాదుకలుగాడుగు రుద్రాక్షమాలిక వుచ్చలేని వెదురుకర్ర స్వీకరించి ‹‹అగ్ని›› ఇత్యాదిమంత్రములచే భస్మముచే పూయవలయును ప్రణవముచే త్రిపుండ్రము ధరించవలయును.

శ్లో॥ మృత్పాత్రం కాంస్యపాత్రం వా దారుపాత్రం చ వైణవమ్.
పాణిపాత్రం చ గృహ్ణీయాత్ । దాచమ్యైవ తథోదనం
మధూకరం తద్వా అన్నం । పరమహంసం తథాచరేత్ .20
నాత్యశ్నత స్య యోగో స్తి । నచైకాంత మనశ్నతః
తస్మాద్యోగానుగుణ్యేన । భుంజీత పరహంసకః. 21
అభిశస్తం సముత్సృజ్య । సార్వవర్ణిక మాచరేత్

తా॥ మట్టిపాత్రగాని కంచుదిగాని కొయ్యదిగాని వెదురుదిగాని పాత్రను ధరించవలయును. లేకుంటే హస్తమే పాత్రగా నుపయోగించేది మధుకరాన్నము భక్షించవలయును మిక్కిలి భక్షించు

వారికిన్ని ఉపవాసముండువానికిన్ని రోగముకుగమనముగాన మితాహారముచేయవలయును. కొల్లుండినమనిషిగల యిల్లువిడిచి సర్వ్వస్థానములయందును భిక్షించవలయును.

శ్లో॥ ఉత్తరోత్తరలాభే తు । పూర్వపూర్వం పరిత్యజేత్. 22
కుటుంబాశ్రమయోర్నిత్య । మాత్మజ్ఞానం సమభ్యసేత్
స్నానం శౌచ మభిధ్యానం । సత్యాన్నృతవివర్జితం. 23
లోభమోహాపరిత్యాగం । దంభదర్పాదివర్జనం

తా॥ యెక్కువ సమాగమము దొరకకొలంది తక్కువదానిని విడచి కుటుంబాశ్రమచే జ్ఞానాభ్యాసము చేయవలయును స్నానము శౌచము ధ్యానము సత్యానృతములేకుండుట లోభము మోహము దంభము దర్పము యివిలేక యుండవలయును.

శ్లో॥ చాతుర్విధ్యం చ సర్వేషాం । వదంతి బ్రహ్మవాదినః. 24
కుటీచకశ్చ హంసశ్చ । తథైవచ బహూదకః
సావిత్రీ మాత్రసంపన్నా । భవేయుస్త్రిషుకాలతః. 25
ప్రణవాద్యాః పంచవేదాః । ప్రణవే పరిసంస్థితాః
తస్మాత్ప్రణవ మేవైకం । పరహంస స్సదా జపేత్. 26
సంధ్యాకాలే చ శుద్ధాత్మా । ప్రణవేన సమాహితః
షట్ప్రాణాయామకం కుర్యా । జ్జపే దష్టోత్తరంశతమ్. 27

తా॥ వేత్తలు సర్వవిధసన్న్యాసులకు చాతుర్మాసదీక్ష ముఖ్యమని చెప్పుదురు సర్వవిధసన్న్యాసులుబ్రహ్మగాయత్రినిజపించవలయును. పరమహంస ప్రణవమునే జపించేది సమస్తవేదములుప్రణవమునందే యిమిడియున్నవి. సంధ్యాకాలమునందుపరమహంసశుద్ధచిత్తుడై ప్రణవముచే నారుప్రాణాయామములు చేసిదానినే నూట యెనిమిదిసార్లు జపించవలయును.

శ్లో॥ వివిక్తదేశ మాశ్రిత్య । సుఖాసీన సమాహితః
యథాశక్తి సమాధిస్థో । భవేత్సన్న్యాసినాంవరః. 28
క్రమాద్వా క్రమతో విద్వా । నుత్తమాం వృత్తి మాశ్రితః
ఉత్తమాం వృత్తిమాపన్నో । ననీచాం వృత్తి మాశ్రయేత్.
ఉత్తమాం వృత్తి మాశ్రిత్య । నీచవృత్తిం సమాశ్రితః
ఆరూఢపతితో జ్ఞేయ । స్సర్వకర్మబహిష్కృతః, 30

తా॥ ఏకాంతమందు కూర్చుని సమచిత్తుడై యథాశక్తిగా సమాధినిష్టుడు కావలయును. ఉత్తముడైన సన్న్యాసి నీచవృత్తికి దిగరాదు దిగనేని పతితుడగునని చెప్పబడును

శ్లో॥ పరివ్రజంతం ఋషిం దృష్ట్వా । స్థానాచ్చలతి భాస్కరః
ఏష మే మండలం భిత్వా । బ్రహ్మలోకం గమిష్యతి. 31
రూపం తు ద్వివిధం ప్రోక్తం । చరంచాఽచరమేవ చ
చరం సన్న్యాసినాం రూప । మచరం మృణ్మయాదికమ్. 32
యస్యాశ్రమం శ్రితో నిత్యం । వర్తతే ఋషిసత్తమః
నతస్య దుర్లభం కించి । త్త్రిషు లోకేషు విద్యతే. 33

తా॥ సన్న్యసించుబ్రాహ్మణునిచూచి. ఇతడు నామండలముకు భేదించి బ్రహ్మముపొందునని సూర్యుడు బెదరును. భగవంతునికి రెండురూపములు ఒకరూపము సన్న్యాసి, రెండవది విగ్రహము, యెవరునియతుడైన సన్న్యాసియో ఆయనకు సమస్తలోకములయందు దుర్లభమయినదిలేదు.

శ్లో॥ బ్రహ్మచర్యాశ్రమస్థానాం । బ్రహ్మదేవః ప్రకీర్తితః
గృహస్థానాం తథా విష్ణు । ర్యతీనాం చ మహేశ్వరః. 34
వానప్రస్థాశ్రమస్థానా । మాదిత్యో దేవతా మతా
దర్శనా త్స్పర్శనా త్తస్య । సర్వం నశ్యతి పాతకం. 35
తస్మాత్సర్వేషు కాలేషు । పూజ్య స్సన్న్యాసమాశ్రితః.

తా॥ బ్రహ్మచారికి బ్రహ్మయు గృహస్థునకు విష్ణువు వానప్రస్థునకు రుద్రుడు సన్యాసికి సూర్యుడు అధిదేవతలు. సన్యాసుల యొక్క దర్శనస్పర్శనాదులవల్ల సమస్త పాపములు నశించును. గనుక సన్యాసి నిత్యముపూజ్యుడు.

శ్లో॥ సిద్ధింగతస్య హంసస్య । పరహంసస్య వా తథా. 36
ఆశౌచం నైవకుర్వీత । శుద్ధభూమౌ యథావిధి
తౌస్థాపయిత్వా తద్దేశే । బిల్వవృక్షం ప్రరోపయేత్. 37
యేన తత్కరోతి యస్సమ్యక్ । గశ్వమేధఫలం లభేత్.

తా॥ సిద్ధింగతులైన పరమహంసలయొక్క ఆశౌచము జ్ఞాతులకు లేదు. నేలనిపవిత్రభూమియందు నిక్షేపము చేసిఆస్థలములయందు బిల్వవృక్షమును స్థాపించవలయును. యీప్రకారము చేసినవారికశ్వమేధఫలమును పొందుదురు.

శ్లో॥ అవధూత స్తు సన్యాసీ । పంచమశ్చ ప్రకీర్తితః. 38
జీవన్ముక్త శ్చ విజ్ఞేయః । వర్ణాశ్రమ వివర్జితః
తస్య దర్శనమాత్రేణ । పాపా నశ్యంతి సర్వశః 39
తన్మహాత్మ్యం వర్ణయితుం ! బ్రహ్మణోపి సుదుర్లభమ్.

ఇతి సనాతనధర్మసంహితాయాం సన్యాసాశ్రమవిధిర్నామ నవమోఽధ్యాయః.

తా॥ అవధూత అయిదవసన్యాసి యని చెప్పబడును. ఆయనకు వర్ణాశ్రమములు లేవు. బ్రతికియుండియే ముక్తుడు ఆయనదర్శనమాత్రముచే సర్వజనులకు సమస్తపాపములు నశించును. ఆయన మాహాత్మ్యము చెప్పుటకు భగవంతునికశక్యము.

ఇది సనాతనధర్మసంహితయందలి నవమాధ్యాయ
తాత్పర్యసంగ్రహము.

## అథ దశమోఽధ్యాయః.

సదాచారే దేహకృత్యమ్.

శ్లో॥ దేవాః! శృణుత వక్ష్యామి । సదాచారస్య లక్షణమ్
సదాచారవతా పుంసా । జితౌ లోకా వుభౌ వపి. 1
బ్రాహ్మే ముహూర్తే చోత్థాయ । ధర్మ మర్థంచ చింతయేత్
కాయక్లేశం తదుద్భూతం । ధ్యాయీత మనసా చిరం. 2

తా॥ బ్రహ్మదేవుడు దేవతలతో చెప్పుచున్నాడు. ఓ దేవతలారా! యేసదాచారముచే నిహపరసిద్ధిగలుగునో దానిని చెప్పెదవినుడు పురుషుడు తెల్లవారుజామున లేచి ధర్మార్థములను యోచించవలయును. అందువల్లనైన శరీరకష్టసుఖములను యోచించవలయును.

శ్లో॥ నైఋత్యా మిషువిక్షేప । మతీత్యాఽభ్యధికం భువి
దూరాదావసథాం మూత్రం । పురీషం చ విసర్జయేత్. 3
దివా సంధ్యాసు కర్ణస్థ । బ్రహ్మసూత్ర ఉదఙ్ముఖః
అంతర్ధాయ తృణం భూమా । శిరః ప్రావృత్య వాససా. 4
వాచం నియమ్య యత్నేన । నిష్ఠీవోచ్ఛ్వాసవర్జితః
తిష్ఠం న్నాతిచిరం తత్ర । పురీషం నావలోకయేత్. 5

తా॥ గ్రామమునకు నైరుతిభాగముగా బాణవిక్షేపమాత్ర దూరమువెళ్ళి మలమూత్రవిసర్జన చేయవలయును రాత్రిపగలు జందెమును చెవికి చుట్టుకొని ఉత్తరముఖముగా కూర్చుండవలయును. భూమియందు యెండుగడ్డివేసి నెత్తికి గుడ్డచుట్టి ఉచ్ఛ్వాసమున్నూ ఉమ్మిన్నీవదలక మాట్లాడక బహుకాలముకూర్చుండక విసర్జించవలయును పురీషమును చూడకూడదు.

శ్లో॥ శౌచం కుర్యా త్ప్రయత్నేన । గంధలేపాపనుత్తయే
ఉద్ధృతాభి రద్భిర్మృద్భి । ర్యథాసంఖ్యం సమాచరేత్. 6

శుద్ధప్రదేశమందు మోకాలుకులోగా చేయివేసికూర్చుండవలయును బ్రహ్మతీర్థముచే ఆచమనంచేయవలయును.

శ్లో॥ పూర్వం గండూషయేత్పశ్చా । దాచమే చ్ఛవిధానతః
సపవిత్రేణ హస్తేన ॥ కుర్యా దాచమనక్రియామ్. 13
నోచ్ఛిష్టతత్పవిత్రం తు । భుక్త్వోచ్ఛిష్టం తు వర్జయేత్
ఉత్థాయ నేత్రే ప్రక్షాళ్య । దంతకాష్ఠం సమాచరేత్. 14
"ఆయు ర్బలంయశో వర్చః । ప్రజాః పశువసూనిచ
బ్రహ్మప్రజ్ఞాం చ మేధాం చ । త్వన్నో దేహి వనస్పతే."
ఇతి మంత్రం సముచ్చార్య । పశ్చా దాచమనం చరేత్.
ఆచమ్యైనం తతః పశ్చా । ద్దంతధావన మాచరేత్. 16
ఉపవిశ్య శుచౌ దేశే । ప్రాఙ్ముఖోదఙ్ముఖోఽపి వా
దంతకాష్ఠం శాస్త్రసిద్ధం । గృహీత్వా మంత్రపూర్వకమ్.17
"ఆప్యాయ" స్వేతిమంత్రేణ । ఆచరే ద్దంతధావనం.

తా॥ ముందుపుక్కిలించి తరువాత పవిత్రమును ధరించి ఆచమానము చేశేది ఉచ్ఛిష్టపవిత్రమును విడువవలయును. కళ్లుకడిగి లేచి దంతకాష్ఠముసంపాదించవలయును. "ఆయుః ప్రజా" అనుమంత్రముచే శాస్త్రసిద్ధమైన దంతకాష్ఠమును గ్రహించి "ఆప్యాయ" స్వేతి మంత్రముచే దంతధావనచేయవలయును.

శ్లో॥ అష్టమ్యాం చ నవమ్యాం చ । పంచదశ్యాం చ జన్మని. 18
తైలంక్షౌరం వ్యవాయం చ । దంతకాష్ఠం చ వర్జయేత్
ద్వాదశ్యాం ప్రతిపత్ షష్ఠ్యో । ర్మాతాపిత్రో ర్మృతేహని.
దంతకాష్ఠం చ తైలం చ । వర్జయేన్మైథునక్రియామ్

తా॥ అష్టమి నవమి అమావాస్య పౌర్ణమీలు జన్మనక్షత్రము, ఈతిథులయందు అభ్యంగనము క్షౌరము మైథునము దంత

శాస్త్రమును విడువవలయును. ద్వాదశి పాడ్యమి షష్ఠి అష్టమిలు వీట్లయందు పైన చెప్పినవి విడువవలయును.

శ్లో॥ ఋతుస్నాతాం నగచ్ఛేత । మాతాపిత్రోర్మృతేఽహని
ద్వాదశ్యాం చ చతుర్దశ్యాం । ఋతుగామీ న దోషభాక్
శుచి ర్ద్వాదశ గండూషైః । ర్నిషిద్ధదివసేషు చ.

తా॥ అష్టమిలయందు ఋతుమతియైనభార్యను పొందరాదు ద్వాదశి చతుర్దశులయందు ఋతుగామికి దోషములేదు. దంతధావన చెయ్యరాని దినమునందు పండ్రెండు సార్లుపుక్కిలించేది.

శ్లో॥ తృణపర్ణైస్తథాకుర్యా । ద్భోజనే భక్ష్యభక్షణే
ఆచమ్య ప్రయత స్సమ్య । క్ప్రాతస్స్నానం సమాచరేత్ 22
పవమానాఽనువాకేన । తథాచ ద్రుపదాదివ
అన్యై ర్లింగమంత్రైశ్చ । ప్రోక్ష్యస్నాయాద నంతరం.23

తా॥ ఆకులచేత గడ్డిచేత శుద్ధిచేయువలయును. ఆచమానం చేసినియతుడై ప్రాతస్స్నానముచేయవలయును. పవమానాదిమంత్రములచే మార్జన చేసిస్నానముసెయ్యవలయును.

శ్లో॥ స్నాత్వా తీరం సమాసాద్య । స్థిత్వాఽచమ్య విధానతః
స్థిత్వా పునః పూర్వముఖ । ముత్తరస్యోఽథవా బుధః. 24
పాదౌ ద్వా యుగ్మతః కృత్వా । పూరయే దుదకాంజలిమ్
ప్రమాణమాత్ర ముద్ధృత్య । జలమధ్యే జలం క్షిపేత్. 25

తా॥ తరువాత తీరమునకువచ్చి తూర్పుగాగాని ఉత్తరముగాగాని కూర్చుని కాళ్ళుదగ్గరచేర్చి దోశిటజలముతీసుకుని ప్రమాణమాత్రమెత్తి జలమధ్యమం దర్ఘ్యమును విడువవలయును.

శ్లో॥ యేన తీర్థేన గృహ్ణీయా । త్తేన తీర్థేన తర్పయేత్
దేవతీర్థేన వై దేవా । ఋషితీర్థేన వై ఋషీన్. 26
పితౄంశ్చ పితృతీర్థేన । స్నానాంతే తర్పయే త్క్రమాత్

తా॥ స్నానానంతరమందు దేవపితృఋషులకు ఆత్మతీర్థము
లతో తర్పణమువిడువవలయును.

శ్లో॥ ఉద్ధాయ వాససీ శుక్లే శుద్ధే తు పరిధాయత
ఉత్తరీయం సదా ధార్యం । బ్రాహ్మణేన సదా శుచిః. 28
శిఖాం బధ్వా తతః పశ్చా । త్ప్రక్షాళ్యాఙ్ఘ్రీ కరౌ తథా
ఆచమ్య ప్రయతో భూత్వా । హ్యూర్ధ్వపుండ్రంచ ధారయేత్
భస్మనైవ త్రిపుండ్రంచ । గోపీచందనమృత్తికా
ఊర్ధ్వం న కారయేద్భస్మ । మృదా తిర్యఙ్న ధారయేత్. 30
భసితేనోర్ధ్వపుండ్రం చ । సదా తిర్యక్చ యో బుధః
ధారయేన్నరకే ఘోరే । వసేదాకల్పసంక్షయాత్. 31

తా॥ శుద్ధవస్త్రములుధరించి జుట్టుముడివేసి ఉదకమృ
త్తికలతో పాదహస్తములను కడిగి ఆచమనంచేసి ఊర్ధ్వపుండ్రము
నుధరించవలయును. భస్మముచే త్రిపుండ్రమున్ను గోపీచందనము
మృత్తికయు భస్మముతో ఊర్ధ్వపుండ్రమున్ను మృత్తికతో అడ్డ
ముగానున్ను పెట్టరాదు, అట్లు పెట్టినచో బహుకాలము నరకమను
భవించెదరు.

శ్లో॥ ఊర్ధ్వపుండ్రం త్రిపుండ్రం వా । పూర్వవచ్చరితమాచరేత్
మంత్రితాత్ప్రాణాయామ్య । పంచవ్యాహృతిపూర్వకమ్. 32
తర్జనీమధ్యమాఽస్పృష్ట్వా । నాసికాపార్శ్వసంయమః
అనంత్రిక మసల్లాపం । ప్రాణాయామం పరిత్యజేత్. 33
ప్రాణానేవం సమాయమ్య । సంధ్యోపాస్తిం సమాచరేత్

తా॥ పూర్వవత్తుగా పుండ్రములను ధరించి సమంత్రకము
గా పంచవ్యాహృతిపూర్వకముగా ప్రాణాయామమును చేసి తర్జనీమధ్య
మములను తగులకుండగా మంత్రము చెప్పుచుమాట్లాడక ప్రాణాయా
మము చేయవలయును. అనంతరము సంధ్యావందన మొనర్చవలయును.

"ఆపోహిష్ఠే"తి తిసృభిః । పాదం పాదం మ్మార్జయేత్
పూర్వం సప్రణవైః పాదైః । పశ్చాదర్ధాంశత స్తథా. 34
తత స్సప్రణవై ఋగ్భి । స్సర్వాభి శ్చ తతః పరమ్
భువి మూర్ధ్ని తథాఽకాశే । మూర్ధ్న్యాకాశే తథా భువి.
ఆకాశే భువి మూర్ధ్ని స్యా । న్మార్జయేచ్ఛుక్లోదకైః
పరిషిచ్యాఽద్భి గాత్రాన్తం । వ్యాహృతిభి స్తథాఽచమేత్.

తా॥ "ఆపోహిష్ఠేతియనుతొమ్మిదివాక్యములచేతను. మొదట భూమియందు అనంతరము శిరస్సు తరువాత ఆకాశముశిరస్సు ఆకాశము భూమి ఆకాశము భువి శిరస్సు యీవరుసగాశుద్ధోదకములచే మార్జనము చేయవలయును ఉదకముచేత చుట్టును త్రిప్పి వ్యాహృతులచే ఆచమనంచేయవలయును.

శ్లో॥ ఆపోహిష్ఠేతి తిసృణాం । త్రిష్టుబ్బ్రహ్మ ఋషి స్సంస్మృతః
ఛందోఽనుష్టుప్ దేవతా శ్చ । ఆపో వై పరికీర్తితాః. 36
ఆచామం ప్రోక్షణేష్వేషు । వినియోగ ఉదాహృతః
ఏవం సంమృజ్య బ్రహ్మాదీ । న్తతో మంత్రిసదాచమేత్.
ఋగ్యజుస్సామవేదాం శ్చ । అథర్వప్రణవౌ తథా.

తా॥ "ఆపోహిష్ఠేతి యనుమూడుమంత్రములకు త్రిష్టుబ్బ్రహ్మ ఋషి అనుష్టుప్ఛందస్సు ఉదకములు దేవతలు శరీరప్రోక్షణవినియోగము యీవిధముగా ఆచమనంచేసినచో పంచవేదములను తృప్తిపరచును.

శ్లో॥ ప్రీణాతు స్వాహేత్యుచ్చార్య । త్రిఃపీత్వాఽపఉపస్పృశేత్
అంగుష్ఠమూలదేశేన ఓష్ఠౌ ద్వి ర్నిర్మృజేత్. 39
అథర్వబ్రాహ్మణాస్తృప్య్యే । స్తృప్యన్త్వేవ బ్రాహ్మణాని చ
పాదౌ హస్తౌ చ సంప్రోక్ష్య । త్వాస్యాగ్ర్యసముపస్పృశేత్
సంహితాభి స్త్రిభిః పూర్వ । మంగుళీభి ర్ఘ్రాణో నసః.

తా॥ ‘‘పృథివీ’’ ఆపః పునంతు స్వాహా’’యని మునర్మార్జనాచమనం చేయవలయును. బొటనవ్రేలితో పెదవులను తుడువవలయును. యిట్లుచేసిన అథర్వవేద బ్రాహ్మణములను తృప్తిచెందించును పాదహస్తములను ప్రోక్షించి తరువాత వ్రేళ్ళుముడిచి శిరస్సు చక్షుస్సు నాసికము చెవులు హృదయములను స్పృశించవలయును. యీప్రకారము స్మృత్యాచమనం చేయవలయును.

శ్లో॥ ‘‘సూర్యశ్చే’’తిమంత్రేణ । మంత్రితం ప్రాశయేద్ద్విజః
‘‘దధిక్రావణ’’మంత్రేణ । ‘‘ఆపోహిష్ఠాదిభిః’’క్రమాత్. 41
‘‘హిరణ్యవర్ణా’’ఇతిమంత్రైః । త్రిసంధ్యం మార్జయేద్విజః
‘‘ద్రుపదా’’దితిమంత్రేణ । పాపపూరుషం విసర్జయేత్. 42

తా॥ ‘‘సూర్యశ్చ’’ యనుమంత్రముచే ఉదకము మంత్రించిపానము చేయవలయును. తిరిగి ఆచమనంచేసి ‘‘దధిక్రావ’’న్ణాది మంత్రములచే పాపపురుషవిసర్జన చేయువలయును.

శ్లో॥ కరాభ్యాంతోయమాదాయ। గాయత్ర్యా చాభిమంత్రితమ్
ఆదిత్యాభిముఖ స్తిష్ఠన్ । త్రిర్భి రూర్ధ్వ మథః క్షిపేత్. 43
పూర్వాం సంధ్యాం సనక్షత్రా । ముపాసీతయథావిధి
గాయత్రీ మభ్యసే త్తావ । ద్యావ దాదిత్యదర్శనం. 44
మంత్రై స్సవిత్ర దైవత్యై । రుపస్థాయ కృతాంజలిః
ప్రాతస్సంధ్యాం చ గాయత్రీం । సావిత్రీం చ సరస్వతీమ్.
కామోమన్యునకార్షీశ్చ । సర్వాభ్యో దేవతాభ్యచ.

తా॥ దోసిలితో ఉదకముతీసుకుని గాయత్రిచే మంత్రించి సూర్యాభిముఖుడై మూడర్ఘ్యములు విడువవలయును. నక్షత్రములుండగానే ప్రాతస్సంధ్యను యథావిధిగా అనుష్ఠించి సూర్యుడుదయించువరకు జపించవలయును. తరువాత సూర్యుని ‘‘మిత్రస్య’’ఇత్యాది

మంత్రములచే ప్రోక్షణముచేసి యథావిధిసంధ్యను పూర్తిచేయవల యును.

శ్లో॥ యస్తుసంధ్యా ముపాసీత । శ్రద్ధయా రవివస్నాతః
క్రోధానసూయావ్యాహీన । స యాతి పరమాం గతిం. 46
సంధ్యాకర్మావసానే తు । హోమం కుర్యాద్యథావిధి
దినసూన్యం నకుర్వీత । యత్కించిద్దానవాన్ భవేత్. 47
బ్రహ్మయజ్ఞంతతః కుర్యా । ద్వేదాభ్యయనంతతః పరం. 49

తా॥ శ్రద్ధచే నెవరు స్వరపడక సంధ్యావందనమాచరిం తురో వారు బ్రహ్మలోకమును పొందుదురు. అనంతరము యథావిధి గా ఉపాసన చేయవలయును. దినశూన్యముకాకుండగా కొంచెము దానముచేయవలయును. అనంతరము బ్రహ్మయజ్ఞనిష్ఠుడయి వేద పారాయణ చేయవలయును.

శ్లో॥ సమిత్పుష్ప కుశాదీంశ్చ । సంభారా నాహరేద్బుధః
తృతీయేఽపి పునర్భాగే । ల్యాభానన్యత్కించిదాహరేత్.
అక్లేశేన శరీరస్య । యద్యచ్ఛాలాభమాహరేత్
తానికాని ప్రకుర్వీత । పంచకర్మాణి ధార్మికః, 50

తా॥ అనంతరము దేవపూజకయి పుష్పాదులను సంపా దించి దినముయొక్క మూడవభాగమందు ధర్మార్జన కొంచెముచే యవలయును ధర్మిష్ఠుడు అయోదార్వాది పంచకర్మలును శరీరము ను కష్టపెట్టక భగవంతుని కృపచే తనకు ప్రాప్తించునంతలో తృ ప్తిజెందవలయును.

శ్లో॥ షణ్ణాం తు కర్మణాం మధ్యే । త్రీణి కర్మాణి జీవికా
యాజనాధ్యాపనే చైవ । విశిష్టశ్చ ప్రతిగ్రహః 51
చతుర్థే చ తథా భాగే । మధ్యాహ్నస్నాన మాచరేత్
మధ్యాహ్న విధివత్స్నాత్వా । స్నానాంతే తర్పయేత్పునః.

దేవాన్ ఋషీన్ పితౄంశ్చైవ । తత్తత్తీర్థేన తర్పయేత్
"ఆపోహిష్ఠేతి" మంత్రేణ । సంప్రోక్ష్య నిజమూర్ధని. 53
"ఆపః పునంతు" మంత్రేణ । మంత్రితం ప్రాశయేజ్జలం.

తా॥ యజనాది ఆరుకర్మలలో యాజనము అధ్యాపనము ప్రతిగ్రహమును జీవనకర్మలు దినమందు నాల్గవభాగములో మధ్యాహ్నికి స్నానమాచరించి పూర్వవతుగా తర్పణాదులను విడువవలయును. పూర్వవతుగా "ఆపోహిష్ఠాదిమంత్రముల చేత మార్జన చేసి ఆపఃపునంతు" మంత్రములచే ఉదకప్రాశన చేయవలయును.

శ్లో॥ కరాభ్యాంతోయమాదాయ।గాయత్ర్యాచాఽభిమంత్రితమ్.
"హంసశ్శుచి"తిమంత్రేణ । పూర్వ మర్ఘ్యం ప్రనిక్షిపేత్
అర్ఘ్యమేకం రవేర్దద్యా । త్సావిత్రీంచ జపేత్తతః. 55

తా॥ తరువాత ఆచమనముచేసి "హంసశ్శుచి" మంత్రముచే ఒకటిన్ని గాయత్రిచే నొకటిన్ని అర్ఘ్యమీయవలయును. అనంతరము గాయత్రికి అంగమైన "ఓం"మిత్యేకాక్షరము చెప్పి మధ్యాహ్నసంధ్యగాయత్రిని జపించవలయును.

శ్లో॥ సావిత్ర్యాచ యథాశక్తి । హ్యుపస్థాయ దివాకరమ్
ప్రదక్షిణం సమావృత్య । నమస్కృత్యోపవిశ్య చ. 56
దర్భేషు దర్భపాణిభ్యాం । సహితాభ్యాం కృతాంజలిః
స్వాధ్యాయం తు యథాశక్తి । బ్రహ్మయజ్ఞార్థ మాచరేత్
ఋక్సామాఽథర్వణాదీం శ్చ । సర్వవేదాన్ పఠేద్బుధః
జపిత్వైవం తతః కుర్యా । ద్దేవర్షిపితృతర్పణమ్. 58
ధృత్వా తు బ్రహ్మసూత్రంతు।పవిత్రం బ్రాహ్మణోత్తమః
తత్తత్తీర్థేన సర్వేషాం । భూతానాం జలదో భవేత్. 59

తా॥ తరువాత సూర్యోపస్థానము చెప్పి సంధ్యముగించి యథాశక్తిదర్భపాణియై వేదపాఠము బ్రహ్మయజ్ఞము ముగించిదేవ

ర్షి పితృతర్పణములు విడువవలయును. యజ్ఞోపవీత పవిత్రములు ధరించి ఆ యాదేవతలకు ఆ యాతీర్థములచే తర్పణ మిచ్చేది.

శ్లో॥ జలదేవా న్నమస్కృత్య । గృహం గత్వా సమాహితః
శివం హరిం విధాతారం । ఇంద్రాదిత్యౌ నిరంతరమ్. 60
అథవా విశ్వకర్మాణం । విరాడ్రూపం ప్రపూజయేత్
బ్రాహ్మణాః పూజయే త్పంచ । పంచయజ్ఞపరాయణః. 61
వైశ్వదేవం తతః కృత్వా । బలీ వసి యథావిధి.

తా। జలదేవతలకు నమస్కరించి యింటికివచ్చి అనంతరము పంచాయతనరూపమైన శివ విష్ణు బ్రహ్మ ఇంద్ర ఆదిత్యులను గాని కేవలపరబ్రహ్మమునుగాని పూజించి తరువాత వైశ్వదేవము చేసిబలులు పెట్టవలయును.

శ్లో॥ తతః పంచమహాయజ్ఞా । న్దద్యా ద్భూతబలిం తతః. 62
తత ఆచమ్య విధివ । ద్విప్రాగ్ర్యః ప్రీతమానసః
అకృత్వా వైశ్వదేవం తు । నిత్యం పంచాహుతీ హువేత్.
పంచసూనాఽపనుత్యర్థం । బ్రాహ్మణస్య దయాంపరః
నిత్యం పంచాహుతీ హుత్వా । బ్రహ్మసాయుజ్య మశ్నుతే.
ద్వారాఽవలోకనం కుర్యా । దాతిథ్య గ్రహణాయ చ
గోదోహకాలమాత్రం తు । ప్రాప్తే భాగ్యాద్యథాఽతిథా. 65

తా॥ తరువాత దేవయజ్ఞ భూతయజ్ఞ పితృయజ్ఞ బ్రహ్మ యజ్ఞ మనుష్యయజ్ఞములను చేయవలయును. వైశ్వదేవముచేయని వారు నిత్యము పంచాహుతుల నర్పించి అనంతరమువిధిగాఆచమనముచేసి అతిథిపూజకొరకు వాకిలిని ఆవుపాలుపిండుమాత్రకాలమును నిరీక్షించవలయును.

శ్లో॥ దేవవ త్పూజయే ద్భక్త్యా । యథాశక్త్యన్నపానతః
భిక్షాం చ భిక్షవే దద్యా । ద్విధివద్బ్రహ్మచారిణః. 66

యతి శ్చ బ్రహ్మచారీ చ । పక్వాన్నస్వామినా వుభౌ
తయో రన్న మదత్వా తు । భుక్త్వా చాంద్రాయణంచ రేత్.

తా॥ అతిథివచ్చెనేని అన్నపానాదులచే యథావిధిగా పూజించవలయును. యతియు బ్రహ్మచారియు భిక్షాన్నభోక్తలు వీరికి లేదనిన పాపయుగును గాన వీరలకు భిక్ష పెట్టవలయును.

శ్లో॥ యతిహస్తే జలం దద్యా । ద్భైక్ష్యం దద్యా త్పునర్జలం
తద్భైక్ష్యం మేరుణాతుల్యం । తజ్జలం సాగరోపమమ్. 68
సత్కృత్య భిక్షవే భిక్షాం । యః ప్రయచ్ఛతిమానవః
గోప్రదానసమం పుణ్యం । తస్యాహ భగవాన్ మనుః. 69

తా॥ యతిహస్తమందు జలముంచితే సముద్రసమానము అన్నముంచితే మేరుసమానము గాన నెవరు యతినిపూజచేయుదురో వారికి గోదానపుణ్యమగునని మనువు చెప్పెను.

శ్లో॥ మాతా పితా గురు ర్బంధు । ర్గర్భిణీ వృద్ధ బాలకాః
అతిథ్యభ్యాగతే ష్వేషు । భుక్తవత్సు తతో గృహీ. 70
ఉపలిప్తే శుచౌ దేశే । పాదప్రక్షాళనో తతః
పంచార్ద్రో భోజనం కుర్యా త్ప్రాఙ్ముఖో మౌన మాస్థితః.
ప్రయత శ్శుద్ధపాత్రేషు । వాగ్యతోఽన్న మకుత్సయన్
ప్రాణాగ్నిహోత్రవిధినా । భుంజీతాఽత్మనిశుద్ధయే. 72
సాయం ప్రాత ర్విప్రాణాం । అగ్నిహోత్రసమంవిదుః.

తా॥ తల్లి తండ్రి గురువు బంధువులు గర్భిణీస్త్రీలు వృద్ధులు బాలులు అతిథులు అభ్యాగతులు వీరికి ఆహారమునిచ్చి అలికిన శుద్ధప్రదేశమందు తూర్పుముఖుడయి మౌనియై నోరు పాదహస్తములును తడిగలవాడయి ప్రాణాగ్నివిధానముచే అన్నమును నిందించక భక్షించెనేని సాయంప్రాతఃకాలహోమములతో సమానము.

శ్లో॥ నైకసాక్షీ తథాఽక్షీయా । ద్భిన్నపాత్రే తథైవచ. 73

చేసి "పాప్రాణాయామః" అనుమంత్రముచే తడిచేతితో నాభిని స్పృశించవలయును. ఊర్ధ్వబాహుండై సూర్యునికెదురుగా నిలచి "శిద్ధయా" అనుఋఙ్మంత్రములచే సూర్యునకు నమస్కరించవలయును. "నిత్యం" అనికూడా నమస్కరించవలయును.

శ్లో॥ శుద్ధస్త్ర శాంతచిత్తస్తు । కృత్వాఽసనపరిగ్రహం
అభీష్టదేవతానాం తు । కుర్వీత స్మరణం బుధః. 88
పునరాచమ్య హస్తౌ తౌ । కుర్యాత్తాంబూలభక్షణమ్
భుక్త్వోపవిష్టో విశ్రాంతో । బ్రహ్మకించిద్విచారయేత్. 89
సచ్ఛాస్త్రాదివినోదేన । ధర్మశాస్త్రవినోదినా
ఇతిహాసపురాణాభ్యాం । షష్ఠసప్తౌ వినోదయేత్. 90

తా॥ శుద్ధచిత్తుండై పీటమీదకూర్చుని యిష్టదేవతలను ధ్యానించి తిరిగి ఆచమనంచేసి తాంబూలమునుభక్షించవలయును. తరువాత బ్రహ్మవిచారణచేయవలయును. ధర్మశాస్త్రములు మొదలగునవి విచారించుచు ఇతిహాసాదులచే దినముయొక్క ఆరు యేడు కాలములను జరుపవలయును.

శ్లో॥ అష్టమే లోకవార్తాభిః । బహిస్సంధ్యా తతఃపునః
సూర్యేఽస్తశిఖరం ప్రాప్తే । పాదశౌచక్రియాన్వితః. 91
బహిస్సంధ్యాముపాసీత । కుశపాణిస్సమాహితః
సాదిత్యాం పశ్చిమాం సంధ్యా । మర్ధాస్తమితభాస్కరామ్.
ప్రాణాయామమ్య సంప్రోక్ష్య । మంత్రేణాఽద్భిస్తు వైతు
సాయ "మగ్నిశ్చ" ఇత్యుక్త్వా । ఋషిచ్ఛందోధిదైవతమ్.
వినియోగం సముచ్చార్య । మంత్రితం తజ్జలం పిబేత్.

తా॥ ఎనిమిదవకాలమందు "షికారు" వెళ్ళి హస్తపాదములను శుద్ధిచేసుకుని సపవిత్రుడై సంధ్యవార్చవలయును. అర్ధాస్తమయకాలము సాయంసంధ్యాకాలము. ప్రాణాయామముచేసి ఆపో

హిష్టాహ మొదలగునవి చెప్పి, యథావిధిగా "అగ్నిశ్చ" చెప్పి ఉదకపానము చేయువలయును.

శ్లో॥ ప్రత్యఙ్ముఖోపవిశ్యేచ్చ । వాగ్యత స్సుసమాహితః 94
ప్రణవవ్యాహృతియుక్తాం । గాయత్రీం తు జపేత్తతః
అక్షసూత్రింసమాదాయ । సమ్య గాతారకోదయాత్. 95
ప్రతీచ్యాదికమంత్రైశ్చ । ఉపస్థాయ దివాకరమ్
దిశః ప్రదక్షిణీకృత్య । నమస్కుర్యా ద్దివాకరమ్. 96
దిగీశాంశ్చ నమస్కుర్యా । త్తత్తన్మంత్రై స్సమాహితః.

తా॥ పశ్చిమమునకుతిరిగి సుఖాసీనుడై ప్రణవపూర్వకముగా గాయత్రిని జపించవలయును. రుద్రాక్షమాలికతో నక్షత్రములు చూచువరకు జపించవలయును. తరువాత ప్రతీచ్యాదిమంత్రములచే సూర్యోపస్థానముచేసి, ప్రాచ్యాదిమంత్రములచే దిక్పతులను ధ్యానించవలయును.

శ్లో॥ ఉపాస్య పశ్చిమాం సంధ్యాం । హుత్వాఽగ్నిం స్తానుపాశ్యచ
భృత్యైః పరివృతో భుక్త్వా । నాతితృప్తోఽథ సంవిశేత్.
సాయంప్రాత ర్వైశ్వదేవః । కర్తవ్యో బలికర్మ చ. 98
అనశ్నతాఽపి సతత । మన్యథా కిల్బిషీ భవేత్

తా॥ సంధ్యానంతరమూపాసన చేసి భృత్యాదులతో కూడా, అత్యధికముగాకుండగా భుజించవలయును. సాయం ప్రాతఃకాలములయందు వైశ్వదేవాదులను చేయవలయును. తానుభుజించకపోయినను విధిని విడువరాదు.

శ్లో॥ అతిథిం చాగతం దృష్ట్వా । స్వశక్త్యా పరిపూజయేత్, 99
ప్రక్షాళ్య పాణిపాదౌ చ । భుక్త్వాసాయంతనే గృహే
గచ్ఛే చ్ఛయ్యాం మహోమృద్వీ । ముపధానం తథావిధమ్

స్వగృహే ప్రాక్ఛిరా శ్శేతే । శ్వశురే దక్షిణ స్తథా
ప్రత్యక్ఛిరాః ప్రవాసే తు । నశయీత కదాచన ముదక్ఛిరాః. 101

తా॥ అతిథిపూజచేసి సాయంకాలమందుకూడా కరపాద శుద్ధియథావిధిగా చేసుకుని అనంతరము మృదువైన దిండుగలపాన్పునపై శయనించవలయును. తనయింట్లో తూర్పుతలాపిగాను అత్తవారింట దక్షిణముగాను పరవాసమందు పశ్చిమతలాపిగాను శయనించవలయును. ఉత్తరమెప్పటికినిపనికిరాదు.

శ్లో॥ రాత్రిసూక్తం జపేత్స్మృత్వా । ఋషీం శ్చ బ్రహ్మవాదినః
మాంగల్యం పూర్ణకుంభం చ । శిరఃస్థానే నిధాపయేత్. 102
ఋతుకాలాఽభిగామీ స్యా । త్స్వదారనిరత స్సదా.

తా॥ రాత్రిసూక్తమునుపఠించి బ్రహ్మఋషులను స్మరించవలయును. జలపూర్ణకుంభము శిరస్సుకు సమీపమందుంచుకొనవలయును. ఏకపత్నీవ్రతుండై ఋతుకాలమందుమాత్రము భార్యతో సాంగత్యము చేయవలయును.

శ్లో॥ నిషిద్ధదివసాన్ హిత్వా । గచ్ఛేద్యుగ్మాసు రాత్రిషు. 103
ప్రదోషపశ్చిమౌ యామౌ । వేదాభ్యాసేన తౌ నయేత్
యామద్వయం శయానస్తు । బ్రహ్మభూయాయ కల్పతే. 104
ఏతత్సర్వ మశేషేణ । కృత్వా జాతం దినేదినే
కర్తవ్యం గృహిణా సమ్య । క్సదాచారస్య లక్షణమ్. 105
ఇతిసనాతనధర్మసంహితాయాం సదాచారోపదేశోనామఏకాదశోఽధ్యాయః.

తా॥ వ్రతాదులయందుగాక సమరాత్రులయందు భార్యతోక్రీడించవలయును. సాయంకాలము తెల్లవారుజామున వేదవేదాంగములను పఠించవలయును. రెండుఝాములుమాత్రము శయనించవలయును.యీప్రకారముగ్రతముసల్పినవాడు పరబ్రహ్మను చెందును.

యీప్రకారముగ్బ్రాహ్మణు సదాచారలక్షణమును తెలుసుకొని నిత్య
మాచరించవలయును.

ఇది సనాతనధర్మసంహితయందలి ఏకాదశాఽధ్యాయ
తాత్పర్యసంగ్రహము.

అథ ద్వాదశోఽధ్యాయః.

(బ్రాహ్మణవంశానుక్రమః.)

దేవాః.

శ్లో॥ బ్రహ్మర్షే! సచ్చిదానంద । బ్రహ్మానుభవతత్పర
ముఖోత్పన్న బ్రాహ్మణానాం । వంశం విస్తరతో వద. 1

తా॥ దేవతలడుగుచున్నారు. సచ్చిదానంద పరబ్రహ్మను
భవ తత్పరుండవైన ఓ బ్రహ్మర్షీ! ముఖోత్పన్న బ్రాహ్మణుల
వంశవిస్తారమును చెప్పుమని కోరిన బ్రహ్మర్షి చెప్పుచున్నాడు.

బ్రహ్మర్షిః.

శ్లో॥ దేవా! శృణ్వంతు వక్ష్యామి। బ్రాహ్మణానాం మహౌజసాం
మహావంశస్య విస్తారం । దేవా! శృణ్వంతు సాదరాః. 2

తా॥ ఓదేవతలారా! బ్రాహ్మణులయొక్క మహావంశ
విస్తారమును చెప్పుచున్నాను. సావధానమనస్కులై వినుండు.

శ్లో॥ ఆదౌ పంచముఖో బ్రహ్మ । సర్వలోకైకకారణః
తన్ముఖేభ్య స్సముత్పన్నాః । పంచకర్తార ఈశ్వరాః. 3
శివో హరి స్తథా బ్రహ్మ। శక్రాదిత్యౌ మహౌజసౌ
పంచకర్తార ఉచ్యంతే । బ్రాహ్మణై స్తత్వకోవిదైః. 4

తా॥ ఆదియందు సర్వలోకకర్తయైన పంచముఖ బ్రహ్మ
యొక్క పంచముఖములవల్లనుంచి యీశ్వరసమానులైన పంచకర్త

లుద్భవించిరి. శివ కేశవ బ్రహ్మేంద్రాదాదిత్యులు తత్వకోవిదులై న బ్రాహ్మణులచే పంచకర్తలుగా చెప్పబడుదురు.

శ్లో॥ శివో మనుస్స్మృతిశ్శాఽసీ । సన్మయనామా బుధోత్తమాః
బ్రహ్మ త్వష్టేతిచప్రోక్త । ఇంద్ర శ్శిల్పిప్రచక్షతే. 5
ఆదిత్య ఏవ విశ్వజ్ఞః । వేదవిద్భిః ప్రకీర్తితః
సద్యోజాతముఖోత్పన్నో । సానగాఖ్యో మహాఋషిః 6
మను శ్శివ ఇతిప్రోక్తః । ఆదిశక్త్యా సమన్వితః

తా॥ శివుడే మనువు విష్ణువే మయుఁడు బ్రహ్మ త్వష్ట ఇంద్రుడే శిల్పి విశ్వజ్ఞుండే ఆదిత్యుడు వీరు వేదవేత్తలై ప్రకాశించిరి. ఆ పంచబ్రహ్మలయొక్క సద్యోజాతముఖోత్పన్నుడు సానగబ్రహ్మర్షి ఆయనయే మనువనియు శివుడనియు చెప్పఁబడును ఆయన ఆదిశక్తితో కూడుకొనియున్నవాఁడు.

శ్లో॥ వామదేవముఖోత్పన్న । స్సనాతన మహాఋషిః. 7
మయో హరిరితి ప్రోక్తః । పరాశక్త్యా సమన్వితః
అఘోరముఖసంభూతో । హాభూనాఖ్యో మహాఋషిః. 8
త్వష్టా బ్రహ్మ ఇతిప్రోక్త । ఇచ్ఛాశక్తిసమన్వితః
తత్పురుషముఖసంభూతో । ప్రత్నసామా మహాఋషిః. 9
శిల్పి ఇంద్ర ఇతిప్రోక్తో । క్రియాశక్తిసమన్వితః
ఈశానముఖసంభూతో । సుపర్ణాఖ్యో మహాఋషిః. 10
దైవజ్ఞ స్సూర్య ఇత్యుక్తో । జ్ఞానశక్తిసమన్వితః

తా॥ వామదేవముఖోత్పన్నుడు సనాతనబ్రహ్మర్షి ఆయనే, మయుఁడనియు, విష్ణువనియు, చెప్పఁబడును. ఆయన పరాశక్తితో కూడుకొనియున్నవాడు. అఘోరముఖోత్పన్నుడు. హాభూనబ్రహ్మఋషి ఆయనే త్వష్టయనియు బ్రహ్మయనియు చెప్పఁబడును. ఇచ్ఛాశక్తితో కూడుకొనియున్నవాఁడు. తత్పురుషముఖోత్పన్నుడు. ప్రత్న

బ్రహ్మర్షి. ఆయనే శిల్పియనియు ఇంద్రుడనియు చెప్పబడును. క్రియాశక్తితో కూడుకొనియున్నవాడు. ఈశానముఖోత్పన్నుడు. సువర్ణబ్రహ్మర్షి. ఆయనే దైవజ్ఞుడనియు సూర్యుడనియు చెప్పబడును. జ్ఞానశక్తితో కూడుకొనియున్నవాడు.

శ్లో॥ తే పంచవేదనిరతా। శ్శాఖాభేదేనసువ్రతాః 11
తద్వంశ్యబ్రాహ్మణానాంతు । కల్పితాఽన్యోన్యబంధుతా
శ్రీవిశ్వకర్మణా పూర్వం । లోకసంస్థితిహేతవే. 12

తా। వారు శాఖాభేదములచే పంచవేదనిరతులై సువ్రతస్థులైనవారు. ఆవంశజబ్రాహ్మణులకు పూర్వమా విశ్వకర్మచే లోకసంరక్షణకొరకు శాఖాభేదముచే అన్యోన్యబంధుత్వము కల్పించబడెను.

శ్లో॥ సానగాఖ్యస్య బ్రహ్మర్షే । రాదిశక్త్యాం మహాత్మనః
ఉపసానగబ్రహ్మర్షి । స్తథా భిభ్రాజనామకః. 13
కశ్యప శ్చ మనుర్నామ । మహర్షి శ్చ తథాఽపరః
విశ్వాత్మక ఋషి శ్చేతి । పంచైతే సానగాఽత్మజాః. 14
ఉపసానగబ్రహ్మర్షిః । పరబ్రహ్మణి లీయతే.

తా॥ సానగబ్రహ్మర్షికి ఆదిశక్తియందు మహాత్ములయినటువంటి ఉపసానగభిభ్రాజ కశ్యప మను, విశ్వకర్మ, విశ్వాత్మక యనునైదుగురుబ్రహ్మఋషులుద్భవించిరి. వారిలో నుపసానగబ్రహ్మర్షి పరబ్రహ్మయందు కలసినవాడాయెను.

శ్లో॥ భిభ్రాజక మహర్షే స్తు । పంచపుత్రా స్తు జజ్ఞిరే. 15
మన్యు ర్మాత్మమన్యుసంజ్ఞ శ్చ । భూబల శ్చ తథాఽపరః
సంవర్తక ఋషి శ్చేతి ।విశ్వవేత్తా మహాఋషిః. 16

తా॥ భిభ్రాజమహర్షికి అయిదుగురుపుత్రులు వారు మన్యుఋషి మాత్మమన్యుఋషి భూబలర్షి సంవర్తకర్షి విశ్వవేత్తర్షి వీరు భిభ్రాజమహర్షిపుత్రులు.

శ్లో॥ కశ్యపస్య సుతాః పంచ । జజ్ఞిరే వేదపారగాః
సమంత స్స్వతకాయ శ్చ । భానుమాన్ బ్రహ్మవిత్తమః 17
జయత్కుమారసంజ్ఞ శ్చ । ధర్మదీక్ష స్తపోనిధిః.

తా॥ కశ్యపమహర్షికి వేదపారాయణులైన సమంతర్షి స్వతాంగర్షి భానుమాన్ ఋషి బ్రహ్మవిత్తమర్షి జయత్కుమారర్షి తపోనిష్ఠాగరిష్టులయిన ధర్మదీక్షాపరులగు వీరయిదుగురు కశ్యపమహర్షి పుత్రులు.

శ్లో॥ మను శ్రీవిశ్వకర్మర్షే । మహర్షేః పుత్రపంచకమ్. 18
సనక శ్చ తథా భానుమా । న్మధుమాం స్సర్వభద్రకః
తథా చిత్రవసు శ్చైవ జజ్ఞే । లోకహితాయ చ. 19

తా॥ మనువిశ్వకర్మమహర్షి కుమారపుత్రపంచకమును చెప్పుచున్నాను. సనకర్షి భానుమాన్ ఋషి. మధుమాన్ ఋషి. సర్వభద్రకర్షి. చిత్రవసుఋషి. లోకహితకరులయిన వీరైదుగురు మనువిశ్వకర్మమహర్షి పుత్రులు.

శ్లో॥ విశ్వాత్మకస్య బ్రహ్మర్షేః । పుత్రాః పంచ సుధార్మికాః
సుయజ్ఞ స్సుతపా శ్చైవ । ప్రబోధో వసులోచనః. 20
చిత్రధర్మేతి బ్రహ్మర్షి । జజ్ఞిరే సాధుసమ్మతాః.

తా॥ విశ్వాత్మకబ్రహ్మర్షికి సుయజ్ఞర్షి సుతపర్షి ప్రబోధకర్షి వసులోచనర్షి చిత్రధర్మర్షి అనువీరైదుగురుపుత్రులు.

శ్లో॥ ఏతే సానగబ్రహ్మర్షే । గ్గోత్రజాశ్చ తపోధనాః. 21
సద్యోజాతవరబ్రహ్మ । ప్రవరేణ సమన్వితః
ఋక్శాఖావర్తిన స్సర్వే । తథా పాలాశధారిణః. 22
త్రికోణకుండే జుహ్వంతి । హ్యగ్నిముద్దిశ్య తే బుధాః
ఏతేషాం వంశ్యజానాం తు । వివాహో న మిథో భవేత్. 23

తా॥ వీరు సానగబ్రహ్మర్షి గోత్రోద్భవులయిన తపస్సంపన్నులు. సద్యోజాత పరబ్రహ్మ ప్రవరతో కూడుకున్నవారై, ఋగ్వేద పారాయణులై, ఉపనయనమందు పాలాశదండమును ధరించవలయును. వీరికి స్మార్తాగ్నియందు త్రికోణకుండము విధియని పండితులు నుడివెదరు యీవంశజులు వీరిలో వీరు వివాహములు చేసుకొనరాదు.

శ్లో॥ సనాతనస్య బ్రహ్మర్షేః । పంచ పుత్రాః ప్రకీర్తితాః
పరాశక్త్యా యుతస్యాఽస్య । సతతం బ్రహ్మవాదినః. 24
ఉపసనాతనాఖ్యర్షి । ర్వామదేవ స్తపోనిధిః
విశ్వచక్షు ఋషిశ్చైవ । ప్రిత్నక్ష స్సునందనః. 25
ఆద్యో బ్రహ్మత్వ మాపన్నో । ధీమా నుపసనాతనః

తా॥ బ్రహ్మనే త్తమయుక్త సనాతనబ్రహ్మర్షికి పరాశక్తితో కూడిన సందునలన, ఉపసనాతనమహర్షి, వామదేవమహర్షి, విశ్వచక్షుమహర్షి, ప్రిత్నక్షమహర్షి, సునందనమహర్షియు నుద్భవించిరి. వీరిలో మొదటియుపసనాతనమహర్షి బ్రహ్మత్వమును పొందెను.

శ్లో॥ వామదేవఋషేః పంచ । జజ్ఞిరే తే మహాసుతాః. 26
మయో, సనత్కుమారశ్చ । ధార్మికో విశ్వచక్షుకః
సునందన ఋషిశ్చైతే । వేదవేదాంగపారగాః. 27

తా॥ వామదేవర్షికి, మయమహర్షి, సనత్కుమారర్షి, ధార్మికర్షి, విశ్వచక్షుఋషి, సునందనర్షి, యీ వేదపారగులయిదుగురు పుత్రులు.

శ్లో॥ విశ్వచక్షుఋషేశ్చాఽపి । జజ్ఞిరే పంచ పుత్రికాః
వర్ధకీ భావబోధ శ్చ । తక్షు శ్శాంతమతి ర్మహాః. 28
యజ్ఞసేన ఇతి ఖ్యాతా । స్తపోనిష్ఠా స్సుధార్మికాః

తా॥ విశ్వచక్షుమహర్షికి వత్సకర్షి, భావబోధర్షి, తత్త్వఋషి, శాంతమతిఋషి, యజ్ఞసేనర్షి, యీతపోనిష్ఠాగరిష్ఠులైనవీరయిదుగురు పుత్రులు.

శ్లో॥ పవిత్రాక్షమహర్షేస్తు । పుత్రాణాం పంచకం విదుః 28
విశ్వతోముఖ మిత్యన్యం । విశ్వాక్షం చ విశ్వతం
సుమేధసం పన్నగం చ । లోకే వేదాంతపారగాః 29

తా॥ పవిత్రాక్షమహర్షికి, విశ్వతోముఖర్షి, విశ్వాక్షర్షి, విశ్వతర్షి, సుమేధసర్షి, పన్నగర్షి, యీవేదపారగు లయిదుగురు పుత్రులు.

శ్లో॥ సునందనమహర్షేస్తు । పంచపుత్రా స్సుధార్మికాః
శైవతః ప్రభవశ్చైవ । జయభద్రఋషి స్తథా. 30
పరిమంగశ్చ విద్యంతో । సదా బ్రహ్మైక్యతత్పరాః.

తా॥ సునందనమహర్షికి, శైవతర్షి, ప్రభవర్షి, జయభద్రర్షి, పరిమంగర్షి, విద్యంతర్షి, బ్రహ్మైక్యానుభవతత్పరులయిన వీరైదుగురుపుత్రులు.

శ్లో॥ సనాతనమహర్షేస్తు । గోత్రజా స్తే మహర్షయః. 31
వామదేవ పరబ్రహ్మ । ప్రవరేణ చ సంయుతాః
యజుర్వేదరతా నిత్యం । వటదండస్య ధారిణః: 32
చతురశ్రమహాకుండే జుహ్వం । త్యగ్నిం తపోధనాః
ఏతేషాం చైవ సర్వేషాం । మిథోద్వాహో న సమ్మతః. 33

తా॥ సనాతనబ్రహ్మర్షిగోత్రజులైనవారు వామదేవ పరబ్రహ్మ ప్రవరతోకూడుకొని యజుర్వేదపారాయణులై వటదండధారిణులై నాలుగుకోణములుగల అగ్నికుండమం దగ్నిని స్థాపించవలయును. యీగోత్రజులలో నొకరికొకరు వివాహముచేయరాదు.

శ్లో॥ అహాభూనాఖ్య బ్రహ్మర్షే । రిచ్ఛాశక్త్యాం మహాయశాః
ఉపాభూన బ్రహ్మఋషేః । భద్రదత్తోఽథ తాండవః. 34
విశ్వరూపో శ్రీముఖశ్చ । పంచ పుత్రాః ప్రజజ్ఞిరే
ఆద్యో నిర్వాణ మాపన్నో । తపసా యోగవిత్తమః. 35

తా॥ అహాభూనబ్రహ్మర్షికి ఇచ్ఛాశక్తియందు, ఉపాభూన మహర్షి, భద్రదత్తమహర్షి, తాండవమహర్షి, విశ్వరూపమహర్షి, శ్రీముఖమహర్షి, యీమహాతేజస్సుగల అయిదుగురుద్భవించిరి. వీరిలో మొదటఉపాభూనమహర్షి తపోనిష్ఠాగరిష్ఠుండై యోగసాధనముచే పరబ్రహ్మనందుండాయెను.

శ్లో॥ భద్రదత్తస్య బ్రహ్మర్షేః । పంచైతే సూనవ స్స్మృతాః
త్వష్టా సంవర్తక శ్చైవ । యజ్ఞపాలో మహాతపాః. 36
కుశధర్మాఽతిధాతా చ । వేద వేదాంతపారగాః

తా॥ భద్రదత్తమహర్షికి, త్వష్టఋషి, సంవర్తకర్షి, యజ్ఞపాలర్షి, కుశధర్మర్షి, అతిధాతర్షి, వీరైదుగురుమహాత్ములు పుత్రులు.

శ్లో॥ తాండవస్య ఋషేః పంచ । పుత్రాః కర్మరతాఽభవన్. 37
లోకేశః పద్మదీక్షశ్చ । వితక్షో మోదమానసః
విశ్వమయఋషిశ్చేతి । తత్వజ్ఞానవిచక్షణాః. 38

తా॥ తాండవమహర్షికి, లోకేశర్షి, పద్మదీక్షర్షి, వితక్షర్షి, మోదమానసర్షి, విశ్వమయర్షి, కర్మనిష్ఠాగరిష్ఠులై తత్వవిచక్షణులైన వీరైదుగురు పుత్రులు.

శ్లో॥ విశ్వరూపఋషేః పంచ । పుత్రా స్తే తత్వకోవిదాః
బోధాయనో జాతరూప । శ్చిత్రసేన స్తథా బుధః, 39
జయసేన శ్చ విభునా । స్తపసా లోకపూజితాః

తా॥ విశ్వరూపమహర్షికి, బోధాయనర్షి, జాతరూపర్షి, చిత్రసేనర్షి, జయసేనర్షి, విఘనసర్షి, తత్వకోవిదులై లోకపూజ్యులయిన వీరైదుగురు పుత్రులు.

శ్లో॥ శ్రీముఖస్యాఽపి బ్రహ్మర్షేః। పుత్రాః పంచ మహౌజసః 40
ప్రభోన్నతో దేవలశ్చ। వినయో బ్రహ్మదీక్షితః 41
హరిధర్మఋషి శ్రేష్ఠ। జ్ఞానయజ్ఞవిదాం వరాః.

తా॥ శ్రీముఖమహర్షికి, ప్రభోన్నతర్షి, దేవలర్షి, వినయర్షి, బ్రహ్మదీక్షితర్షి, హరిధర్మర్షి, ఆత్మజ్ఞానసంపన్నులైన వీరైదుగురు పుత్రులు.

శ్లో॥ హాభూనాఖ్యస్య బ్రహ్మర్షే। ర్గోత్రజా స్తే తపోధనాః 42
అఘోరబ్రహ్మప్రవర। యుతా స్తే సామశాఖినః.
ఖాదిరాఖ్యస్య దండస్య। ధారిణో జ్ఞానవిత్తమాః 43
కుండే తు వర్తతే నిత్యం। జుహ్వాం త్యగ్నిం తపోధనాః.
ఏతేషాం వంశజానాం తు। మిథోద్వాహో న సమ్మతః.

తా॥ ఈహాభూనబ్రహ్మర్షి గోత్రజులు, అఘోరబ్రహ్మప్రవరతో కూడుకున్నవారై, సామవేదపారాయణులయి, ఖదిరదండధారులై, వన్నెలకుండమందగ్నిప్రతిష్టించవలయును. ఈగోత్రజులు వీరిలో నొకరికొకరు వివాహాము చేసుకొనరాదు.

శ్లో॥ ప్రత్నసాఖ్యమహర్షేస్తు। పంచపుత్రా స్తపోధనాః. 44
క్రియాశక్తిసమేతస్య। బ్రహ్మపుత్రస్య ధీమతః 45
ఉపప్రత్నమహర్షిశ్చ। రుచిదత్తోఽథ వాస్తుకః.
కౌశలశ్చ సనాభశ్చ। జజ్ఞిరే శిల్పకోవిదాః
బ్రహ్మసాయుజ్యమాపన్నో। హ్యుపప్రత్నమహాఋషిః

తా॥ ప్రత్నబ్రహ్మర్షి క్రియాశక్తితో కూడినవాడై యుండగా, ఉపప్రత్నమహర్షి, రుచిదత్తమహర్షి, వాస్తుకమహర్షి,

కౌశలమహర్షి, సనాథమహర్షి, శిల్పనైపుణ్యవిశారదులగువీరయిదుగురు పుత్రులుద్భవించిరి. వీరిలో ఉపవరిత్నమహర్షి, బ్రహ్మత్వము నుపొందినవాడాయెను.

శ్లో॥ రుచిదత్తస్య బ్రహ్మర్షే । ర్ధార్మికాః పంచపుత్రకాః
పర్హార్షణో లోకవేత్తా । శిలాదండ స్తృతీయకః. 46
సహస్రబాహు స్సుతపాః । దేశిక శ్చేతి పంచమః.

తా॥ రుచిదత్తమహర్షికి, పర్హార్షణర్షి, లోకవేత్తర్షి, శిలాదండర్షి, సహస్రబాహుఋషి, దేశికర్షి, ధర్మప్రవర్తకులైన వీరైదుగురుపుత్రులు.

శ్లో॥ వాస్తుకస్య ఋషేః పంచ । సూనవో జజ్ఞిరే బుధాః. 48
వాస్తోష్పతి శ్చేంద్రసేనో । గిరిధర్మో మహాతపాః
వసుధర్మో వజ్రజేతా । సత్యధర్మపరాయణాః 49

తా॥ వాస్తుకమహాఋషికి, వాస్తోష్పతిఋషి ఇంద్రసేనర్షి గిరిధర్మఋషి, వసుధర్మఋషి, వజ్రజేతఋషి, సత్యవ్రతులున్ను మహాపండితులున్ను అయిన వీరైదుగురుపుత్రులు,

శ్లో॥ కౌశలస్య ఋషేః పంచ । బ్రహ్మజ్ఞా జజ్ఞిరే సుతాః
విశ్వభద్రో జ్ఞానభద్రో । దేవభద్ర ఇతి క్రమాత్. 50
వ్యంశికశ్చ పబోధశ్చ । లోకే వేదే చ సమ్మతాః.

తా॥ కౌశలమహాఋషికి, విశ్వభద్రఋషి, జ్ఞానభద్రఋషి, దేవభద్రఋషి, వ్యంశికఋషి, పబోధకఋషి, వేదసమ్మతులయినవీరైదుగురుపుత్రులు.

శ్లో॥ సనాథస్య మహర్షేస్తు । పుత్రాః పంచ మహాధియః 51
శర్వరశ్చైవ భోక్తవ్యో । ప్రజ్ఞామతిఋషిర్బుధాః
ముముక్షు ర్వేదపాలశ్చ । జజ్ఞిరే సాధుసమ్మతాః. 52

తా॥ సనాభమహాఋషికి, శంకరఋషి, భోక్తవ్యఋషి, పరిజ్ఞామతిఋషి ముముక్షుఋషి, వేదపాలఋషి, యశస్కాముల యిన వీరైదుగురుపుత్రులు.

శ్లో॥ ప్రత్నసాఖ్యస్య బ్రహ్మర్షేః । గోత్రిజా దేవపూజితాః
తత్స్వారూప పరబ్రహ్మ । ప్రవరేణ చ సంయుతాః. 53
అథర్వశాఖినో జంతు । ఫలదండస్య ధారిణః
షట్కోణకుండే జుహ్వంతి । హ్యగ్ని ముద్దిశ్య సాధవః, 54
ఏతత్వంశే తు జాతానాం । మిథోద్వాహో న సమ్మతః.

తా। ఈప్రత్నబ్రహ్మఋషి గోత్రోద్భవులు, తత్స్వారూప పరబ్రహ్మప్రవరతో కూడుకున్నవారై, అథర్వణవేదపారాయణులై మేడుంబరదండధారులయి, ఆరుకోణములుగలకుండమందగ్ని ప్రతిష్టించవలయును. సగోత్రజులు ఒకరికొకరు వివాహముచేసుకొన

శ్లో॥ సుపర్ణాఖ్యస్య బ్రహ్మర్షేః । జ్ఞానశక్త్యాం తు జజ్ఞిరే. 55
పంచ పుత్రా మహాభాగా । సూర్యాగ్నిసమవర్చసా
ఉపసుపర్ణసాఖ్యస్తు । విశ్వజ్ఞః పరిత స్తథా. 56
సారసేన శ్చ సుతసా । స్తతస్సాంబాయనో ఋషిః
ఆద్యో ముక్తిపదం ప్రాప । విశ్వజ్ఞస్య ప్రసాదతః. 57

తా॥ సుపర్ణబ్రహ్మఋషికి జ్ఞానశక్తియందు, ఉపసుపర్ణమహాఋషి, విశ్వజ్ఞమహాఋషి, పరితమహాఋషి, సారసేనమహాఋషి, సాంబాయనమహాఋషి, సూర్యాగ్నిసమవర్చస్కులయి నవీర యిదుగురు పుత్రులుపుట్టిరి. వీరిలో ఉపసుపర్ణమహాఋషి బ్రహ్మత్వమునుపొందెను.

శ్లో॥ పంచపుత్రాస్తు విఖ్యాతా । స్తేజసా సూర్యవర్చసా
మహాభద్రో సువ్రతశ్చ । శ్రుతివర్ధననామకః 53
మోక్షకో సంజ్ఞక శ్చైతి । తపసా శుద్ధమానసాః.

తా॥ విశ్వజ్ఞమహాఋషికి, మణిభద్రఋషి, సువ్రతఋషి, శృతివర్ధనఋషి, యాజ్ఞికఋషి, నంజ్ఞిఋషి, తపస్సంపన్నులయి సూర్యకాంతిగలవీరయిదుగురుపుత్రులు.

శ్లో॥ పరితస్య ఋషేః పుత్రాః । పంచ తేజోమయా శ్శుభాః 59
ఆదిత్యసేన స్తపనీయ । ఋషి రర్చితకర్దమా
ప్రార్చిత శ్చేతి విఖ్యాతా । నిత్యం బ్రహ్మైక్యతత్పరాః, 60

తా॥ పరితమహాఋషికి, ఆదిత్యసేనఋషి, తపనీయఋషి అర్చితఋషి, కర్దమఋషి, ప్రార్చితఋషి, బ్రహ్మసేవానిరతులయిన వీరైదుగురుపుత్రులు.

శ్లో॥ సూరసేనఋషేః పుత్రాః । జజ్ఞిరే పంచ సువ్రతాః
మైత్రేయోఽథ సుదర్శన । ఋషి స్తు రుపగోపకః. 61
యజ్ఞఋషిస్సాంత్వఋషి । స్తేజసా సూర్యసన్నిభాః.

తా॥ సూరసేనమహాఋషికి, మైత్రేయఋషి, సుదర్శన ఋషి. ఉపగోపకఋషి, యజ్ఞఋషి, సాంత్వఋషి సూర్యసమానులయినవీరైదుగురుపుత్రులు.

శ్లో॥ సాంబాయనాఖ్యబ్రహ్మర్షేః । పుత్రా స్తే వేదపారగాః 62
బోధకో దేవసేనశ్చ । ఆదిత్య శ్చ విచేతసః
ఉపయజ్ఞ ఇతిఖ్యాతా। ఆదిత్యసమవిగ్రహాః. 63

తా॥ సాంబాయనమహాఋషికి, బోధకఋషి, దేవసేన ఋషి, ఆదిత్యఋషి, విచేతసఋషి, ఉపయజ్ఞఋషి, ఆదిత్యసమానులయినవీరయిదుగురుపుత్రులు.

శ్లో॥ ప్రణవాఖ్యమహావేదే । నిష్ణాతా జంబుదండినః
సువర్ణసాఖ్యబ్రహ్మర్షే । గ్గోత్రజా స్తే తపోధనాః. 64
ఈశానాఖ్యపరబ్రహ్మ । ప్రవరేణ సమన్వితాః
అష్టకోణమహాకుండే । జుహ్వంత్యగ్నిం విశారదాః. 65
ఏతేషాం వంశజానాం తు । మిథోద్వాహో న సమ్మతః

తా॥ యీగోత్రోద్భవులు ప్రణవవేద పారాయణులయి, జటాజూటదండధారిణులయి, ఈశానవరబ్రహ్మర్షివరతో కూడుకున్నవారయి, ఎనిమిదికోణములగలకుండమందగ్నిని ప్రతిష్ఠించవలయును. యీగోత్రజులలోనొకరినొకరు వివాహాముచేసుకొనరాదు.

శ్లో॥ ఏతే పంచముఖోత్పన్నా । బ్రాహ్మణానాం తపస్వినాం. 66
కూటస్థా ఇతి విఖ్యాతా । లోకరక్షణతత్పరాః
శిల్పశాస్త్రే చ నిపుణాః । పంచకృత్యపరాయణాః. 67
వాస్తుశాస్త్రార్థతత్వజ్ఞా । ధాతువాదపరాయణాః
షట్కర్మనిరతాః పూజ్యా । శ్రౌతస్మార్తేషు నిష్ఠితాః. 68
సర్వాగమేషు నిష్ణాతా । యోగసాంఖ్యాదివిత్తమాః
లోకరక్షణతత్వజ్ఞా । లోకపావనహేతవః. 69

ఇతి సనాతనధర్మ సంహితాయాం బ్రాహ్మణ వంశాఽనుక్రమోనామ ద్వాదశోఽధ్యాయః,

తా॥ బ్రహ్మముఖోత్పన్నబ్రాహ్మణులకు, తపస్సంపన్నులున్ను, లోకరక్షకులున్నూ అయినయీబ్రహ్మఋషులు కూటస్థపురుషులనిచెప్పబడును. లోకసంరక్షణతత్పరులగునీబ్రాహ్మణులు శిల్పశాస్త్రమందు నిపుణులున్ను, అయోదార్వాదిపంచకర్మోద్ధారకులున్ను, వాస్తుశాస్త్ర విచక్షణులున్ను, బ్రహ్మోపాసకులున్ను, ధాతువాదపరులున్ను, షట్కర్మనియతులున్ను, శ్రౌతస్మార్తాది కర్మానుష్ఠానపరులున్ను, సమస్తాగమాదులయందున్ను అనుష్ఠించతగినవారున్నూ, యోగసాంఖ్యములను గుర్తెరింగి లోకసంరక్షణార్థమైయీప్రపంచమునుపవిత్రముచేయుటకున్నుబ్రాహ్మణులుద్భవించిరి.

ఇది సనాతనధర్మసంహితయందలి ద్వాదశాధ్యాయ
తాత్పర్యసంగ్రహము.

## అథ త్రయోదశోఽధ్యాయః.

పాపకర్మఫలాని.

దేవాః.

శ్లో॥ బ్రహ్మర్షే! పరమానంద । సందోహామృతసాగర!
సర్వపాపస్వరూపం నో । ప్రాయశ్చిత్తం చ బ్రూహి నః. 1

బ్రహ్మర్షిః.

అథాఽతః సంప్రవక్ష్యామి । పాపకర్మఫలం సురాః!
ఖరోష్ట్రసూకరత్వం చ । గజాశ్వమృగపక్షితామ్. 2
చండాలపుల్కసత్వం చ । ప్రాప్నోతి బ్రహ్మహా క్రమాత్

తా॥ (దేవతలడుగుచున్నారు.) "ఓ స్వామీ! పాపములయొక్క స్వరూపమును, ప్రాయశ్చిత్తమును, మాకు జెప్పుమ"ని కోరిన బ్రహ్మఋషి చెప్పుచున్నాడు.

ఓ దేవతలారా! బ్రహ్మహత్య చేసినవాడు, గార్ధభజన్మము, ఒంటెజన్మము, పందిజన్మము, ఏనుగజన్మము, అశ్వజన్మము, మృగజన్మము, పక్షిజన్మము, ఛండాలజన్మము, బోయజన్మము, క్రమముగా పొందును.

శ్లో॥ అన్యేషాం విడ్భుజాం యోనిం । పక్షిణాం చ తథైవచ. 3
క్రిమికీటపతంగానాం । సురాపః ప్రాప్నుయాద్ధ్రువః
రాక్షసానాం పిశాచానాం । చోరో గచ్ఛతి సహస్రశః. 4

తా॥ సురాపానము చేయువాడు, సూకరాది జన్మములను పక్షిజన్మములను, క్రిమికీటకజన్మములను పొందును. దొంగతనము చేయువాడు, అనేకమారులు పిశాచజన్మముల నెత్తును.

శ్లో॥ క్రవ్యాదదంష్ట్రిణాం యోనిం । తృణాదీనాం తథైవచ
క్రూరకర్మరతానాం చ । ప్రాప్నోతి గురుతల్పగః 5

ఇతరస్యధనం క్షేత్రం । మహీంహృత్వా నరాధమః
బ్రహ్మరాక్షసతాం యాతి । శతశోఽథ సహస్రశః. 6

తా॥ అగమ్యాగమనముచేయువాడు. మాంసాహారజంతువులయొక్కయు, గద్దితినుజంతువులయొక్కయు, క్రూరమృగములయొక్కయు జన్మములను క్రమముగా పొందును. ఇతరులయొక్కధనమునుగాని భూమినిగాని భార్యనుగాని హరించువాడు అనేకసార్లుమహాకష్టతరమయిన బ్రహ్మరాక్షసత్వమును పొందును.

శ్లో॥ ధాన్యచోరో భవేదాఖు । ర్జలం హృత్వా ప్లవో భవేత్
కాంస్యం హృత్వా భవేద్ధంస।స్సారసో నకులో ఘృతమ్. 7
పయః కాకో భవేన్మాంసం । హృత్వాగృధ్రోధవేత్తథా
చక్రీవాకస్తు లవణమ్ । బక స్తైలాపహారకః. 8

తా॥ ధాన్యమునుదొంగిలించి యెలుకయు, నీరునుదొంగిలించి కప్పయు, కంచునుదొంగిలించి హంసయు, సారసపక్షియు, నేయిదొంగిలించి ముంగిసయు, మాంసమును దొంగిలించి కాకిగాని గ్రద్దగాని, లవణమునుహరించి చక్రివాకమును, దూదినిహరించి కొంగయునగును.

శ్లో॥ కౌశేయం చ తథా క్షౌమం । హృత్వా దర్దురసంజ్ఞకః
వస్త్రశాకాపహారేణ । బర్హిణస్స్యా న్నరాధమః. 9
శ్వానో హృత్వా భవేత్పుష్పం । మర్కటస్స్యాత్ఫలంబుధే!
యానాపహారకా దుష్ట్రః । పశూన్హృత్వా భవే దజః. 10

తా॥ కౌశేయమున్నూ, క్షౌమమున్నూ, హరించి గోదురకప్పయు, వస్త్రములు, శాకములు, హరించి నెమలియు, పుష్పములు హరించికుక్కయు, ఫలముహరించి కోతియు, వాహనములనుహరించి ఒంటెయు పశువులనుహరించి మేకయు, ఈపాపములుచేయువారీప్రకారము జనన్మములెత్తుదురు.

శ్లో॥ నైతావతాఽలం హే దేవాః! । పాపకర్మఫలోదయం
నరకే వర్తమానస్య । అసిపత్రేఽపిదారుణే. 11
హస్తద్వయం దృఢం బద్ధ్వా । సతతం సపదం తథా
క్షిప్యతే దీర్ఘవపశ్చా చ । బ్రహ్మహా చంద్రతారకమ్. 12

తా॥ ఓ దేవతలారా! పాపకర్మఫలమింతియే కాదు. బ్రహ్మహత్య చేయువారిని యమదూతలు అసిపత్రనరకమందుంచి అనంతరమందు కాళ్ళుచేతులు ముడియగట్టి బహుయుగములు నరకాగ్నియందు పడవేతురు.

శ్లో॥ అతితప్తాఽయస్తైర్దండైః । పీడ్యంతే యమకింకరైః
ప్రాణిహింసాపరాణాంతు । కల్పకోటిశతం సురాః! 13
తత్ర తైలకటాహేషు । గాఢం బద్ధ్వా పదద్వయమ్
క్షిప్యతే యమదూతేన । తైలచోరో మహాసురాః! 14

తా॥ ప్రాణిహింస చేయువానిని. కాల్చినయినుపకోలలచేత బహుకాలము యమదూతలు హింసించుదురు. నూనెను దొంగిలించువాడు యమలోకమందు కాల్చిననూనెలో బహుకాలముంచబడును.

శ్లో॥ తతప్తతామ్రకటాహేషు । క్షిప్త్వా మిథ్యాభిశంసినమ్
జిహ్వా ముత్పాటయంత్యాశు । బహుశో యమకింకరాః.15
తప్తతామ్రజలం తీక్ష్ణైః । పిబేత్యుక్త్వాఽయసాయుధైః
ఛిద్యంతే యమదూతైస్తు । సురాపానరతా నరాః. 16

తా॥ అబద్ధము చెప్పువానిని నరకమునందు కాచిననూనెగల రాగికాగునందుంచి నాలుక కోయుదురు. సురాపానము చేయువానిని కరగినరాగినిత్రాగించుచు కాలినయినుపశస్త్రములతో బాధింతురు.

శ్లో॥ ఛిత్వా ఛిత్వా పునర్దగ్ధ్వా । పిండీకృత్య పునస్తథా
క్షిప్యతే పూర్యమాణేఽస్మిన్ । కటాహే గురుతల్పగః 17

మాతరం పితరం జ్యేష్టం । గురు మధ్యాత్మవేదినమ్
మహాదేవం తథావిష్ణుం । బ్రహ్మాణం వేదమేవచ. 18
ఆదిత్యం చంద్రమగ్నించ । వాయుం నిందంతి యే నరాః
కల్పకోటిశతం దివ్యం । పచ్యంతే నరకాలయే. 19

తా॥ అగమ్యాగమనముచేయువాడు, యమదూతలచే కొట్టబడి నలుపబడి కోయబడి కాల్పబడి కాచిననూనెయందుంచబడును. తల్లి, తండ్రి, గురువు, మొదలగువారిని శివకేశవాదిదేవతలను నిందించువారు అనేకయుగములు నరకమునందు బాధింపబడుదురు.

శ్లో॥ యతిహస్తే జలం దాన ! మగత్వం యైర్నరాధమైః
ఇక్షువత్సంపీడ్యంతే ! ముద్గరైస్సగసస్వనాః!. 20
పాదే చాఽన్యే తథాపార్శ్వే । నాభౌ శిశ్నే గుదేఽక్షిణి
నిహన్యంతే । మహాతప్తై । శ్శంకుభిశ్శాస్త్రహారిణః. 21

తా॥ ఎవరు యతిని నిరాకరింతురో వారిని యమదూతలు ముద్గరములచే చెరుకువలెనలుపుదురు. సువర్ణమునుహరించువాడు పాదమునందును, పార్శ్వమునందును, నాభియందును గుదస్థానమందును. శిశ్నమందును, నేత్రములయందును యమదూతలచే కాలిన మేకులచే గ్రుచ్చబడును.

శ్లో॥ అయసా నిర్మితాం కాంతాం । సుతప్తాం జగ్ధురీకృతాం
గాఢ మాలింగతే మర్త్యః । పరదారపరిగ్రహః. 22
దుశ్చారిణ్యః స్త్రియశ్చాఽపి । సుతప్తం పురుషం తథా.

తా॥ యమదూతలు పరస్త్రీ చేయుపురుషునిచే కాల్చినయినుపబొమ్మను ఆలింగనముచేయించెదరు. జారస్త్రీలును ముక్తే చేయుబడుదురు,

శ్లో॥ శ్రౌతస్మార్త విహీనా యే । నిషిద్ధాచరణే రతాః 23
పచ్యంతే నరకే తీవ్రే । కల్పకోటిశతం సదా
యే దేవాయతనారామ । వాపీకూపమఠాదికమ్. 24
అభిమూహ్యంతి పాపిష్టా । నృపా స్తత్ర రమంతి చ
వ్యాయామోద్వర్తనాభ్యంగ । స్నానభోగాన్నభోజనమ్
క్రీడాం చ మైథునం ద్యూత । మాచరంతి మదోద్ధతాః
ఏతేచ తద్విధైర్ఘోరై । రిక్షుయంత్రాదిపీడనైః. 26

తా॥ శ్రౌతస్మార్తములనువిడచి దురాచారములనుచేయువాడు బహుకాలము నరకబాధనుజెందును. దేవస్థానములయందును పుణ్యతీర్థాదులయందును ఎవరుమైథునాదిదురాచారమును జరుపుదురోవారుబహుకాలము యమదూతలచే గానుగలలో నలుపఁబడుదురు.

శ్లో॥ నిరయాదిషు పచ్యంతే । యావచ్చంద్రదివాకరమ్
వేదమార్గం మతాచార్య। నిందాం శృణ్వంతి యే నరాః.27
దృతతామ్రాదభి స్తేషాం । కర్ణ ఆపూర్యతేఽనఘాః!
ఘోరాఖ్యే నరకే కేచి । త్పచ్యంతే పాపకర్మిణః 28
సుఘోరాఖ్యే తథా కేచి । దతిఘోరేఽపి కేచన
మహాఘోరాభిధే కేచి । ద్ఘోరరూపే చ కేచన. 29
తరళాఖ్యే తథా కేచి । త్తథా కేచి ద్భయానకే
కాలరాత్రే తథాపాపా । స్తథా కేచి ద్భయోత్కటే. 30
కేచి చ్చండాభిదే కేచి । న్మహాచండాభిధే సదా
చండకోలాహలే కేచి । త్ప్రచండాయాం తు కేచన. 31
తథా పద్మాభిధాయాంచ । పద్మ మధ్యాం చ కేచన
తథా కేచన భీమాయాం । కేచి ద్భీషణసంజ్ఞకే. 32

కరాళే చ తథా కేచి । ద్వికరాళే చ కేచన
వజ్రతీక్ష్ణకసంజ్ఞే చ । పద్మకోణే చ కేచన. 33
సుదీర్ఘవర్తులాఖ్యే చ । తప్తభూమౌ చ కేచన
అష్టభూమౌ చ దీప్తే చ । రౌరవే చైవ కేచన. 34
కేచి దన్యేషు పాపిష్ఠాః । పచ్యంతే వివశా భృశమ్

తా॥ వేదనిందయు, గురునిందయు,విను వాడు బహుకాలము నరకమనుభవించును. కరగినరాగినివారి చెవ్వులలో పోయుదురు. కొందరుపాపులు ఘోరమందును, అతిఘోరమహాఘోర నరకములయందును, పీడించబడుదురు మరికొందరు సుఘోరమందును అతిఘోరమందును, మహాఘోరమందును,కొందరు తరళాఖ్యమందును,భయానరకమందును,కాళరాత్రిములయందును, భయోత్కటమందును,చండమందును మహాచండమందును,పద్మమందును,పద్మమధ్యమందును, భీమమందును, భీషణమందును, కరాళమందును, వికరాళమందును, పద్మకోణమందును, సుదీర్ఘవర్తులమందును, తప్తభూమమందును, అష్టభూమమందును, దీప్తమందును కొందరుపాపులు కొన్నిమహానరకములయందు యమదూతలచే మహాభాధలను పెట్టబడుదురు.

శ్లో॥ అఘోరకష్టం మహాప్రాజ్ఞ । పాపకర్మఫలోదయం. 35
ఏవం పాపఫలం జ్ఞాత్వా । పుమాన్ జ్ఞానరతో భవేత్
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి । భస్మసాత్కురుతే సురాః! 36
అహో జ్ఞానం పరిత్యజ్య । మాయయా పరిమోహితాః
నరకేషు చ పచ్యంతే । స్వప్నకల్పేషు దుఃఖితాః. 37
ఏవం పాపఫలం భుక్త్వా । మహాదేవప్రసాదతః
పశ్చా ద్బ్రహ్మా విజాయేత । మానుష్యే కర్మసామ్యతః. 38

ఇతిసనాతనధర్మసంహితాయాం పాపకర్మవిచారఫలం నామ త్రయోదశోఽధ్యాయః.

తా॥ యీప్రకారము పాపములను గుర్తెఱిగిన పురుషుడు భీతిజెంది జ్ఞానాభ్యాసి కావలయును. జ్ఞానాగ్ని సర్వపాపకర్మలను నశింపచేయును. గనుక జ్ఞానమువలన బ్రహ్మను తెలియనిపురుషుడు శరీరాభిమానమువలన అజ్ఞానియై బహువిధనరకముల ననుభవించును. యీప్రకారము సమస్తపాపముల ననుభవించి భగవదనుగ్రహము వలన జీవుడు మనుష్యజన్మమెత్తును.

ఇది సనాతనధర్మసంహితయందలి త్రయోదశాధ్యాయ
తాత్పర్యసంగ్రహము.

---

## అథ చతుర్దశోఽధ్యాయః.



### ప్రాయశ్చిత్తవిధిః.

బ్రహ్మర్షిః

శ్లో॥ అథాఽతస్సంప్రవక్ష్యామి । ప్రాయశ్చిత్తం సమాసతః
దోషాణా మపనుత్త్యర్థం । సర్వభూతానుకంపయా. 1

తా॥ (బ్రహ్మర్షి చెప్పుచున్నారు) ఓ దేవతలారా! సమస్తభూతానుకంపవలన ప్రాయశ్చిత్తవిధి చెప్పబడును. ఏప్రాయశ్చిత్తములవల పాపాత్ములు బహుకాలనరకబాధను తప్పించుకొని సుఖింతురో దానిని చెప్పెద వినుడు.

శ్లో॥ బ్రహ్మహా మద్యపస్తేయీ । తథైవ గురుతల్పగః
ఏతే వేదవిదాం శ్రేష్ఠాః । మహాపాతకినస్స్మృతాః. 2
ఏభి స్సహావసేద్యస్తు । సంవత్సర మసావపి
బ్రహ్మహా నిర్జనేఽరణ్యే । కుటీకృత్వా వసేన్నరః. 3
ద్వాదశాబ్దాభిసంతప్త । స్సర్వదా విజితేంద్రియః
భిక్షామాహృత్య భుంజీయా । త్స్వదోషం ఖ్యాపయన్నృణాం

తా॥ బ్రహ్మహత్యచేసినవాడు, మద్యపానముచేసినవాడు, సువర్ణచోరుడు, అగమ్యాగామి వీరు మహాపాతకులు వీరితోనొకసంవత్సరము సహవాసముచేయువాడును మహాపాపియౌ! బ్రహ్మహత్యచేసినవాడు నిర్జనవనమందు నివాసమేర్పరచుకొని పండ్రెండు వత్సరంబులు జితేంద్రియుండై తనపాపములు ప్రకటనచేయుచుగ్రామమునుండి భిక్ష తెచ్చుకొని భుజించవలయును.

శ్లో॥ శాకమూలఫలాశీనా । కృత్వా శవశిరో ధ్వజం
సంపూర్ణే ద్వాదశే వర్షే । బ్రహ్మహత్యాం వ్యపోహతి. 5
అకామకృతదోషస్య । ప్రాయశ్చిత్త మిదం సురాః!
కామతశ్చే ద్వృషి శ్రేష్ఠాః! । ప్రాణాంతిక మిదం స్మృతం. 6

తా॥ శవముయొక్క పుర్రెను ఇంటిముందర ధ్వజముగానుంచి, భిక్షాన్నముగాని, శాకాదులుగాని, భక్షించుచు పండ్రెండు వత్సరంబులీవ్రతమునుజరిపిన శుద్ధుడగును. ఇది పొరబాటునచేసిన బ్రహ్మహత్యకు ప్రాయశ్చిత్తము. చేయవలెననిచేసినవాడు యావజ్జీవన మీవ్రతమును జరుపవలయును.

శ్లో॥ అథవా శృణుతాఽదిత్యా! । పాపశుద్ధ్యర్థ మాత్మనః
గ్రామా దనల మాహృత్య । ప్రవిశే త్పరితాపితః. 7
పశ్చా దనశనో వాఽపి । ధర్మయుద్ధేఽథ వాఽనిలే
అప్సు వా దేవతా శ్రేష్ఠాః! । మహాప్రస్థానకేఽపి వా. 8
బ్రాహ్మణార్థే బుధార్థే వా । సమ్యక్ప్రాణా న్పరిత్యజేత్
సురాపానాదిదోషేఽపి । నశ్యత్యేతేన దేవతాః!. 9

తా॥ అట్లుగానిచో గ్రామమునుంచి అగ్ని తెచ్చి అందు శరీరమర్పణచేయవలయును. లేనిచో నిరాహారియైగాని ధర్మయుద్ధమందుగాని మృతుడయేవరకు అన్నపానాదులనువర్జించి ఉత్తరదిక్కుకు ప్రయాణముచేసిగాని బ్రాహ్మణులనిమిత్తముగాని పండితుల

నిమిత్తముగాని పాపములనువిడచిన శుద్ధుండగును. యీవ్రతముచే సురాపానదోషమున్న హరించును.

శ్లో॥ అగ్నివర్ణాం సురాం తప్త్వా। పాణివిచ్ఛేదనక్షమాం
పీత్వా నష్టశరీరస్తు। సురాపానా ద్విముచ్యతే. 10
సువర్ణ స్తేయకృ ద్గత్వా। రాజానముపగమ్య తు
స్వకర్మఖ్యాపనం కుర్యా। "న్మాం భవా ననుశా" స్త్వితి. 11
ఆయసం ముసలం తీక్ష్ణం। గృహీత్వా స్వయమేవ తు
హన్యా త్సకృత్స్వయోగేన। రాజా తం పురుషాధమం. 12

తా॥ కల్లును అగ్నితోసమానముగా కాచి త్రాగి శరీరము విడచిన సురాపాయికి నరకబాధ లేదు. బంగారును దొంగిలించిన వాడు రాజుదగ్గరకుపోయి "ఓ రాజా! నేనిట్టిపాపముచేసితిని. నన్ను శాస్త్రవిధిచే దండించు"డని చెప్పవలయును. ఇతనిని రాజు ఇనుప కఱ్ఱచే శిరస్సునొకదెబ్బకే పగులగొట్టవలయును.

శ్లో॥ ముచ్యతే స్తేయదోషేణ। నాస్తి రాజ్ఞోఽపి పాతకం
అవగూహే త్స్త్రియం తప్తాం। మయసా నిర్మితాం నరః. 13
స్వయం వా శిశ్నవృషణ। ముత్పాట్యాఽఽదాయచాంజలౌ
దక్షిణాం దిశ మాగచ్ఛే। ద్యావత్ప్రాణవిమోచనం. 14
అనేనవిధినా యుక్తో। ముచ్యతే గురుతల్పగః.

తా॥ ఇందుచే పాపి పుణ్యుడగును రాజునకు హత్యదోషములేదు. అగమ్యాగమనపాపి లోహమయమైనకాల్చినబొమ్మనుకౌగిలించిగాని, తనవృషణములుఛేదించి దోశిలియందుబెట్టుకుని దక్షిణదిక్కునకు నడచిగాని శరీమును విడిచిన శుద్ధుడగును.

శ్లో॥ తప్తకృఛ్రం చరే త్పంచ। సంవత్సర మతంద్రితః. 15
మహాపాతకినాం నృణాం। సంసర్గా చ్చ విముచ్యతే
మాతరం మాతృసదృశీం। భాగినేయీంతథైవచ. 16

మాతృష్వసార మారుహ్య । కుర్వన్ కృచ్ఛ్రాతికృచ్ఛ్రకః
చాంద్రాయణం చ కుర్వీత । తత్పాపవినివృత్తయే. 17

తా॥ వీరిసాంగత్యంబుచేసినవాడు అయిదుసంవత్సరంబులు తప్తకృచ్ఛ్రముచేసి పుణ్యాతుడగును. తల్లిని, తల్లిసమానురాలిని, మేనగోడలిని, తల్లితోఁబుట్టువును, పొందినవాడు అనేకకృచ్ఛ్ర చాంద్రాయణములను చేయవలయును.

శ్లో॥ స్వసారం దేవతా శ్రేష్ఠా! । గత్వా దుహితరం తు వా
కృచ్ఛ్రం సాంతపనం కుర్యా । ద్దోషశుద్ధ్యర్థ మాత్మనః. 18
భ్రాతృభార్యాభిగమనే । చాంద్రాయణచతుష్టయం
చరేత్తత్పాపశుద్ధ్యర్థం । సంతప్తో బ్రాహ్మణోత్తమః. 19
పితృష్వసుశ్చ గమనే । మాతుల్యా దుహితు స్తథా
చాంద్రాయణం చరేదేకం । కామతోఽకామతోఽపివా. 20

తా॥ కుమార్తెనుపొందినవాడు, తనపాప నివృత్తికొరకు కృచ్ఛ్రమును సాంతపనమును చేయవలయును. సోదర భార్యలను పొందినవాడు నాలుగుచాంద్రాయణములు చేయవలయును. తండ్రితోఁబుట్టినదానిని, మేనమామకుమార్తెను పొందినవాడు కామిగాని అకామిగాని యొకచాంద్రాయణముచే శుద్ధుఁడగును.

శ్లో॥ అవశిష్టాసు సర్వాసు । బ్రాహ్మణస్త్రీషు మహాసురాః!
గత్వా కృచ్ఛ్రం చరేత్తప్త । మేవం తద్దోషశాంతయే. 21
క్షత్రియాణాం చ వైశ్యానాం । స్త్రీషు కృత్వా బుధశ్చరేత్
కృచ్ఛ్ర మన్యాసు బహుశో । గత్వా తప్తం చరేద్బుధః. 22

తా॥ యితరబ్రాహ్మణస్త్రీలను పొందినవాడు, ఒకతప్తకృచ్ఛ్రముచే శుద్ధుఁడగును. క్షత్రియస్త్రీనిగాని, వైశ్యస్త్రీనిగాని, యితరజాతిస్త్రీనిగాని అనేకమారులు పొందినవాడు తప్తకృచ్ఛ్రము నాచరింపవలయును.

శ్లో॥ బ్రహ్మచారీ స్త్రియం గచ్ఛే। త్కామతో సురసత్తమాః!
సంవత్సరం చరే ద్భైక్షం। వసిత్వా గర్ధభాజినం. 23
స్వపాపకీర్తనం కుర్యా। త్స్నాత్వా త్రిషవణం పునః
తస్మా త్పాపా త్ప్రముచ్యేత। మాసాత్కామవివర్జితః. 24

తా॥ బ్రహ్మచారి స్త్రీసాంగత్యముచేసిన, గార్ధభచర్మము ధరించి సంవత్సరము భిక్ష చరించవలయును. ఇతను మూడువేళల స్నానముచేసి తనపాపమును వెల్లడించవలయును. ఈప్రకారము నిష్కామి నెలకు శుద్ధుడగును.

శ్లో॥ అగ్నికార్యపరిత్యాగే। రేతస్స్కన్నే సమాహితః
స్నాత్వా ప్రణవసంయుక్తాం। వ్యాహృతిం చ తథైవ చ 25.
సావిత్రీం సశిరాం మానీ। జపే దయుతమాదరాత్
యతీనాం మింద్రియోత్సర్గే। స్నాత్వా శుద్ధ స్సమాహితః. 26
ప్రణవం పరమాత్మానం। జపే దయుత మాదరాత్

తా॥ బ్రహ్మచారికి స్ఖలనమైనను అగ్నికార్యమువిడచినను, శిరోవ్యాహృతిసహితముగా గాయత్రిని పదివేలుజపించినశుద్ధుడగును. సన్యాసికి రేతస్ఖలనమైనచో స్నానముచేసి పదివేలు బ్రహ్మప్రణవమును జపించిన శుద్ధుడగును.

శ్లో॥ బ్రాహ్మస్త్రీగమనేభిక్షు। స్తప్తకృచ్ఛ్రం వ్రతం చరేత్. 27
అన్యాసు బుద్ధిపూర్వం చే। త్తప్తకృచ్ఛ్రంసమాచరేత్
గత్వా వైశ్యాం చ రాజ్ఞీం చ। బ్రహ్మహత్యావ్రతంచరేత్.

తా॥ సన్యాసి బ్రాహ్మణస్త్రీనిపొందినచో తప్తకృచ్ఛ్రమును చేయవలయును. ఇతరస్త్రీనిగూడినను ఇదేవ్రతము. అథవా క్షత్రియ వైశ్యస్త్రీలను పొందినయతి బ్రహ్మహత్యావ్రతముచరించవలయును.

శ్లో॥ క్రమాన్మాసత్రయం పూర్వం । షాణ్మాసిక మనంతరమ్
బ్రాహ్మణస్తు విముచ్యేత । శూద్రీం గత్వాఽనేనమానవః.
విహితాఽకరణే తద్వ । త్ప్రతిషిద్ధాదిసేవనే
వేదవిప్లావనే చైవ । గురుద్రోహేఽన్యకర్మణి. 30
తప్తకృచ్ఛ్రం చరేత్తేన । ముచ్యతే సర్వదోషతః

తా॥ శూద్రస్త్రీని పొందిన బ్రాహ్మణుడు మొదటమూడు మాసములున్ను అనంతరము ఆరుమాసములున్న బ్రహ్మహత్యావ్రతముచరించవలయును. బ్రాహ్మణుడు విధినివిడచినను అవిధి ననుసరించినను వేదము చెరచినను గురువరులకు ద్రోహముచేసినను ఇతరపాపకర్మములు చేసినను తప్తకృచ్ఛ్రముచేసిన విముక్తుడగును.

శ్లో॥ అథవా సర్వపాపానాం । విశుద్ధ్యర్థం సమాహితః. 31
కుర్వీత శుశ్రూషణం నిత్యం । వేదాంతజ్ఞానినో గురోః
శ్రద్ధావినయసంయుక్తః । శాంతిదాంత్యాదిసంయుతః. 32
యావజ్జ్ఞానోదయం తావ । ద్వేదాంతార్థం నిరూపయేత్
నాస్తి జ్ఞానాత్పరం కించి । త్పాపకాంతారదాహకమ్. 33

తా॥ అట్లుగానిచో సర్వపాపాత్ములు బ్రహ్మనిష్ఠులైన మహానుభావులసేవచేసి వారుచెప్పినవ్రతమాచరించి వారియుపదేశమును తనకుజ్ఞానముగలుగువరకు వినుచు బ్రహ్మనిష్ఠుడైనయెడల ముక్తుడగును. బ్రహ్మజ్ఞానముకన్న పాపమునుపోగొట్టునది మరియొకటిలేదు.

శ్లో॥ మాసత్రయా ద్వినశ్యంతి । క్షుద్రపాపాని సువ్రతాః!
షణ్మాసశ్రవణా త్సర్వే । నశ్యంతేవోపపాతకాః. 34
మహాపాతకసంఘాశ్చ । నిత్యం వేదాంతసేవనాత్
నశ్యంతి వత్సరా త్సర్వే । సత్య ముక్తం మహాసురాః!. 35

తా॥ వేదాంతనిష్ఠుని మూడుమాసములు సేవించినచో స్వల్పపాపములున్ను, ఆరుమాసములు సేవించినచో ఉపపాతకములు

న్నా, సంవత్సరము సేవించినచో మహాపాపములున్నశించును.

శ్లో॥ "యశ్శ్రద్ధయా యుతో నిత్యం । వేదాంతజ్ఞానమభ్యసేత్
తస్య సంసారవిచ్ఛిత్తి । శ్శ్రవణా" దితి హి శ్రుతిః. 36
ఏవ మభ్యస్యత స్తస్య । యది విఘ్నోఽభిజాయతే
సర్వాన్ లోకాన్ క్రమాద్భుక్త్వా । భూమౌ జ్ఞానీ ప్రజాయతే.

తా॥ ఎవరుశ్రద్ధాభక్తులతో బ్రహ్మజ్ఞానము నభ్యసించునో అతనికి మహాసంసారము తొలగునని వేదములు చెప్పెను. బ్రహ్మజ్ఞానికి తపోవిఘ్నమైనచో సమస్తపుణ్యలోకములననుభవించి భూమియందు బ్రహ్మజ్ఞానియై పుట్టును.

శ్లో॥ సర్వలక్షణసంపన్న । శ్శాంత స్సత్యపరాయణః
పురశ్చ పూర్వభావేన । విద్వాంసం పర్యుపాసతే. 38
తత్సంపర్కా త్స్వ మాత్మాన । మపరోక్షీకృత మృషిః
స్వప్నాదివవిముచ్యేత । స్వసంసారమహోదధేః. 39
తస్మాత్సర్వప్రయత్నేన । స్వముక్త్యర్థం మహాసురాః!
సర్వదా సర్వముత్సృజ్య । వేదాంతశ్రవణం చరేత్. 40

ఇతి సనాతనధర్మసంహితాయాం ప్రాయశ్చిత్తనిరూపణం నామ చతుర్దశోఽధ్యాయః.

తా॥ ఈయన శమదమాదిసంపన్నుడై సత్యవంతుడై పూర్వజన్మమందువలెనే విద్వాంసులను సేవించి ఆయనకృపచే పరమాత్మను ప్రత్యక్షముచేసుకుని యీసంసారమువల్లనుంచి స్వప్నమువలెనే ముక్తుడగును.గాన ఓ దేవతులారా! సమస్తకార్యములువిడచి బ్రహ్మధ్యానముచేయవలయును.

ఇది సనాతనధర్మసంహితయందలి చతుర్దశాధ్యాయ
తాత్పర్య సంగ్రహము.

## అథ పంచదశో౽ధ్యాయః.



### శిల్పశాస్త్రమహిమ.

దే.

శ్లో॥ బ్రహ్మర్షే! సచ్చిదానంద। పరబ్రహ్మముఖోద్భవ!
శిల్పాఖ్యస్యోపవేదస్య। మహిమానం వదస్వ నః. 1

తా॥ బ్రహ్మముఖోద్భవుడవైన ఓ మహర్షీ! శిల్పమను పేరుగల ఉపవేదముయొక్క మహిమను మాకు చెప్పుమని కోరిన బ్రహ్మర్షి చెప్పుచున్నాడు.

బ్రహ్మర్షిః.

శ్లో॥ శృణుధ్వం దేవతా! స్సర్వే। శిల్పశాస్త్రస్యవైభవమ్
యస్య విజ్ఞానమాత్రేణ। ఇహా౽ముత్ర సుఖం వ్రజేత్. 2

తా॥ ఏశిల్పశాస్త్రముయొక్క మహిమ తెలిసినందువలన ఇహాపరభోగములు గలుగునో అట్టిమహిమను ఓ దేవతలారా! సావధానమనస్కులై వినుండు.

శ్లో॥ శిల్పాగమో బహువిధః। కధితః పండితోత్తమైః
దైవశిల్పం తథాదైత్య। శిల్పం గాంధర్వ మేవ చ. 3
మానవం శిల్పశాస్త్రం తు। పౌరుషం పంచమం విదుః
శ్రీవిశ్వకర్మణా ప్రోక్తం। దైవశిల్పం ప్రచక్షతే. 4

తా॥ ఓ దేవతలారా! శిల్పశాస్త్రము దైవశిల్పమనియు రాక్షసశిల్పమనియు గంధర్వశిల్పమనియు మానవశిల్పమనియు ఆరుషశిల్పమనియు అయిదువిధములని పండితులచే చెప్పబడెను. పరబ్రహ్మచెప్పబడిన శిల్పవేదము దైవశిల్పమని చెప్పబడును.

శ్లో॥ తస్య కల్పా బహువిధా। స్సృష్టిజ్ఞానాదిభేదతః
ఆద్యస్సృష్టిప్రకరణమ్। ద్వితీయం జ్ఞానశాస్త్రకమ్. 5

తృతీయం త్వాగమం ప్రోక్తం । చతుర్థం మంత్రరూపకమ్
పంచమం యోగరూపం స్యా । ద్దేవశిల్పం ప్రచక్షతే. 6

తా॥ అది సృష్టిజ్ఞానాదిభేదములవలన అనేకకల్పములు గలది. అందు మొదటిది సృష్టిప్రకరణము. రెండవది జ్ఞానశాస్త్రము. మూడవది ఆగమశాస్త్రము నాల్గవది మంత్రశాస్త్రము. అయిదవది యోగశాస్త్రము. ఈప్రకారము దైవశిల్పము చెప్పబడును.

శ్లో॥ దైత్యశిల్పం తథామాయా । రూపం ప్రాహు ర్మనీషిణః
మయాఖ్యో దానవానాం తు । శిల్పాచార్యః ప్రచక్షతే. 7
మాయావీ చ మహాయోగీ । మంత్రతంత్రవిదాంవరః
దానవానాం గురుః ప్రోక్తో । మయనామా మహాబుధః. 8

తా॥ దైత్యశిల్పము ఇంద్రజాలమహేంద్రజాలాది మాయాస్వరూపము. మయుడను నొకరాక్షసశిల్పాచార్యుడు కలడు. ఆయన మాయ మంత్రము తంత్రము యోగము మున్నగుసర్వమహాత్మ్యములు గలవాడు. రాక్షసులకుగురువు. అట్టిమయుడు సర్వజ్ఞుడు.

శ్లో॥ తస్య శిల్పం విచిత్రం స్యా । న్నానారూపం మనోహరం
క్షణాత్సృజతి లోకా న్వై । క్షణా త్సంహరతే స్వయమ్
తస్య యోగబలం సత్యం । దేవైరపి న శక్యతే
స రాక్షసా న్పాలయతి । శిల్పై ర్బహువిధై ర్బుధః. 10

తా॥ ఆయనయొక్కశిల్పము బహువిధమై మహారమ్యమై ఆశ్చర్యకరమైనది. ఆయన యోగశక్తివలన సమస్తలోకములను సృష్టించి తత్క్షణమేలయింపచేయును. ఆయన యోగమాహాత్మ్యము బ్రహ్మాదులకును చెప్పజాలరు. ఆయన యనేకఆపత్తులయందు తన సామర్థ్యముచే రాక్షసులను కాపాడును.

శ్లో॥ తస్య శాస్త్ర మనంతం స్యా । ద్దేవానా మపి దుర్లభం
గాంధర్వశిల్పం వక్ష్యామి । దేవా! శృణుత సాదరాత్. 11

తా॥ ఆయనయొక్క శిల్పశాస్త్రము అనంతమై దేవతలకగోచరమైనది. ఓ దేవతలారా! ముందు గాంధర్వశిల్పవిశేషంబు చెప్పెద వినుండు.

శ్లో॥ గీతశాస్త్రప్రకరణా । న్యనేకాని యతోఽభవన్
తద్గాంధర్వ మితిప్రోక్తం । దేవానాం సుమనోహరమ్. 12

తా॥ సంగీతశాస్త్రమునకు సాధనములైన వీణావేణ్వాదివిచిత్రసాధనములు ఏశాస్త్రమువలన గలిగెనో యది గాంధర్వశిల్పము. అది మిక్కిలి మనోహరములు.

శ్లో॥ మానుషం శిల్పశాస్త్రం స్యా । ద్భూలోకజనహేతుకం
తద్వినా మానుషాణాంతు। సర్వోపకరణం నహి. 13
తచ్ఛాస్త్రం స్యాత్పంచవిధం । సర్వలోకోపకారకమ్
అయోదారుశిలాతామ్ర । పాషాణం స్వర్ణమేవ చ. 14
లోకజీవనహేతూని । బ్రహ్మణా కల్పితాని వై
తచ్ఛాస్త్రం బ్రాహ్మణాధీనం । శిల్పాచార్యప్రబోధితం. 15

తా॥ మనుష్యశిల్పము భూలోకజనులకు ఉపయోగకరము. అదివినా మనుష్యులకెట్టిసాధనములేదు. అవి అయిదువిధములు. అది సమస్తలోకోపకారకమైనది. అయో దారు తామ్ర శిల సువర్ణములను నీమైమున్న లోకజీవనమునిమిత్తమై సృష్టికర్తచే కల్పించబడెను. ఆశాస్త్రము శిల్పాచార్యులచే నుపదేశింపబడి బ్రాహ్మణాధీనమై యుండును.

శ్లో॥ తైరేవ కార్యం సర్వం చ । నేతరైశ్చ కదాచన
శిల్పేన వర్ధతే లోకః । శిల్పజ్ఞానం మహ ద్భవేత్. 16
శిల్పశాస్త్రం మనోహారి । తస్మాచ్ఛిల్పం వరం విదుః
శిల్పాచార్యో మహావిద్వా । న్వేదవేదాంగపారగః

వాస్తుశాస్త్రార్థతత్త్వజ్ఞః । షట్కర్మాచరణోద్యతః
పంచకృత్యం రహస్యజ్ఞో । ధాతువాదైకతత్పరః. 18
అధ్యాత్మవిద్యాసంపన్నో । దేవైస్సంపూజ్యతే సదా.

తా॥ ఆశిల్పకృత్యములు వారిచే చేయదగినవే కాని యితరులకనర్హములు, శిల్పముచే లోకమభివృద్ధినిబొందును. శిల్పమువలననే బహువస్తుతత్త్వజ్ఞానము గలుగును. శిల్పశాస్త్రము బహురమ్యమైనది. గాన సర్వోత్తమశాస్త్రము. శిల్పాచార్యులనగా వేదవేదాంగములను పఠించి వాస్తుశాస్త్రములను గుర్తెరిగి షట్కర్మానుష్ఠానపరులై, పంచకృత్యరహస్యములనుగుర్తెరిగి సమస్తవస్తుశాస్త్రజ్ఞులై బ్రహ్మతత్త్వమును గుర్తెరిగినవారు. అట్టిశిల్పాచార్యులు దేవపూజ్యులు.

శ్లో॥ పౌరుషం శిల్పశాస్త్రం వో । వక్ష్యామి శృణుతాదరాత్.
ఇష్టాపూర్తాదికర్మాణి । యస్మాదభిహితాని వై
ఆధానాద్యశ్వమేధాంత । మహాయాగోపకారకమ్. 20

తా॥ ఇకముందు పౌరషశిల్పమును చెప్పెద వినుండు. యీమహాశిల్పమువలననే యిష్టాపూర్తాదికర్మలు ప్రవర్తించును. ఆధానాదిసమస్తక్రతువులకు పౌరుషశిల్పమే ఆధారభూతము.

శ్లో॥ తచ్ఛాస్త్రం యేన విజ్ఞాతం । తం తు దైవం విదుర్బుధాః
యజ్ఞానుష్ఠానమాత్రేణ । స్వర్గభోగో భవిష్యతి. 21
తదనుష్ఠానహేతుస్స్యా । చ్ఛిల్పశాస్త్రం మహత్తరం
పూర్తాదికర్మణాం హేతు । స్త్వైహాముత్రఫలప్రదం. 22

తా॥ ఈశిల్పమెవనిచే తెలియబడునో వారు దైవసమానులు. ఏ యజ్ఞానుష్ఠానముచే స్వర్గభోగము గలుగునో ఆయజ్ఞమునకు పౌరుషశిల్పమే ఆధారము. పూర్తాదికర్మలకు హేతువై యిహపరసౌఖ్యముల నిచ్చును.

శ్లో॥ తస్మాత్ త్వష్ట సనాతనాద్యాః । యాజకై ర్దేవవత్సదా
శిల్పశాస్త్రస్య మాహాత్మ్యం । కథితం వో మయాఽనఘాః!
సంపూర్ణతో ప్రవక్తుం హి । కశ్శక్తో దైవతం వినా

ఇతి సనాతనధర్మసంహితాయాం శిల్పశాస్త్రమహిమానువర్ణనం నామ పంచదశోఽధ్యాయః.

తా॥ అందుచే శాలిహోత్రాదివిశ్వకర్తలగు శిల్పాచార్యులు యజమానులచే దేవసములుగా పూజనీయులు గనుక ఓ దేవతలారా! శిల్పశాస్త్రమాహాత్మ్యము నాచే మీకు చెప్పబడెను. పరిపూర్తిగా చెప్పుటకు పరమాత్మునకుతప్ప అన్యులకశక్యము.

ఇతి సనాతనధర్మసంహితయందలి పంచమాధ్యాయ
తాత్పర్యసంగ్రహము.

---

అథ షోడశోఽధ్యాయః.

---

వాస్తుపురుషమాహాత్మ్యం.

దేవాః.

శ్లో॥ నమస్తేస్తు మహాభాగ! । బ్రహ్మర్షీణాం త్వ ముత్తమః
బ్రహ్మణో వాస్తుసంజ్ఞస్య । మాహాత్మ్యంబ్రూహి తత్వతః

తా॥ దేవతలడుగుచున్నారు. ఓసనాతనబ్రహ్మర్షి! వాస్తుబ్రహ్మయొక్కమాహాత్మ్యము మాకు సత్యముగా చెప్పుమని కోరిన బ్రహ్మర్షి చెప్పుచున్నాడు.

బ్రహ్మర్షిః

శ్లో॥ వక్ష్యామి వో మహాభాగా! । వాస్తుబ్రహ్మణో వైభవం
యస్య విజ్ఞానమాత్రేణ । సర్వపాపం ప్రణశ్యతి. 2

వాస్తుబ్రహ్మ మహాత్మాఽసౌ । పరమాత్మేతికీర్తితః
సర్వలోకా వసంత్యేతే । సర్వాధారేఽఖిలాత్మని. 3
వాస్తుబ్రహ్మేతిఖ్యాతో । సర్వదా వేదపారగైః
వాస్తోష్పతి ర్మహాత్మాఽసౌ । సర్వదేవసమస్కృతః. 4

తా॥ యేవాస్తుబ్రహ్మయొక్క తత్వము తెలుసుకొనుటచే సర్వపాపములు నశించునో వారిమాహాత్మ్యమును చెప్పుచున్నాను. వాస్తుబ్రహ్మయనగా పరమాత్మయే! యెవనియందు సర్వలోకములు నివశించియున్నవో యెవరుసర్వలోకాధారుడో ఆయనే వాస్తుబ్రహ్మ యని వేదవేత్తలచే చెప్పబడును. యీవాస్తోష్పతి సర్వదేవపూజనీయుడు.

శ్లో॥ సర్వత్ర గృహనిర్మాణే । తమేవాఽఽరాధయేత్ స్ఫుటః
పూజితః పరమాత్మాఽసౌ । సర్వాన్ కామాన్ ప్రయచ్ఛతి.
పుత్రాన్ పౌత్రాన్ తథా విద్యాం । ధనధాన్యాదిసంపదః
గోమహిష్యాదివృద్ధిశ్చ । రత్నాని వివిధాని చ. 6
అంబరాణి ప్రశస్తాని । సర్వాణ్యాఽఽభరణాని చ
కీర్తి శ్శ్రీ శ్చారుతా భాగ్యం । యద్యదైశ్వర్యకరం భువి. 8
వాస్తోష్పతేః కృపావేశా । ల్లభంతే నాఽన్యథా భువి

తా॥ గృహాదిసమస్తనిర్మాణములయందు ఆయననే పూజించవలయును. ఆయనపూజితుడై యజమానునికి సమస్తకోరికల నిచ్చును. ఏకోరికలనగా పుత్రులను, పౌత్రులను, విద్యను, ధనధాన్యాది సంపత్తులను, గోమహిషాదివృద్ధిని, సమస్తవస్తువులనున్ను, వస్త్రభూషణాదులనున్ను, కీర్తిని సంపత్తును, ఐశ్వర్యముమున్నగునదేది ఐశ్వర్యహేతువో అవియన్నియు వాస్తుబ్రహ్మనుగ్రహమువల్లనే కలుగును.

శ్లో॥ తస్మాత్తత్తం పూజయేద్విద్వాన్ । గృహారంభాదికర్మసు. 9
యజ్ఞకర్మణి దేవాది । ప్రతిష్ఠాయాం విధానతః
త మర్చయిత్వా విధివ । ల్లభంతే సర్వసంపదః. 10

తా॥ ఆహేతువువలన పండితుడు గృహారంభాది సర్వశుభకర్మలయందు వాస్తోష్పతిని పూజించవలయును. యజ్ఞాదులయందు పూజించినవారికి సర్వైశ్వర్యములుగలుగును.

శ్లో॥ తస్మాత్సర్వేషు కార్యేషు । పూజనీయో మహాత్మభిః
వాస్తోష్పతి ర్మయుబ్రహ్మ । సర్వలక్షణతత్పరః. 11
తద్వంశజా న్సైవ పూజేత । వాస్తుహోమాదికర్మసు
వాస్తుశాస్త్రవిదో ప్రాజ్ఞా । బ్రాహ్మణా వేదపారగాః. 12
శిల్పాచార్యా ఇతి ప్రోక్తాః । పూజ్యంతే సర్వకర్మసు

తా॥ వాస్తుపురుషుడనగా సాక్షాత్ జగత్కర్తయైన మయబ్రహ్మ గావున వాస్తుహోమాదిశుభకర్మలయందు తద్వంశజులనే పూజించవలయును. వాస్తుశాస్త్రజ్ఞులై వేదాంగములను గుర్తెరిగిన బ్రాహ్మణులు శిల్పాచార్యులని చెప్పబడుదురు. వీరిపూజవలన సమస్తశుభములు గలుగును.

శ్లో॥ బ్రహ్మర్షే! సచ్చిదానంద । స్వరూపామలవిగ్రహ!. 13
విశ్వేషాం దేవతానాం చ । వదోత్పత్తిం మహాగురో!

తా॥ పరబ్రహ్మరూపుండవైన ఓ బ్రహ్మర్షి! విశ్వదేవోత్పత్తిక్రమము చెప్పుమని దేవతలడిగిన బ్రహ్మఋషి చెప్పుచున్నాడు.

బ్రహ్మర్షిః.

శ్లో॥ దక్షస్య దుహితా సాధ్వీ । విశ్వరూపకుటుంబినీ. 14
నామ్నా సులక్షణా ప్రోక్తా । శుభాచారసమన్వితా
విశ్వరూపసుతా ప్రాజ్ఞా । విశ్వేదేవా స్త్రయోదశ. 15
బ్రహ్మనిష్ఠా గరిష్ఠాస్తే । సర్వలోకైస్సుపూజితాః.

తా॥ దక్షునియొక్క కుమార్తె మహాపతివ్రతయగు నీమె విశ్వరూపాచార్యులకు భార్య. ఆమె పేరు సులక్షణ. ఈమె మహాశీలవతి వీరికి "విశ్వేదేవతలు" అనే సంజ్ఞగల దేవతలు పదముగ్గురు పుత్రులుగలరు వారు బ్రహ్మవేత్తలై సర్వజనులకు పూజనీయులు.

శ్లో॥ ఆధానే క్రతుదక్షౌ చ । సాపిత్రే కాలకాముకౌ. 16
దర్శశ్రాద్ధే ధనురుచీ । తీర్థేషు ధూర్విలోచనౌ
నాందీముఖే సత్యవసూ । పురూరవార్ద్రవౌ తథాఽబ్దికే. 17
ఏకోద్దిష్టే రుద్రకృచ్ఛ్యౌ । దేవే కర్మసు విశ్రుతాః
ఆవాహనీయాః శ్రాద్ధే సర్వే । విశ్వేదేవా త్రయోదశ. 18
యే యత్ర కర్మణి ప్రోక్తాః । పూజనీయా విశేషతః.

ఇతి సనాతనధర్మసంహితాయాం వాస్తుపురుషమాహాత్మ్యం నామ షోడశోఽధ్యాయః.

తా॥ ఆపదముగ్గురిలో ఆధానకర్మయందు క్రతుదక్షులును, సాపిత్రమను పితృకర్మమునందు కాలకాముకులును, దర్శశ్రాద్ధమందు ధనురుచులును, తీర్థశ్రాద్ధమందు ధూర్విలోచనులున్నూ, నాందిముఖమునందు సత్యవసువులున్నూ, ఆబ్దికమునందు పురూరవార్ద్రవులున్నూ, ఏకోద్దిష్టశ్రాద్ధమందు రుద్రకృతు అనుఆయనయున్నూ, ఈ చెప్పబడిన శ్రౌతస్మార్త గృహ దేవపితృకర్మలయందు వీరలు ప్రధానదేవతలుగా పూజించతగినవారు.

ఇది సనాతనధర్మసంహితయందలి షోడశాధ్యాయ
తాత్పర్యసంగ్రహము.

## అథ సప్తపంచాశోఽధ్యాయః.

---

### దానవిధిః.

బ్రహ్మోవాచ:.

శ్లో॥ అథాఽతః సంప్రవక్ష్యామి । దానకర్మఫలం సురాః!
సర్వేషామేవ దానానాం । విద్యాదానం పరం స్మృతం. 1
విద్యయా ప్రాణినాం ముక్తి । స్తస్మాత్ జ్ఞాన మనుత్తమం
భూమిదానం చ గోదానం । అర్థదాన మతఃపరమ్. 2
కన్యాదానం చ ముఖ్యం స్యా । దన్నదానం తథైవ చ.

తా॥ బ్రహ్మఋషి చెప్పుచున్నాడు. ఓ దేవతలారా! దానఫలమును వినవలయును. అన్నిదానములకంటె బ్రహ్మజ్ఞానదానమే ముఖ్య. జ్ఞానముచే ముక్తి గలుగును. దానముఖ్యమైనది. భూదానము, గోదానము, ధనదానము, కన్యాదానము, అన్నదానము, ముఖ్యములు.

శ్లో॥ ధనధాన్యసమృద్ధాం యో । భూమిం దద్యా ద్ద్విజాయ సః 3
ఇహలోకే సుఖీ భూత్వా । ప్రేత్య చానంత మశ్నుతే
అన్నిమాత్రాం యో భూమిం । దద్యా ద్బ్రహ్మవిదే నరః
సర్వపాపవినిర్ముక్త । స్సంసార మతివర్తతే
శీలాయోపపన్నాయ । బ్రాహ్మణాయ బుధాయ చ. 5
యో దద్యా ద్బ్రాహ్మణే విద్యాం । సభూయోఽభిజాయతే.

తా॥ ధనధాన్యములు కలుగ చేయు భూమిని వేత్తకునిచ్చువాడు ఇహపరసుఖములను జెందును. బ్రహ్మవేత్తకు మూరెడు భూమి నిచ్చినను సర్వపాపహరమగును. నీతిగలవాడు, మంచిగుణవంతుడునైన బ్రాహ్మణునికొరకు వేదవిద్య నిచ్చిన ముక్తుడగును.

శ్లో॥ యతయే శ్రద్ధయా నిత్య । మన్నం దద్యా ద్యథాబలం. 6
బ్రహ్మలోక మవాప్నోతి । న పున ర్జాయతే భువి
మఠం వా యతయే దద్యా । న్న స భూయోఽభిజాయతే. 7
అమాయాంచ సురశ్రేష్ఠా! బ్రాహ్మణాయానసూయవే
అన్నం దద్యాన్మహాదేవం । సముద్దిశ్య సమాహితః 8
సోఽక్షయం ఫలమాప్నోతి । మహాదేవసమో భవేత్.

తా॥ యతికి శ్రద్ధతో నన్నమునిచ్చువాడు బ్రహ్మలోకమును బొంది తిరిగిపుట్టును. యతికి మఠమునిచ్చినవానికి తిరిగి జన్మ లేదు. అమావాస్యయం దెవరు దేవతుల్యునిగా బ్రాహ్మణునిఅన్నపానాదులచే పూజించునో అతను దేవతుల్యుడు.

శ్లో॥ యో బ్రాహ్మణముఖే కుర్యా । చ్ఛ్రద్ధాభక్తిసమన్వితః. 9
స సర్వసమతా మేత్య । బ్రహ్మాఽఽప్నోతి సనాతనమ్
బ్రాహ్మణాయ ముదా దద్యా । చ్ఛ్వేతాం గాముత్తమాం నరః.
సర్వపాపవినిర్ముక్త । స్సాక్షా ద్బ్రహ్మ స గచ్ఛతి.

తా॥ యెవరు శ్రద్ధతో బ్రాహ్మణునిపూజించునో అతను బ్రహ్మను జెందును. యెవరు బ్రాహ్మణునికి గోవునిచ్చునో అతను బ్రహ్మను జెందును.

శ్లో॥ యో దద్యాత్కపిలాంశుద్ధాం । బ్రాహ్మణాయవిభూషితామ్.
సర్వపాపవినిర్ముక్తో । బ్రహ్మలోకం స గచ్ఛతి
యేన కేన ప్రకారేణ । యం యం దేవం సమర్చయేత్. 12
తం తం దేవం సమాప్నోతి । నాఽత్ర కార్యా విచారణా
యం యం కామయతే లోకే । తంత ముద్దిశ్య బుద్ధిమాన్.

తా॥ యెవరు కపిలధేనువును బ్రాహ్మణునకిచ్చునో అతను బ్రహ్మను జెందును. యేభక్తిచే నేదేవునిపూజించిన నాదేవతను జెందుదురు.

శ్లో॥ ఆత్మజ్ఞ మర్చయే న్నిత్య । మాత్మజ్ఞ మితి హి స్మృతిః
క్రిమికీటపతంగేభ్య । శ్శ్రేష్ఠాః పశ్వాదయ స్తథా. 14
పశ్వాదిభ్యో నరా శ్శ్రేష్ఠా । నరేభ్యో బ్రాహ్మణా స్తథా
బ్రాహ్మణేభ్యోఽధి విద్వాంసో । విద్వత్సు కృతబుద్ధయః. 15

తా॥ ఏకోరికచే బ్రహ్మవేత్తను పూజింతురో ఆకోరిక సిద్ధించును. క్రిమికీటాదులకన్న పశ్వాదులు శ్రేష్ఠములు. పశువులకన్న మనుష్యులు శ్రేష్ఠులు. మనుష్యులలో బ్రాహ్మణులు శ్రేష్ఠులు. వారిలో విద్వాంసులు శ్రేష్ఠులు విద్వాంసులలో కర్మిష్ఠులు శ్రేష్ఠులు.

శ్లో॥ కృతబుద్ధిషు కర్తార । స్తేభ్య స్సన్న్యాసినో వరాః
తేషాం కుటీచకా శ్శ్రేష్ఠా । బహూదకసమాశ్రితాః. 16
బహూదకా త్తతో హంసో । హంసా త్పరమహంసకాః
పరహంసాదపి శ్రేయా । న్నాత్మవి న్నాన్య స్స్వతోఽధికః. 17
తస్మా దాత్మవిదః పూజ్య । స్సర్వదా సర్వజంతుభిః.

తా॥ కర్మనిష్ఠులలో బహుకర్మనిష్ఠులధికులు. వారికంటె సన్న్యాసులు శ్రేష్ఠులు. వారిలో కుటీచకులు. వారికంటె బహూదకులు, వారికంటె హంసలు. వారికంటె పరమహంసలు. వారికంటె అవధూతలున్న సర్వోత్కృష్టులు గాన సర్వదా సర్వజనులచే బ్రహ్మవేత్తలు పూజ్యులు.

శ్లో॥ బ్రహ్మవర్చసకామస్తు । బ్రాహ్మణం పూజయే న్నరః. 18
ఆరోగ్యకామ ఆదిత్యం । బలకామ స్సమీరణమ్
కీర్తికామోఽనలం తద్వ । న్మేధాకామ స్సరస్వతీం. 19
జ్ఞానకామో మహాదేవం । సిద్ధికామో గణాధిపమ్
భోగకామ స్తు శశినం । క్షమాకామ స్తు శంకరమ్. 20
వైరాగ్యకామో విద్వాంసం । వృష్టికామ శ్శచీపతిం

ఏతాన్యాపరత శ్రద్ధా। భక్తిభ్యాం సహ యత్నతః. 21
క్షీయతే పాపకర్మాణి । క్షీయతే చాస్య హి స్మృతిః

ఇతి సనాతనధర్మసంహితాయాం దానప్రకరణం నామ సప్తదశోఽధ్యాయః.

తా॥ బ్రహ్మవర్చస్సుకాముడు బ్రహ్మను, ఆరోగ్యకాముడు సూర్యుని, బలముకోరువాడు వాయుదేవుని, కీర్తికాముడగ్నిని విద్యాకాముడు సరస్వతిని, జ్ఞానకాముడు మహాదేవుని, సిద్ధికాముడు గణాధిపతిని, వైరాగ్యకాముడు పండితుని, వర్షకాముడింద్రుని వీరు శ్రద్ధాభక్తులచే ఆయాదేవతలను పూజించినచో ఆయాసిద్ధులను పొందుదురు.

ఇది సనాతనధర్మసంహితయందలి సప్తదశాధ్యాయ
తాత్పర్యసంగ్రహము.

## అథ అష్టాదశోఽధ్యాయః

## పతివ్రతాధర్మ నిరూపణమ్.

దేవాః. శ్లో॥ సనాతనబ్రహ్మర్షే!। సర్వశాస్త్రార్థపారగ!
పతివ్రతాలక్షణం నో । బ్రూహి ధర్మవిదాంవర! 1

తా। దేవతలడుగుచున్నారు. సర్వజ్ఞుడవైన ఓసనాతన బ్రహ్మర్షీ! మాకు పతివ్రతామాహాత్మ్యమును చెప్పుమని కోరిన బ్రహ్మర్షి చెప్పుచున్నాడు.

బ్రహ్మర్షిః

శ్లో॥ అనంతోదారమార్గేణ। గతి ర్యుక్తా మహాత్మనామ్
యాం తాం గతి మవాప్నోతి। ధ్రువం స్త్రీ పతిసేవయా

కురూపో వా సురూపో వా । కుష్ఠస్తు సుభగోఽథ వా
రోగీ వాఽథ పిశాచో వా । మద్యపః క్రోధనోఽపి వా. 3
దుశ్శీలో వా సుశీలో వా । సధనో నిర్ధనోఽపి వా
వృద్ధో వాఽథ విదగ్ధో వా । మూర్ఖోఽన్ధో బధిరోఽపి వా
కాతరః కితవో వాఽపి । లలనాలంపటోఽపి వా
నపుంసకో వా దైవేన । భిన్నశేఫోఽథ వా భవేత్. 5

తా॥ మహాత్ములకు సమస్తధర్మములవలన యే పరమపదము గలదో యది పతిశుశ్రూషచే పతివ్రతలకు లభించును. తన భర్త రూపవంతుడుగాని, కురూపిగాని, భాగ్యవంతుడుగాని, దరిద్రుడుగాని, అంగహీనుడుగాని, అన్నివిధముల హీనుడైనను.—

శ్లో॥ బాలయా వా యువత్యా వా । వృద్ధయా వాఽపి యోషితా
మాతాపిత్రోస్సుహృద్భ్రాత్రోః । పుత్రపౌత్రాభిసంవృద్ధయా. 6
పారిబర్హాస్తధనయా । సర్వావస్థాసు సర్వదా
సతతం దేవవత్పూజ్యః । సాధ్వ్యా వాక్కాయకర్మభిః. 7

తా॥ వయోవంతురాలైనను బంధువులుగలదైనను చేతచిక్కినధనముగలదైనను సర్వావస్థలయందు త్రికరణములచే పతివ్రత తనభర్తను దేవతుల్యునిగా పూజించవలయును.

శ్లో॥ న జాతు విప్రియం భర్తుః । స్త్రియా కార్యం కదాచన
న స్వతంత్రేణ కర్తవ్యం । కించిత్కార్యం గృహే సతీ. 8
అహంకారం చ కామం చ । క్రోధలోభౌ విహాయ చ
మనసో రంజనం పత్యుః । కార్య మన్యస్య వర్జనమ్. 9

తా॥ స్త్రీ యెల్లప్పుడు భర్తకు వ్యతిరిక్తముగా సంచరించరాదు. స్వతంత్రముగా గృహమం దేకార్యమును చేయరాదు. కామక్రోధాదులను వర్జించి భర్తమనస్సును సంతోషింపచేయుచుండవలయును.

శ్లో॥ కామం వీక్షితాఽప్యన్యైః । ప్రియైర్వాక్యైః ప్రలోభితా
స్పృష్టా హి జనసంమర్దే । న వికార ముపైతి యా. 10
ప్రలోభితా పరేణాఽర్థై । స్సా సతీ లోకభావనా
శపేనాఽపహృతా సాధ్వీ । పరేణ స్వగృహే కృతా. 11
పాతకే వా భవేద్దైర్యా । ద్బ్రహ్మచర్యపరాయణా
బలాత్కారం గృహీతా చే । త్ప్రాణానపి పరిత్యజేత్. 21

తా॥ యితరపురుషులచేచూడబడినదైనను ధనాశపెట్టబడినదైనను స్పృశించబడినదైనను యేస్త్రీ మోసము చెందదో ఆస్త్రీ పూజనీయురాలు. దైవవశమున పరగృహనివాసముగలిగినకాలమందు తనబ్రహ్మచర్యమును రక్షించుకోవలయును. వ్రతముచెడినచో ప్రాణత్యాగమును చేయవలయును.

శ్లో॥ సా కైవల్య మవాప్నోతి । కులకోటిం సముద్ధరేత్
వీక్షితాఽవీక్షితేనాఽన్యై । ర్హసితానహసత్యపి. 13.
భాషితా వా న భాషేత । సాధ్వీ సాధువిలక్షణా
రూపయౌవనసంపన్నా । గృహకృత్యేషు కోవిదా. 14
స్వాఽనురూపం నరం దృష్ట్వా । న యాతి వికృతిం సతీ.

తా॥ అట్టిస్త్రీ పాపిగాక స్వకులమునుద్ధరించి మోక్షమును పొందును. యితరులకు ప్రతిజాబునీయరాదు. పతివ్రత రూపయౌవనములతో కూడుకున్నదై గృహకృత్యదక్షురాలై తనకుతగినపరపురుషునిచూచి భ్రమజెందదు.

శ్లో॥ రూపవంతం నరం దృష్ట్వా । కురూపం చాఽత్మనః పతిమ్.
పతిం స్వమేవ సేవేత । కామబుద్ధ్యా పతివ్రతా
యా సా శ్రియా చ పార్వత్యా । భారత్యా వంద్యతేఽనిశమ్
సురూపం తరుణం రమ్యం । కామినీనాం చ వల్లభం
పరం యా స్వపతేశ్చాఽపి । సానమన్యేత పద్మజా. 17

తా॥ తనభర్త కురూపియైనను ఇతరులు రూపవంతులైనను తనభర్తను సకాములై సేవించవలయును. ఆమె లక్ష్మ్యాదిదేవతలచే సేవింపబడును. పతివ్రత తనభర్తకంటె ధనాదిసంపన్నులను చూచి భ్రమ చెందదు.

శ్లో॥ దేవో మనుష్యో గంధర్వ । స్సతీనాం కోఽపి న ప్రియః
పతిరేవ ప్రియ స్త్రీణాం । బ్రహ్మాదిభ్యోఽపి సర్వశః ॥ 18
భుక్తే భుక్తే తతః పత్యౌ । దుఃఖితే దుఃఖితా భవేత్
ముదితే ముదితాఽత్యర్థం । ప్రోషితే మలినాంబరా. 19

తా॥ పతివ్రతలకు దేవగంధర్వాదులుకూడ కోరతగినవారు కారు. అందరికన్న భర్తయే ప్రియుడు. భర్త భుజించిన తాను భుజించవలయును. దుఃఖమైతే దుఃఖించవలయును. సంతోషించిన సంతోషించవలయును. దేశాంతరగతుడైన మాసిన వస్త్రములను గట్టవలయును.

శ్లో॥ పశ్చాచ్ఛయీత సుప్తేఽస్మిన్ । ప్రబుధ్యేత్పూర్వమేవ చ
చింతితే నైవ ముదితా । హృదయే హర్షపూరితా. 20
న నిర్బంధేన దుఃఖేన । క్రోధేనాఽన్యభయేన చ
సర్వసౌభాగ్యసంయుక్తా । సర్వాకారసమృద్ధినీ. 21
ఆత్మానం చ స్వభర్తార । మేకపిండమనీషయా
యాఽనుగచ్ఛతి భర్తారం । సాఽరోహేద్బ్రహ్మణః పదమ్.

తా॥ భర్తనిద్రానంతరము నిద్రించి ఆయనకంటె ముందు లేవవలయును. భర్తచింతించినప్పుడు తానును చింతగానుండవలయును. నిర్బంధము, క్రోధము, యితరభయములచేగాక సౌభాగ్యవంతురాలై సమస్తకోరికలుగలిగి తనభర్తకు తనకు శరీరమొక్కటేయని భర్తననుసరించినది బ్రహ్మపదముపొందును.

శ్లో॥ భర్తుః శ్వశురయోః కుర్యా । ద్భక్త్యా శ్చాఽపి విశేషతః
కేనారా ద్వా వనా ద్వాఽపి । గృహం భర్తా యదా విశేత్.
ప్రత్యుత్థానాఽభినందేత । పాద్యాసనోదకేన చ
పరిసన్నభాండా మృష్టాన్నం । కాలే భోజనదాయినీ. 24
సంయుతా గుప్తధాన్యా చ । సుసమృష్టనివేశనా
గృహద్రవ్యం చ యావిత్తం । దిశేః పత్న్యాః కరే పతిః,

తా॥ భర్తకును, అత్తమామలకును, శుశ్రూష చేయువలయును. భర్తపొలమునుంచిగాని,వనమునుంచిగాని,వచ్చినచో బహువిధసేవలచే కష్టముతీర్చవలయును. భాండములున్నగునవి శుద్ధిపరచి సదాచారములుగలిగి పాకశుద్ధిగలదియై సకాలమునకు భర్తకుఅన్నపానాదులను పెట్టుచు నియతురాలై గృహశుద్ధిచేసి ధనధాన్యములనుదాచిపెట్టవలయును.

శ్లో॥ నిర్వర్త్య గృహకార్యం స్వం । కించిద్వ్యయధ్యాఽవశేషయేత్
భర్తు రాజ్ఞాం వినా నైవ । స్వబంధుభ్యో దిశే ద్ధనం. 26
అన్యాలాప మసంతోషం । పరవ్యాపారజాః కథాః
అతిహాసాఽతిరోష శ్చ । క్రోధస్థానం చ వర్జయేత్. 27

తా॥ భర్తతనచేతికిధనమునిచ్చినచో సంగయు వ్యయపెట్టక కొంతమిగల్చవలయును. భర్తయొక్కఆజ్ఞలేక బంధువులకు ధనమీయరాదు. యితరులతో మాట్లాడుట, సంతోషములేకయుండుట,పరకథలు, మిక్కిలినవ్వుట, అతిక్రోధము. ఇవి వర్జించవలయును.

శ్లో॥ యచ్చ భర్తా న పిబతి । యచ్చ భర్తా న ఖాదతి
యచ్చ భర్తా చ నాశ్నాతి । తత్సర్వం వర్జయే త్సతీ. 28

తా॥ భర్తకునిష్టములేనివస్తువులను విడువవలయును. భర్తగారామములో లేనప్పుడుఅలంకారాదులనువిడువవలయును.

శ్లో॥ తావత్ప్రభృతి నారీణాం । మాసి మాస్యాఽర్తవం భవేత్
ప్రథమేఽహని చాండాలీ । యథా వర్జ్యా తథాఽంగనా.
ద్వితీయేఽహని బ్రహ్మఘ్నీ । యథైవ బ్రహ్మఘాతినీ
తృతీయేఽహ్ని తదర్ధేన । చతుర్థేఽహని సువ్రతా. 30
స్నానం శౌచం తథాఽంగానాం । రోదనం హాసనం తథా
యాన మభ్యంజనం నారీ । ద్యూతం చైవాఽనులేపనమ్. 31
దివాస్వాపం విశేషేణ । తథా వై దంతధావనమ్.
మానసం మైథునం వాఽపి । వాచికం దేవతాఽర్చనమ్. 32
వర్జయే త్సర్వయత్నేన । నమస్కారం రజస్వలా.

తా॥ స్త్రీలకు ప్రతిమాసమందు రజస్సుగలుగును. మొదటిదినము చండాలస్త్రీసమము. ద్వితీయదినము బ్రహ్మఘాతిని. తృతీయదినము తదర్థరాలు. నాల్గవదినము శుద్ధురాలు. ఈదినములయందు స్నానము, గంధము, చదరంగము, పగటినిద్ర, దంతధావనము, మానసమైథునము, నోట, దేవపూజ, నమస్కారము ఇవిచేయరాదు.

శ్లో॥ రజస్వలాయా స్సంస్పర్శం । భాషణం చాఽపహాసనమ్. 33
శేషాన్నభోజనం చైవ । వర్జయేచ్చ రజస్వలా
అభ్యాగమనం చైవ । బహిః పర్యటనం తథా. 34
నద్యంతరణం చైవ । తైలాభ్యంగం విలేపనం
కించి న్నఖాదయే చ్ఛృంగం । నఖాని చ నికృంతయేత్. 35
ఛేదయే న్న ఫలాదీని । రజ్జుకృత్యం చ వర్జయేత్

తా॥ మరియొకరజస్వలస్త్రీని తాకుట, బహుమాటలాడుట, నవ్వుట, మెంగిలిఅన్నము ఇవిరజస్వలాస్త్రీవిడువవలయును. నదిదాటరాదు. గోళ్ళుగిల్లరాదు. ఫలాదులను గోయరాదు. ఇత్యాదిపనులు విడువవలయును.

శ్లో॥ శిశూ న్న భోజయే చ్చైవ । న భుంజ్యా చ్ఛిశుభి స్సహ. 36
గోదోహనం న కుర్వీత । న పశ్యే చ్ఛశిభాస్కరౌ
ముఖప్రక్షాళనగండూష । మలమూత్రవిసర్జనమ్. 37
రజస్వలైతాని కుర్యా । ద్బహిర్దేశే క్వచిద్గృహాత్
చతుర్థే దివసే ప్రాప్తే । నిద్రాస్థానం విలేపయేత్. 38
గోమయేన జలేనాఽపి । భుక్తస్థానం చ శోధయేత్

తా॥ పిల్లలకు అన్నము పెట్టరాదు, ఆవుపాలు పిండరాదు. సూర్యచంద్రులను చూడరాదు. ముఖప్రక్షాళనాదులను గ్రామము నకుదూరముగా చేయవలయును. నాలుగవదినమున పడక స్థలము మున్నగునవి శుద్ధిచేయవలయును.

శ్లో॥ దంతాన్ సంశోధయే త్స్నాత్వా । త్తృణరాజసముద్భవైః. 39
అపామార్గేణ కుర్యాచ్చ । భస్మనా వా విశోధయేత్
ద్వాత్రింశద్భి రపఃకుర్యా । ద్గండూషై రాస్యశోధనమ్. 40
ధాత్రీఫలోదకాన్యేవ । ఘర్షయే న్మూర్ధయేషుచ

తా॥ స్నానదినమందు ఉత్తరేణిచే గాని, భస్మముచేగాని, దంతధావనముచేసి, ముప్పదిరెండుసార్లు పుక్కిలించవలయును. ఉసిరికపప్పుతో తలంటుకుని సర్వవిధమాల్యము పోయేట్టుగా స్నానముచేయవలయును.

శ్లో॥ ఉద్ధృతేనోద కేనైవ । శిరో మేహమలాదికమ్. 41
క్షాళయే త్తీరదేశే తు । తీర్థే స్నాయా త్తతః పరమ్
నమస్కృత్య వివస్వంతం । గృహం యాయా దధోముఖా.
స్నాతా న్యపురుషం నారీ । న పశ్యే దాత్మనః పతిం

తా॥ ఇవియన్నియు నదీతీరమందు చేసి అనంతరము ఉదకమందుస్నానముచేయవలయును. యీప్రకారము స్నానముచేసి

సూర్యునినమస్కరించి యితరపురుషునుచూడకుండగా యింటికివచ్చి భర్తదర్శనపర్యంతము ఇతరులనుచూడరాదు.

శ్లో॥ స్మరంతీ మనసా సాధ్వీ । నపశ్యే ద్దర్భకా న్శిశూన్. 43
ప్రమాదా దన్యపురుషం । యది పశ్యే ద్రజస్వలా
వీక్షేత భాస్కరం దేవం । పతిరూపం మనస్వినీ. 44
బ్రహ్మకూర్చం పిబే త్పూర్వం । పంచద్రవ్య మథాపి వా
కేవలం ఘృతవాద్రవ్యం । క్షీర మాత్మవిశుద్ధయే. 45

తా॥ పసిపిల్లలను చూడరాదు. యితరపురుషునిచూచినచో భర్తనుస్మరించుచుసూర్యునికి నమస్కరించవలయును. బ్రహ్మకూర్చమునుగాని పంచద్రవ్యములుగాని గోక్షీరములుగానిప్రాశనచేయవలయును.

శ్లో॥ పశ్చా త్స్వయంప్రాశనం చ । భక్తపిండం గ్రసే త్సతీ
శిశూనాం ప్రేక్షణే దోషో । నాస్తీతి ఋషయో విదుః. 46
అలంకృతా సుప్రియతా । సమ్మృష్టసుఖభోజనా
భర్తార మనుగచ్ఛేత । తమేవ మనసా స్మరేత్. 47
నగచ్ఛే త్తాం ప్రవద్రత్తాం । యది గచ్ఛే త్స్మరాతురః
తత్ర రోగో జాయతేపుత్రః । స్వాభిశప్తః ప్రకీర్తితః. 48

తా॥ తరువాత కొంచెముఅన్నకబళమును భక్షించవలయును. అనంతరముశిశువులనుచూచిన దోషములేదు. తరువాత మృష్టాన్నమునుభక్షించి అలంకృతురాలై భర్తనుసేవించవలయును. రజస్వలాదోషముగలస్త్రీసంభోగముచేసినచో బొల్లిగలసంతానముగలుగును. గాన చేయరాదు.

శ్లో॥ గర్భిణీ స్యా ద్యదా నారీ । నియామేన సదా వసేత్
కృతరక్షా సుభూషా చ । వాస్తుపూజనతత్పరా. 49
న కుస్త్రీయాఽభిభాషేత । శూర్పవాతం చ వర్జయేత్.
మృతవత్సాదిసంసర్గం । పరాన్నం చ విసర్జయేత్. 50

బీభత్సం కించిదీక్షేత । న రౌద్రాం శృణుయాత్కథామ్.

తా॥ గర్భిణీస్త్రీ గృహమ్ములలంకరించి తానలంకరించుకొని నియమముచే సురక్షితురాలు కావలయును. గర్భిణీస్త్రీ దుష్టస్త్రీతో మాట్లాడరాదు. మృతవత్సాసాంగత్యము చేయరాదు. భయంకరములను వినుటయుకూడదు.

శ్లో॥ గురు నాఽత్యుష్ణ మాహార । మతిక్షార మపక్వకమ్. 51
తీక్ష్ణం క్షీరాకరం వస్తు । వర్జయే ద్వ్యంజనాదికమ్
కఠినాసనం న సేవేత । తథైవ విషమాసనమ్. 52
ఏతేన విధినా సాధ్వీ । శోభనం పుత్ర మాప్నుయాత్
నాఽతియత్నవతీ భూయా । ద్గృహకృత్యేషు గర్భిణీ. 53

తా॥ కఠినమైనవ్యంజనాదులను తినరాదు. హెచ్చుతగ్గు ప్రదేశములయందు కూర్చుండరాదు. అట్లైనమంచిపుత్రుడు గలుగును. గర్భిణీస్త్రీ అతికష్టమును జెందరాదు.

శ్లో॥ ఈర్ష్యారాగసముద్భూతా । విద్యమానే విమత్సరే
అప్రియం నైవ కర్తవ్యం । సపత్న్యాసు కదాచన. 54
న వసేత్పూర్వతః పత్యుః । స్థేయం వల్లభసన్నిధౌ
నిర్గచ్ఛే చ మహాభాగే । వల్లభాఽభిముఖా వసేత్. 55
కథ్యమానా కథా భర్త్రా । సాదరం శృణుయా త్సదా
సంభాషమాణా భర్తారం । నాఽతిక్రమ్య వదేత్క్వచిత్.
అహూతా సత్వరం గచ్ఛే । ద్రతిస్థానం రతోత్సుకా.

తా॥ పతివ్రతాస్త్రీ సపత్నులయందు కోపించరాదు. భర్తకెదురుకూర్చొనక భర్తయొక్క ఆజ్ఞప్రకారము వర్తించవలయును. భర్త చెప్పినఆలోచనలు వినవలయును. భర్త ముచ్చటచెప్పుచుండగా నిరాకరించరాదు. భర్త క్రీడార్థముపిలచిన సంతోషముతో చేరవలయును.

శ్లో॥ శాస్త్రాదికౌశలం విద్యాం । కలానాం లబ్ధ్య మేవ చ. 57
దర్శయంతం పతిం దృష్ట్వా । భవే దానందనిర్భరా
భర్త్రా నిందితాఽన్యాగ్రే । తాడితాపి ప్రియపౌరుషా. 58
వ్యసనితాఽపి భయం త్యక్త్వా । కంఠే గృహ్ణీత వల్లభమ్
ఉచ్చై ర్న రోదనం కుర్యా । న్నైవాఽక్రోశే జ్జనంప్రతి.
పలాయనం న కర్తవ్యం । నిజగేహాద్బహిః క్వచిత్
కుపితే త్వయి మే నాథ! । కా గతిః కిం వదామ్యహం?. 60
మయా యత్కృత మజ్ఞాతం । జ్ఞాతం వా తత్ క్షమస్వ భో!
పతి రేవ గతి స్త్రీణా । మితి వేదవిదో విదుః. 61

తా॥ భర్త చేయు విలాసముల కానందించవలయును. భర్తచే పతివ్రతాస్త్రీ కొట్టిదూషించబడినదైనను, భర్తనే ఆలింగనము చేయువలయును. భర్త కోపించినచో నితరులతో చెప్పుకొనక, బజారుకు పరుగెత్తక, ఓ స్వామీ! నాతప్పును క్షమించవలయునని వేడుకొనవలయును.

శ్లో॥ ఇత్యాదిలక్షణం వాక్యం । స్నేహజన్యం వదే త్సదా
ఉత్సవాదిషు బంధూనాం । గంతవ్యం సదనం యది. 62
ప్రాప్యాఽనుజ్ఞాం తదా పత్యు । ర్గచ్ఛే ద్వస్త్రవిభూషితా
న వసే త్సా చిరం తత్ర । ప్రత్యాఽగచ్ఛే త్త్వరితం సతీ. 63

తా॥ వివాహాదులకు బంధుగృహములకు వెళ్ళినచో తన బంధువులతో భర్తయొక్క ఆజ్ఞచే వెళ్ళవలయును. శీఘ్రముగా రావలయును.

శ్లో॥ అదత్త్వా నైత్యసం ద్రవ్యం । పత్యౌ దేశాంతరం గతే
వధ్వాఽపి జీవనార్థం తు । కర్మ కుర్యా దనిందితమ్. 68
కృత్వా భర్త్రా యథా వృత్తిం । వ్రజే ద్దేశాంతరం తథా
పతికల్పితయా వృత్త్యా । వర్తేత గృహమేధినీ. 69

శ్వశ్రూశ్వశురయోఃపార్శ్వే । నిద్రాకార్యాన్యతోఽనహి
ప్రత్యహం ప్రతివార్తా చ । విచేతవ్యా ప్రయత్నతః. 70
దూరతః ప్రస్థాపనేనూశ్చ । పత్యుః క్షేమోపలబ్ధయే
దేవతానాం ప్రసిద్ధానాం । కర్తవ్య ముపయాచనమ్. 71

తా॥ భర్త భర్త్యనిమిత్తము గ్రామాంతరము వెళ్ళినచో, యోగ్యమయినవృత్తిచే జీవించవలయును. భర్త గ్రామములో లేనప్పుడు అత్తమామల సమీపంబున శయనించవలయును. భర్తరాకకు నిరీక్షించుచు దేవతలను వేడుకొనవలయును.

శ్లో॥ ఏవమాది విధాతవ్యం । సత్యా ప్రోషితపూర్ణయా
స్వేచ్ఛాపస్ఫోటనం చైవ । పరపుంసోఽంగమర్దనం. 72
ఏవమాదీని కర్మాణి । వర్జయే ద్గృహమేధినీ
నిర్వర్త్య నిజకార్యాణి । దేహం ప్రక్షాళ్య వారిణా. 73
హరిద్రాలేపనం కృత్వా । ఆర్యామండన ముజ్వలం
సమీపం ప్రేయసో గచ్ఛే । దేకాననుత్ఫుల్లపంకజా. 74
పాదసంవాహనం కృత్వా । రమయే త్తం పతిం శనైః.

తా॥ పతివ్రత పొరుగింటికిపోవుట, పరపురుషుని కాళ్ళొత్తుట మున్నగుపనులు విడువవలయును. స్నానముచేసి పసపు మొదలగు మంగళవస్తువులను ధరించి అలంకృతురాలై చిరునగవుతో భర్తృసమీపమునకు వెళ్ళవలయును. భర్తను సేవలచే సంతోషింపచేయవలయును.

శ్లో॥ అనేన నారీవృత్తేన । మనోవాక్కాయసంయుతా. 65
ఇహైవ కీర్తి మాప్నోతి । పరలోకే పరాం గతిమ్
పాతివ్రత్యరతా నారీ ।యద్గృహే వర్తతే సతీ. 67
గృహే తత్రైవ నివసే । దన్యథా వనగో భవేత్.

ఇతిసనాతనధర్మసంహితాయాంపతివ్రతాధర్మోపదేశోనామ అష్టా
దశోఽధ్యాయః

తా॥ యీప్రకారము సద్వర్తనలచే పతివ్రత త్రికరణశు
ద్ధిగా భర్తను సేవించి యిహమందుకీర్తియు పరమందు బ్రహ్మపద
మును జెందును. పతివ్రతయైనభార్య యేపురుషునికిగలదో అతను
గృహస్థాశ్రమమునువహించనగును. లేనిచో అరణ్యమునకు వెళ్ళవ
లయును.

ఇది సనాతనధర్మసంహితయందలి అష్టాదశాధ్యాయ
తాత్పర్యసంగ్రహము.

## ఏకోనవింశోఽధ్యాయః.



### బ్రాహ్మణమహిమాఽనువర్ణనం.

బ్రహ్మర్షి గాన ద.

శ్లో॥ ఆసీదాత్మస్వయంభూశ్చ । సిసృక్షు ర్వివిధాః ప్రజాః
విశ్వకర్మేతి విఖ్యాత । స్సర్వలోకపితామహః. 1

తా॥ పంచభూతసృష్టికిపూర్వము విశ్వకర్మయనేపరమా
త్మ అనేకవిధములయినప్రజలను సృష్టిచేయనిచ్ఛగలవారైరిగనుక
వారే సర్వప్రజలకు పితామహము.

శ్లో॥ చరాఽచరాత్మకం విశ్వం । సృష్టి స్సదసదాఽత్మికా
యేన సృష్టా మహాత్మనా । విశ్వకర్మా స కీర్త్యతే. 2

తా॥ చరాచరాత్మకప్రపంచంబును సదసదాత్మకంబైన
సృష్టియును నిర్మించినవారే విశ్వకర్మ.

శ్లో॥ ఆసీద్ధ్యానమయం విశ్వం । కర్మణా చాఽవృతం దిశః
బ్రహ్మణః కర్మరూపస్య । ముఖాసీతి ప్రచక్షతే. 3

తా॥ పంచభూతమయమైన ప్రపంచముసృష్టిరూపమైనకర్త చే రచియించబడినదిగనుక దిక్కులు కర్మస్వరూపుడు అనగావిశ్వక ర్మయొక్క పంచముఖములని చెప్పబడును.

శ్లో॥ తదాననేభ్య స్సంభూతాః । బ్రహ్మాణ ఋషయోఽభవన్
దేవతిర్యఙ్మానవానాం । తేభ్య స్సృష్టి రజాయత. 4

తా॥ ఆపరబ్రహ్మయొక్క పంచముఖములవల్లను ప్రాదు ర్భవించిన సానగాదిపంచఋషులే నామాంతరముచే మనుమయాది పంచబ్రహ్మస్వరూపములజెంది దేవతిర్యఙ్మనుష్యస్థావరాది సర్వప్ర పంచమును సృజించిరి.

శ్లో॥ సద్యోజాతముఖోత్పన్నో । మనునామా ప్రజాపతిః
వామదేవాఖ్యవదనే । మయనామా ప్రజాపతిః. 5
అఘోరాఖ్యముఖే జాతో । త్వష్టృనామా ప్రజాపతిః
తత్పురుషముఖే జాతో । శిల్పిబ్రహ్మ సనాతనః.
ఈశానాఖ్యముఖే జాతో । విశ్వజ్ఞో పరమాత్మనః
ఏవం సర్వముఖేభ్య శ్చ । బ్రహ్మాణః పంచ జజ్ఞిరే 7

తా॥ అనగుణస్వరూపుడైనవిశ్వకర్మయొక్క సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానముఖమువల్ల మనుమయ త్వష్ట శిల్పి విశ్వజ్ఞ, బ్రహ్మలుద్భవించిరి.

శ్లో॥ మార్తాండాద్యా స్తథాఽదిత్యాః । విశ్వజ్ఞబ్రహ్మవంశజాః
విశ్వరూపబ్రహ్మవంశ్యాః । విశ్వేదేవా స్త్రయోదశ. 8

తా॥ ద్వాదశాదిత్యులున్ను విశ్వజ్ఞబ్రహ్మవంశజులు, విశ్వేదేవతలు విశ్వరూపబ్రహ్మవంశజులు.

శ్లో॥ మను, స్సానగ, గోత్ర శ్చ । మయ స్సనతన స్తథా
త్వష్టా హాభూవనగోత్రి శ్చ । శిల్పి ప్రత్నస్యగోత్రిజః.

సువర్ణఋషి గోత్రీశ్చ । విశ్వబ్రహ్మవిత్తమః
శతం చ వింశతిః పంచ । ఏవం బ్రహ్మగణక్రమః. 10

తా॥ బ్రహ్మముఖోద్భవులయిన సానగ సనాతనాది పంచబ్రహ్మర్షి గోత్రజులగు మను మయాది, పంచబ్రహ్మలనంశజులైన పంచవింశత్యుత్తర శతబ్రహ్మఋషులున్ను, ఏకాదశరుద్రులున్ను, ఇంద్రాద్యష్టదిక్పాలకులున్ను, ఆంగీరసస్వాయంభువాది విశ్వేదేవతలున్ను, పంచబ్రహ్మగోత్రోద్భవులయిన బ్రహ్మగణము.

శ్లో॥ సద్యోజాతం పూర్వదిక్చ్యాస్య । ద్వామదేవం చ దక్షిణా
అఘోరం పశ్చిమం దిక్చ్యా । తత్పురుషం చోత్తరా చ దిక్.
ఈశానమూర్ధ్వదిజ్ఞేయ । స్తస్యైవాః పరికీర్త్యతే
ముఖేభ్య స్సానగాద్యా స్తు । ఋషయః పంచ జజ్ఞిరే. 12

తా॥ బ్రహ్మాంశపరిమితములైన ప్రాగాదిపంచదిక్కులు సద్యోజాతాది పంచముఖములు. ఆముఖములయందు ప్రాదుర్భవించిన సానగాదిపంచఋషులు అగ్రజన్ములు.

శ్లో॥ సానగః ప్రాఙ్ముఖోత్పన్నో । దక్షిణే తు సనాతనః
అభూనః పశ్చిమే జాతో । ప్రత్నస్త్వుత్తరముఖే తథా. 13
సుపర్ణోర్ధ్వముఖోత్పన్నో । ఏతే బ్రహ్మముఖోద్భవాః
పంచబ్రహ్మర్షయశ్చైతే । ప్రపంచే బ్రాహ్మణాఽభవన్. 14

తా॥ బ్రహ్మయొక్క ప్రాగ్దక్షిణపశ్చిమోత్తరఊర్ధ్వదిఙ్ముఖములయందు ప్రాదుర్భవించిన సానగ, సనాతనాదిపంచబ్రహ్మర్షులున్ను ప్రపంచమునకు బ్రహ్మముఖోద్భవబ్రాహ్మణులని చెప్పబడును.

శ్లో॥ పంచ బ్రహ్మర్షయ స్సర్వ్యే । క్రియాస్సృష్ట్యాదితత్పరాః
పంచ బ్రహ్మస్వరూపాణి । గోత్రే స్వేచ్ఛయా ఘనః. 14

తా॥ బ్రహ్మముఖోద్భవులైన సానగాది పంచబ్రహ్మర్షులు సృష్ట్యాదులయందు ఆసక్తిగలవారలై పంచబ్రహ్మస్వరూపములను పొందిరి.

శ్లో॥ సానగాఖ్యస్య బ్రహ్మర్షేః గోత్రజా మనువంశజాః
మనోశ్శివస్వరూపత్వాత్ శైవాస్తే బ్రాహ్మణాస్స్మృతాః.

తా॥ మనుబ్రహ్మవంశజులైన బ్రాహ్మణులు మనువు శివస్వరూపుడగుటవల్లనుండి శైవమతస్థులు.

శ్లో॥ సనాతనాఖ్యబ్రహ్మర్షేః గోత్రజా మయవంశజాః
మయస్య విష్ణురూపత్వాత్ వైష్ణవా బ్రాహ్మణాస్స్మృతాః.

తా॥ మయబ్రహ్మవంశజులైన బ్రాహ్మణులు మయుడు విష్ణుస్వరూపమైనందున వైష్ణవమతస్థులు.

శ్లో॥ హభూనాఖ్యస్యబ్రహ్మర్షేః గోత్రజా త్వష్టృవంశజాః
త్వష్టాబ్రహ్మస్వరూపత్వాద్ద్వైతా బ్రాహ్మణాస్స్మృతాః.

తా॥ త్వష్టృబ్రహ్మవంశజులైన బ్రాహ్మణులు త్వష్టృబ్రహ్మస్వరూపుడైనందున ద్వైతమతస్థులు.

శ్లో॥ ప్రత్నబ్రహ్మర్షిగోత్రాశ్చ బ్రాహ్మణాశ్శిల్పివంశజాః
శిల్పినో హ్యింద్రరూపత్వాత్ తే ద్వైతమతగామినః. 18

తా॥ శిల్పిబ్రహ్మవంశజులైన బ్రాహ్మణులు శిల్పి ఇంద్రస్వరూపుడైనందున ద్వైతమతస్థులు.

శ్లో॥ సుపర్ణాఖ్యర్షిగోత్రీయాః విశ్వజ్ఞబ్రహ్మవంశజాః
విశ్వజ్ఞ సూర్యరూపత్వాత్ తే సౌరా బ్రాహ్మణాస్స్మృతాః.

తా॥ విశ్వజ్ఞబ్రహ్మవంశజులైన బ్రాహ్మణులు విశ్వజ్ఞబ్రహ్మ సూర్యస్వరూపుడైనందున సౌరమతస్థులు.

శ్లో॥ స్థపతిః స్థాపకత్వేన బ్రహ్మణో ముఖసంభవాత్
ఆచార్యనామ కర్తవ్యం తేషాం సత్కుల ముచ్యతే. 20

తా॥ బ్రహ్మముఖోద్భవులైన బ్రాహ్మణులయొక్క కులము సత్కులము. వారికి ఆచార్యనామము కర్తవ్యము.

శ్లో॥ ప్రణవబ్రాహ్మణానాం చ । స్వర్ణకర్మాణి జజ్ఞిరే
ప్రజారక్షణకర్మాణి । బ్రహ్మకర్మాణి చాఽభవన్. 21

తా॥ బ్రహ్మసంబంధులైన బ్రాహ్మణులకు నియమించబడిన అయో దారు, తామ్ర, శిల, సువర్ణకర్మలు ప్రజారక్షణవిషయములైన బ్రహ్మకర్మలు.

శ్లో॥ ఏతైశ్చ సృష్టివిషయై । శ్శిల్పినో బ్రాహ్మణాఽభవన్
పౌరుషేయాశ్చతి జ్ఞేయా । శ్శ్రీవిశ్వబ్రాహ్మణా స్తథా. 22

తా॥ బ్రాహ్మణులు సృష్టివిషయములయినకర్మలచేత విశ్వబ్రహ్మలనిన్ని పౌరుషేయులనిన్ని విశ్వబ్రాహ్మణులని చెప్పబడును.

శ్లో॥ అయోదార్వాదికర్మాణి । ప్రజానాం రక్షణాని చ
పంచ బ్రహ్మర్షిగోత్రేభ్యో । వ్రతదీక్షాం సమాప్నుయాత్.

తా॥ అయోదార్వాదిపంచకర్మలున్ను ప్రజాపరిపాలనార్థములు. చక్రాంకలింగధారణదీక్షామాత్రోపదేశాది అయిదువ్రతములున్ను సానగాదిబ్రహ్మఋషిగోత్రజులయిన బ్రాహ్మణుల వలన పొందవలయును.

శ్లో॥ పరబ్రహ్మముఖోత్పన్న । బ్రాహ్మణానాం కృతే యుగే
త్రేతాయాం క్షత్రియాణాం చ । వంశవృద్ధి స్సమీరితా.24

తా॥ కృతయుగమందు బ్రాహ్మణులున్ను త్రేతాయుగమందు క్షత్రియులున్ను వృద్ధిపొందుదురు.

శ్లో॥ వైశ్యానాం చాఽపి శూద్రాణాం । ద్వాపరే వృద్ధి రీరితా
సంకరాణాం కలౌ వృద్ధిః । రనులోమాదిజన్మనాం.

తా॥ ద్వాపరమందు వైశ్యులున్ను, శూద్రులున్ను, కలియుగమందు సంకరులున్ను, అభివృద్ధిపొందుదురు.

శ్లో॥ కృతే సంకల్పమాత్రేణ । త్రేతాయాం దృష్టిత స్తథా
ద్వాపరే మంత్రత స్సృష్టిః । హస్తస్పర్శాత్ కలౌ యుగే. 26

తా॥ అయోదార్వాదిసమస్తకర్మలు గృహోపలయు, ఉదకుంభ వేదికా యజ్ఞపాత్రమాంగల్యాదిసమస్తసృష్టిన్ని కృతయుగమందు సంకల్పమాత్రముననున్ను త్రేతాయుగమందు దృష్టిమాత్రముననున్ను ద్వాపరమందు మంత్రప్రభావముచేతనున్ను కలియుగమందు హస్తస్పర్శవల్లనున్ను నిర్మాపబడును.

శ్లో॥ శిల్పాచార్యస్య దేవస్య । స భేదం శృణు దేవతాః!
త్రికాలసంధ్యావందనా చ్చైవ । గాయత్రీజపపారనాత్. 27
వేదపాఠ పవిత్రాణాం । స వై దీక్షాప్రదో గురుః

తా॥ ఓ దేవతాలారా! శిల్పాచార్యులు సాక్షాద్విశ్వకర్మస్వరూపులు. ఆయనకు శిల్పాచార్యులకు అభేదము. త్రికాల సంధ్యావందనమువల్లనున్ను, గాయత్రీజపమువల్లనున్ను, వేదపాఠమువల్లనున్ను వారిజిహ్వ మిక్కిలి పవిత్రమయినది గాన నీశిల్పాచార్యులు సర్వకర్మదీక్షలనాచరింపచేయదగుదురు.

శ్లో॥ శిల్పినో హృదయం బ్రహ్మ । చంద్రసూర్యౌ చ చక్షుషీ. 28
హస్తౌ హరిహరౌ చైవ । సర్వాంగే సర్వదేవతాః
మణిబంధద్వయం ప్రోక్తం । వాయ్వగ్నిభ్యా మధిష్ఠితం. 29
కరయో స్సర్వతీర్థాని । గంగా, యమునా సరస్వతీ.

తా॥ శిల్పాచార్యులయొక్క హృదయము బ్రహ్మస్వరూపము. నేత్రములు చంద్రసూర్యులు. హస్తములు శివకేశవులు. సర్వాంగములు సర్వదేవతాస్వరూపములు. మణిబంధద్వయమునందు వాయువు అగ్నియు వసింతురు. హస్తములయందు గంగా, యమున, సరస్వతీ మొదలయిన సర్వతీర్థములుండును.

శ్లో॥ ప్రాణసంస్థాపనం కుర్యా । న్నయనోన్మీలనం తథా. 29
మంత్రయంత్రాది సంస్కారం । శిల్పాచార్యేణ కారయేత్
శిల్పాచార్యేణ కర్తవ్యః । స్థాపికాస్థాపనం తథా. 30

తా॥ దేవతాప్రతిష్ఠలయందు దేవతారూపములయొక్క ప్రాణప్రతిష్ఠయు నయనోన్మీలనమున్ను, మంత్రయంత్రాది సంస్కారములు, విగ్రహస్థాపనయున్ను శిల్పాచార్యులచే చేయింపవలయును.

శ్లో॥ ఆచార్యో శిల్పినాం చ । పరబ్రహ్మముఖోద్భవః
శిల్పాచార్యేణ సంస్థాప్య । మాందా పూజాం చ కారయేత్.

తా॥ శిల్పాచార్యులు సాక్షాద్బ్రహ్మముఖోద్భవులగుటచే దేవతావిగ్రహములయొక్క ప్రతిష్ఠలున్ను పూజలున్ను ప్రథమతః శిల్పాచార్యులచే చేయించవలయును

శ్లో॥ అన్యైర్నాచరితం లోకే । రూపం నిర్జీవమేవ హి
జలధాన్యాధివాసం చ । శిల్పాచార్యేణ కారయేత్. 32
అన్యజాత్యా చ కార్యం చే । త్కర్తా భర్తా వినశ్యతి

తా॥ అన్యులచే ప్రతిష్ఠాదులు చేయించినయెడల రూపము నిర్జీవమగును గాన జలధాన్యాధివాసాదులు శిల్పాచార్యులచే చేయించవలయును. అన్యజాతిచే చేయించినయెడల కర్తయు, భర్తయు, నశింతురు.

శ్లో॥ విశ్వకర్మకులే జాతో । గర్భబ్రాహ్మణ ఉచ్యతే. 33
శూద్రత్వం నాస్తి తద్వంశే । తద్వంశో బ్రాహ్మణోద్భవం

తా॥ విశ్వకర్మయొక్క కులమందుద్భవించినవారు గర్భబ్రాహ్మణులు. ఆవంశమందు శూద్రత్వములేదు. గాన వీరు జన్మబ్రాహ్మణులని రూఢిగా చెప్పవలయును.

శ్లో॥ య ద్విశ్వకర్మణస్యాస్య । పురుషస్య ముఖోద్భవం. 34
పౌరుషేయమితి ఖ్యాతం । బ్రాహ్మణ్యం పంచగోత్రజం

తా॥ విశ్వకర్మయొక్క పంచముఖములయం దుద్భవించిన సానగాది పంచర్షి గోత్రములగల బ్రాహ్మణ్యము పౌరుషేయ బ్రాహ్మణ్యము.

శ్లో॥ ముఖేభ్యో ఋషయో జాతా । స్సానగాద్యా మహాయశః 35
తద్గోత్ర బ్రాహ్మణాః వంద్యాః । బ్రాహ్మణస్యాగ్రిజన్మనః

తా॥ విశ్వకర్మయొక్క పంచముఖములవలన మహామహులైన సానగాదిపంచఋషులుద్భవించిరి. కనుక అగ్రజన్ములయిన బ్రాహ్మణులకు పంచగోత్రబ్రాహ్మణులు పూజింపతగినవారు.

శ్లో॥ ముఖోత్పన్నా బ్రాహ్మణా శ్చ । అర్చ్యాస్తే సర్వకర్మసు. 36
వర్జిత శ్చైవ సర్వత్ర । నేతరే చ కదాచన.

తా॥ సమస్తకర్మలయందున్ను పౌరుషేయబ్రాహ్మణులను పూజింపవలయును. క్షత్రియవైశ్యశూద్రులచే సర్వకర్మలయందు నితరులయొక్క పూజ చేయకూడదు.

శ్లో॥ కలౌ పంచసహస్రాణి । హ్యన్యక్షేత్రేషు సంభవాః. 37
వర్షాంతే చానులోమా శ్చ । ప్రతిలోమాది సంభవాః

తా॥ కలియుగమందైదువేలసంవత్సరములవరకు అన్యక్షేత్రసంభవులును, విలోమానులోమజాతులును వృద్ధియగును.

శ్లో॥ ద్వాభ్యాం చ భిన్నజాతిభ్యాం । పితృభ్యాం యో నరో భువి
జాయతే ద్విజత్వార్హేయః । ప్రోచ్యతే వ స సంకరః

తా॥ బీజ క్షేత్రములు వేరై రెండైనభిన్నజాతులయందు పుట్టినవతడు ద్విజుడని చెప్పబడును. వీరు సంకరులనియు నార్యులచే చెప్పబడెను.

శ్లో॥ భేదే బీజక్షేత్రయో ర్యః । పురుష స్సంభవేద్యది. 39
పురుష స్స ద్విజో జ్ఞేయ । స్సజాతే ద్విజత్వమతా

తా॥ క్షేత్రబీజములకు భేదముగలుగగా నెవరుజన్మించిరో వారు ద్విజులనిచెప్పబడుదురు. వారివారిజాతి ద్విజాతియని చెప్పబడును.

శ్లో॥ అన్యక్షేత్రస్య వర్ణస్య । సృష్టిస్థిత్యాదికర్మసు. 40
నాధికారో భవేత్తస్య । సనకుర్యాత్కదాచన

తా॥ అన్యక్షేత్రములయందుద్భవించినపురుషులకు సృష్టి పోషణవిషయములైనకర్మలయందధికారము లేదు. గాన సృష్టికర్మల నాచరించకూడదు.

శ్లో॥ బ్రాహ్మణేతరవర్ణానాం । హస్తస్పర్శాత్కథో విధిః. 41
ప్రథమం నశ్యతే కర్తా । ద్వైతం గచ్ఛత్యధో ధ్రువం

తా॥ బ్రాహ్మణేతరవర్ణములచేనొక్కహస్తస్పర్శవలన శాస్త్రవిధి నశించును. ప్రథమమున కర్త నశించును. అనంతరము ద్వైవము తొలగిపోవును.

శ్లో॥ శిల్పబ్రాహ్మణహస్తేన । పుత్రపౌత్రాభివర్ధనం. 42
తచ్ఛిల్పిబ్రాహ్మణంత్యేన । ఆచంద్రార్కంఫలంలభేత్

తా॥ శిల్పబ్రాహ్మణహస్తముచే ప్రతిష్ఠాదులుచేసినయెడల పుత్రపౌత్రాభివృద్ధిగలుగును. వారిచే చేయించిన సూర్యచంద్రాదులున్నంతకాలము ఫలముగలుగును.

శ్లో॥ బ్రహ్మణో వదనాజ్జాతో । బ్రాహ్మణః పరికీర్తితః. 43
బ్రహ్మణ స్తేజసా చైవ । బ్రాహ్మణో బ్రహ్మకర్మణః

తా॥ బ్రహ్మముఖోత్పత్తివలననున్ను బ్రహ్మతేజస్సువలననున్ను బ్రహ్మకర్మవలనన్నున్ను బ్రాహ్మణుడనిచెప్పబడును.

శ్లో॥ బ్రహ్మవంశోద్భవో బ్రాహ్మణశ్చ । నాఽన్యథాబ్రాహ్మణోభవేత్.
బ్రహ్మకర్మాధికారేభ్యో । బ్రాహ్మణా శ్శిల్పిన స్స్మృతాః

తా॥ బ్రహ్మవంశమందుజనించినవారే బ్రాహ్మణులుగాని మరియొకవిధముగాబ్రాహ్మణులుకానేరరు. బ్రహ్మవంశజులై బ్రహ్మసంబంధమైనసృష్టికర్మాధికారములుగల్గినందువలన శిల్పాచార్యులవారే బ్రాహ్మణులు

శ్లో॥ ప్రజానాం సృష్టివిషయః । బ్రాహ్మణానాం స్వభావజః. 45
ఏతైశ్చ సృష్టివిషయై । ర్బ్రాహ్మణా శ్శిల్పిన స్స్మృతాః

తా॥ ప్రజలకుపయోగకరమై పరబ్రహ్మకృత్యమయినశిల్పసృష్ట్యము శిల్పాచార్యుల అధీనముగాన వారే బ్రాహ్మణులు.

శ్లో॥ బ్రహ్మణా నిర్మితం లోకం । శిల్పాచార్యై శ్చ రక్షితం. 46
హలాదివస్తునిర్మాణై । ర్బ్రాహ్మణా శ్శిల్పిన స్స్మృతాః

తా॥ బ్రహ్మచే నిర్మింపబడిన యీప్రపంచమును సర్వవస్తు నిర్మాణముచే శిల్పాచార్యులు రక్షించిరి. గనుక వారే బ్రాహ్మణులు.

శ్లో॥ బ్రహ్మణా నిర్మితం శిల్ప । మయోదార్వాదికర్మభిః. 47
తద్బ్రహ్మముఖసంభూతా । బ్రాహ్మణా శ్శిల్పిన స్స్మృతాః

తా॥ శిల్పశాస్త్రము అయోదార్వాదికర్మలచేత బ్రహ్మచే నిర్మించబడెను. గాన ఆబ్రహ్మయొక్క ముఖమందుద్భవించిన శిల్పాచార్యులవారే బ్రాహ్మణులు.

శ్లో॥ మాతా శిల్పి పితా శాస్త్రం । అరూపం రూపముద్భవేత్
యస్మా త్పిండోద్భవం చైవ తస్మాదాచార్య ఉచ్యతే. 48

తా॥ రూపములులేని పాషాణాదులకు రూపములు కలుగచేయుటవలన ఆరూపమునకు శిల్పశాస్త్రము తండ్రియనియు శిల్పాచార్యులు మాతృస్వరూపమనియు అట్టిదార్వాదులకు పిండోత్పత్తి

మున్నగురూపములు గలుగచేసినందువలన శిల్పి ఆచార్యులనియు చెప్పబడుదురు.

శ్లో॥ ఆచనోతి హి శాస్త్రాణి । ఆచారే స్థాపయత్యపి
స్వయ మాచరతే యస్మా । త్తస్మాదాచార్య ఉచ్యతే. 49

తా॥ శాస్త్రములుసంగ్రహించి శిష్యులకుబోధించి స్వయముగా నాచరించిరిగనుక వారే ఆచార్యులని చెప్పబడుదురు.

శ్లో॥ పంచభూతాత్మకః ప్రాణః స్సర్గో రేతసోఽభవత్
రేతసో శిల్పనీతత్వా । చ్ఛిల్పి త్వాచార్య ఉచ్యతే. 50

తా॥ పంచభూతస్వరూపమైన ప్రాణము రేతస్సువలన గలిగెను. ఆరేతస్సు శిల్పిబ్రహ్మవలన సృష్టించబడెను. గనుక ఆసంతతివారే ఆచార్యులనబడుదురు.

శ్లో॥ మాతాపిత్రోశ్చ సంభూత । పుత్రశుద్ధ్యర్థ మేవ చ
శస్త్రాదిమంత్రసంస్కారా । చ్ఛిల్పి త్వాచార్య ఉచ్యతే. 51

తా॥ తల్లిదండ్రులవలన నుత్పన్నమైన శిశువుయొక్క పరిశుద్ధ్యర్థమై నాళచ్ఛేదనాద్యుపకరణములయిన శస్త్రాదులనుమంత్రముల చేసంస్కరింపచేయును గనుక శిల్పులు ఆచార్యులని చెప్పబడుదురు.

శ్లో॥ నాళస్య ఛేదనం పుంసో । జాతకర్మాదికర్మణః
ఆప్నోతి కారణత్వాచ్చ । శిల్పి త్వాచార్యనామకః. 52

తా॥ ఉత్పన్నమైనశిశువుకు నాళచ్ఛేదనమునుగూర్చియు జాతకర్మాదిసమస్తకర్మలనుగూర్చియు కారణభూతులుగనుక శిల్పి ఆచార్యులనబడును.

శ్లో॥ చరాచరాదిలోకేషు । జంతవో యోనిసంభవాః
శిల్పినా హి పరం సృష్టా । స్తస్మాచ్ఛిల్పి గురుర్మతః. 53

తా॥ చరాచరాదిప్రపంచములయందు దేవతిర్యఙ్మనుష్యాది

సమస్తజంతువులు శిల్పిబ్రహ్మచే రచియించబడినవి గనుక శిల్పిఆచార్యులనబడుదురు.

శ్లో॥ దేవతిర్యఙ్మానవానాం । సర్వేషాం రక్షణాయ చ
దేవప్రతిష్ఠాస్వాతంత్ర్యా । చ్ఛిల్పాచార్యః ప్రకీర్తితః. 54

తా॥ దేవతిర్యఙ్మనుష్యాదిసర్వజంతురక్షణార్థమై దేవతలను ప్రతిష్ఠించుటయందు స్వతంత్రులుగాన శిల్పి ఆచార్యులనబడుదురు.

శ్లో॥ సృష్టిమూల మిహైశ్వర్యం । మంత్రిమూలం పరం సుఖం
ఏతయో శ్శిల్ప్యధీనత్వా । చ్ఛిల్పి త్వాచార్య ఉచ్యతే. 55

తా॥ ఇహలోకైశ్వర్యమునకు సృష్టి హేతువు. పరసుఖమునకు మంత్రము హేతువు. ఈసృష్టిమంత్రములు శిల్పాచార్యాధీనము గనుక ఆచార్యులనబడుదురు.

శ్లో॥ దేవాగారం దేవరూపం । నిర్మితం శిల్పినా స్మృతం
శిల్పినిర్మితదేవానాం । కర్తవ్యాణి వదామి తే. 56

తా॥ దేవగృహమున్ను దేవరూపమున్ను శిల్పాచార్యులచే నిర్మించతగినది. శిల్పిచేనిర్మించబడిన దేవతనుగూర్చి ఆచరించతగిన క్రమమును వచించెద.

శ్లో॥ అష్టదిగ్బంధనం శంకు । బ్రహ్మస్థానం కపాలకం
ముఖాగారం ద్వారశాఖే । తత్ర చ ద్వారపాలకా. 57
విమానం గోపురం కార్యం । ధ్వజం శిఖర మేవ చ
కల్యాణమంటపం కుర్యా । త్సభాయాంమంటపం తథా. 58

తా॥ శిల్పాచార్యులు శిల్పశాస్త్రప్రకారము శంకుస్థాపనయును అష్టదిగ్బంధనమున్ను బ్రహ్మస్థానమున్ను కపాలస్థానమున్ను ముఖమంటపమున్ను ద్వారశాఖలున్ను అచ్చటద్వారపాలకులనున్ను విమానమున్ను గోపురమున్ను ధ్వజశిఖరములున్ను కల్యాణసభామంటపములున్ను నిర్మించవలయును.

శ్లో॥ ధాన్యాధివాసం జలాధివాసం । దేవతాహోమతర్పణం
దేవప్రతిష్ఠాం కుర్వీత । ప్రాణస్థాపన మేవ చ. 59
అనంతరం కళాన్యాసం । నైవేద్యం మంత్రపుష్పకం
భూషణానా మలంకారం । నమస్కారం యథావిధి. 60

తా॥ శాస్త్రప్రకారమాలయమును నిర్మించి అనంతరము తత్తద్దేవరూపములకు ధాన్యాధివాసమున్ను జలాధివాసమున్ను హోమములున్ను తర్పణమున్ను దేవప్రతిష్ఠయున్ను ప్రాణప్రతిష్ఠయున్ను అనంతరము కళాన్యాసమున్ను సహస్రనామార్చనయు నైవేద్యమును మంత్రపుష్పములున్ను భూషణములలంకరించుటయు నమస్కారమున్ను ఈ మొదలయిన కార్యములను తత్తదాగమోక్తప్రకారము యథావిధిగా చేయించవలయును.

శ్లో॥ ఆదౌ వాస్త్వర్చనం తత్ర । శిల్పిబ్రాహ్మణపూజనం
మంటపారాధనం కుర్యా । చ్ఛిల్పివేదపారగైః. 61

తా॥ మొదట వాస్తుపూజయున్ను శిల్పిబ్రాహ్మణపూజయు మంటపారాధనమున్ను మొదలయిన కార్యములను వేదవేత్తలైన శిల్పాచార్యులచే చేయించవలయును.

శ్లో॥ ఏతేషాం కర్మణాం ద్రవ్యం । యద్దేయం శాస్త్రతః క్రమాత్
ప్రత్నర్షివంశజానాం చ । బ్రాహ్మణానాం విశేషతః. 62

తా॥ దేవప్రతిష్ఠాదిసమస్తకర్మలకు నీయతగిన శాస్త్రోక్త దక్షిణాదిసమస్తద్రవ్యములున్ను ప్రత్నర్షిగోత్రోద్భవులగు శిల్పిబ్రహ్మవంశజులైన బ్రాహ్మణుల కీయవలయును.

శ్లో॥ శిల్పాచార్యైశ్చ కర్తవ్యం । సర్వం నాన్యైః కదాచన
శిల్పశాస్త్రోక్తమార్గేణ । కుర్వ న్సిద్ధి మవాప్నుయాత్. 63

తా॥ ప్రతిష్ఠాదిసమస్తకార్యములు శిల్పాచార్యులచే చేయించతగినదేగాని యితరులచే చేయించతగదు. శిల్పశాస్త్రోక్తము-

గా సర్వక్రియలు చేసినయెడల సంపూర్ణఫలమును పొందుదురు.

శ్లో॥ తత్సర్వం శిల్పశాస్త్రోక్తం। శిల్పశాస్త్రప్రమాణతః
కుర్వంత్యాగమతత్వజ్ఞా। శ్శిల్పశాస్త్రవిశారదాః. 64

తా॥ వేదశాస్త్రములను చదివిన శిల్పశాస్త్రజ్ఞులు శిల్పశాస్త్రప్రమాణానువలన శిల్పశాస్త్రోక్తప్రమాణమైన ప్రతిష్ఠాదిసమస్తకర్మలు చేయుదురు.

శ్లో॥ ధరా సంపూర్ణఫలదా। గావః క్షీరప్రదాఽఖిలాః
సర్వపాపహరా నిత్యం। సర్వోపద్రవనాశనం. 65
సర్వసంపత్కరం నిత్యం। ఐహికాముష్మికప్రదం
ఆయురారోగ్యఫలదం। సర్వధర్మరతాః ప్రజాః. 66
అగ్నిష్టోమఫలం నిత్యం। వాజపేయాధికం ఫలం
దైనందిన మవాప్నోతి। బింబతేజోఽభివర్ధతే. 67

తా॥ యీప్రకారము శాస్త్రవిధిగా శిల్పాచార్యులచే చేయించినచో భూమి సంపూర్ణముగా ఫలించును. గోవులుమిక్కిలి క్షీరములిచ్చును. సమస్తపాపములునశించును. సర్వోపద్రవములున్ను శమించును. సమస్తసంపదలున్ను, ఇహపరసౌఖ్యములున్ను, ఆయురారోగ్యములున్ను కలుగును. ప్రజలు సమస్తధర్మములందు వర్తింతురు. నిత్యమున్ను అగ్నిష్టోమ, వాజపేయ, ఫలములు కలుగును. బింబముయొక్క మాహాత్మ్య మభివృద్ధిని బొందును.

శ్లో॥ ముంచంతి వారి మేఘాశ్చ। కాలేకాలే శుభప్రదం
శ్రీ శిల్పాచార్యహస్తేన। ప్రత్యక్షం భవతి ధ్రువం. 63

తా॥ శిల్పాచార్యులచే సర్వకర్మలు ననుష్ఠించబడినచో సకాలమునకు మేఘములు వర్షించును. సర్వకాలములయందు శుభము కలుగుటయేగాక ఆప్రతిష్ఠింపబడిన దేవత నిశ్చయముగా ప్రత్యక్షఫలము నిచ్చును.

శ్లో॥ శిల్పబ్రాహ్మణహస్తేన । ప్రతిష్ఠాత్రాదివర్ధనం
తద్వంశ్యఋత్విజః కుర్యు । ర్యావచ్చంద్రార్కఫలం లభేత్. 60

తా॥ శిల్పిబ్రాహ్మణులచే ప్రతిష్ఠింపబడిన యెడల ప్రతిష్ఠాత్రాదిసర్వసంపత్తులు గలుగును. వీరు ఋత్విక్కులై సమస్తకార్యములు చేసిన యెడల ఆపుణ్యము సూర్యచంద్రులున్నంతకాలము వృద్ధిపొందును.

శ్లో॥ తస్మేన తాం పూజనార్థం । నైవేద్యగ్రహణాయ చ
వైఖానస బ్రహ్మణశ్యం । నియమేద్బ్రాహ్మణం తథా. 70

తా॥ అప్రతిష్ఠించిన దేవతాపూజకొరకున్ను ప్రసాదస్వీకారమునకున్ను వైఖానసబ్రాహ్మణుని శిల్పబ్రాహ్మణుని నియమించవలయును.

శ్లో॥ ధనుర్మాసే మాఘమాసే । వసంతే నవరాత్రిషు
కళ్యాణోత్సవం కుర్యా । చ్ఛిల్పాచార్యం ప్రపూజయేత్.

తా॥ ధనుర్మాసమునందును, మాఘమాసమునందును, వసంతఋతువునందును, నవరాత్రులయందును, కళ్యాణోత్సవములు జరిపి శిల్పాచార్యులను పూజించవలయును.

శ్లో॥ నేత్రోన్మీలనపాత్రం చ । వస్త్రం స్వర్ణశలాకయా
కుంభం ధేనుశ్చ దృష్టిశ్చ । శిల్ప్యాధీన మిహోచ్యతే. 72

తా॥ నేత్రోన్మీలనపాత్రయున్ను వస్త్రమున్ను స్వర్ణశలాకయున్ను కుంభమున్ను గోవున్ను దృష్టిన్ని యీమొదలైనవి శిల్పాచార్యులయధీనము.

శ్లో॥ పూగీఫలం చ కర్పూరం । హరిద్రాచూర్ణసంయుతం
తండులం పూర్వరశనే । గ్రంథిం కృత్వా త్రిధా చరేత్. 73

తా॥ పూగీఫలమున్ను కర్పూరమున్ను పచ్చనిఅక్షతలున్ను పూర్వరశనయందు ముడివేసి మూడుచుట్లు చుట్టవలయును.

శ్లో॥ పంచహస్తోన్నతా రాశి । రన్నస్య శుభదా స్మృతా
ఆదౌ తు శిల్పిపూజా స్యా । ద్దేవపూజా త్వనంతరం. 74

తా॥ సమప్రతిష్ఠయందు అయిదు చేతులు మెత్తుగల అన్నరాశి కుంభము పోయవలయును. మొదట శిల్పాచార్యులను పూజించి అనంతరము దేవతారాధన చేయవలయును.

శ్లో॥ తత్ర షోడశ దానాని । శిల్పాచార్యాయ దాపయేత్
శిల్పిబ్రాహ్మణతృప్తిశ్చే । ద్దేవం తుష్యతి నాఽన్యథా. 75

తా॥ ప్రతిష్ఠకాలమందు చేయవలసిన షోడశమహాదానములున్ను శిల్పిబ్రాహ్మణులకీయవలయును. ఆయన తృప్తిపొందినచో ఆదేవత తృప్తిపొందును. లేనిచో తృప్తిచెందదు.

శ్లో॥ నయనోన్మీలనవిధౌ । దేయం భూగోధనాదికం
శిల్పినే శుభదం దద్యా । దన్యస్మై న శుభప్రదం. 76

తా॥ నయనోన్మీలనక్రియయందు నివ్వదగిన సర్వదానములు శిల్పాచార్యులకీయవలయును. ఇతరులర్హులు కారు.

శ్లో॥ ఏతచ్ఛాస్త్రవిధానేన । కుర్యా ద్రాజ్యవివృద్ధయే
రాజా సర్వత్ర విజయం । గజాంతైశ్వర్య మాప్నుయాత్.

తా॥ ఉత్తముడైనరాజు రాజ్యాభివృద్ధికొరకు శాస్త్రోక్తవిధిచే దేవతాప్రతిష్ఠాదు లాచరించినయెడల దిగ్విజయమున్ను గజాంతైశ్వర్యములున్ను పొందును.

శ్లో॥ కన్యాక్షేత్రాణి గావశ్చ । ఛత్రం దత్వా తు చామరం
శిల్పాచార్యం చ సంతర్ప్య । సాష్టాంగం ప్రణమే ద్బుధః. 78

తా॥ శిల్పాచార్యులకొరకు కన్యా భూ గోదానములున్ను ఛత్రచామరములున్ను సమర్పించి మృష్టాన్నముచే తృప్తిజెందించి సాష్టాంగప్రణామంబు లాచరించవలయును.

శ్లో॥ బహిరంతరదృష్ట్యోశ్చ । సంస్కారం శిల్పినా చరేత్
దృష్టిదగ్రవ్య మిదం కర్తా । శిల్ప్యాధీనం చ కారయేత్. 78

తా॥ దేవతాబింబములయొక్క బహిరంతరదృష్టి సంస్కారము శిల్పాచార్యులు చేయవలయును. దృష్టిసంస్కారముల కీయతగినధనమును శిల్పాచార్యుల కర్పించవలయును.

శ్లో॥ చిరైశ్వర్య మవాప్నోతి । కర్తా త్వాయుష్య ముత్తమం
శిల్పశాస్త్రోక్తకర్మణా । కృతం నమ్యగ్వివర్ధతే. 80

తా॥ కర్త యీప్రకారము శిల్పశాస్త్రోక్తవిధిచే నాచరించినయెడల నత్యైశ్వర్యములున్ను పూర్ణాయుష్యమున్ను పొందును. చేసినపుణ్యా మభివృద్ధిపొందును.

శ్లో॥ బ్రహ్మవదనోద్భవా శ్శ్రేష్ఠా । స్సృష్టిస్థిత్యాదిధారణాత్
సర్వేభ్యః క్షత్రియాదిభ్యో ।ధర్మార్థాద్యుపదేశతః. 81

తా॥ క్షత్రియమొదలసమస్తపాత్రులకొరకు ధర్మార్థకామముల నుపదేశించుటవల్లనున్ను ప్రపంచనిర్వాహకమూలైనఅయోదార్యాది పంచకర్మలను ధరించుటవల్లనున్ను బ్రహ్మముఖోద్భవులైన బ్రాహ్మణులు సర్వోత్కృష్టులు.

శ్లో॥ తే బ్రహ్మవంశే సంభూతాః । దేవాద్యావాహనాయ చ
అనుగ్రహార్థం సర్వేషా । వృద్ధయే సృష్టికర్మణః. 82

తా॥ క్షత్రియాది సమస్తవర్ణములవారికి ధర్మములుపదేశించుటకున్ను దేవపితృలను తృప్తిబొందించుటకై ఆవాహనకొరకున్ను చరాచరాది సహితమైన ప్రపంచరక్షణకొరకున్ను సృష్టికి ముందుగా బ్రహ్మవంశమందు బ్రాహ్మణులు పుట్టిరి.

శ్లో॥ తస్య సంకల్పమాత్రేణ । ప్రపంచః పరికల్పితః
ముఖాద్యవయవై ర్వర్ణాః । వర్ణాశ్చ స్తద్వ త్పరికల్పితాః. 83

తా॥ అపరబ్రహ్మయొక్క సంకల్పమాత్రముచే పంచబ్రహ్మాత్మకమైన ప్రపంచమెట్లుకల్పించబడెనో అట్లునె బ్రాహ్మణాదివర్ణములున్ను జాతకార్మాదిధర్మములున్ను కల్పించబడెను.

శ్లో॥ జన్మనా బ్రాహ్మణా జ్ఞేయాః । కర్మణా బ్రహ్మచారిణః
అధ్యాపకా ద్వేదపాఠా । ద్విజ్ఞానా ద్బ్రహ్మవిత్తమాః. 84

తా॥ జన్మచే బ్రాహ్మణులున్ను కర్మచే బ్రహ్మచారులున్ను వేదపాఠముచే విద్వాంసులున్ను బ్రహ్మజ్ఞానముచే బ్రహ్మవేత్తలని తెలుసుకొనవలెను.

శ్లో॥ అపసవ్యం చ ప్రేతత్వం । శిల్పపాకాన్నభక్షణం
వికిరాన్నం వాయసాన్నం । అమశ్రాద్ధం తిలోదకం. 85
ద్విజాతిభి శ్చ కర్తవ్యం । బ్రాహ్మణైర్న కదాచన.

తా॥ బ్రాహ్మణాదిజాత్యంతరములయందుత్పన్నమైన విలోమానులోమప్రతిలోమజాతులనే ద్విజులు దహనసంస్థైన వాయసపిండామశ్రాద్ధాదులను చేయవలయును.

శ్లో॥ అనులోమవిలోమై శ్చ । ప్రతిలోమై స్సముద్భవాః
విలోమాదిత్రయోవర్ణాః । స్తే వై జాత్యంతరాస్స్మృతాః.

తా॥ అనులోమవిలోమప్రతిలోమములుగాబుట్టిన మూడువర్ణములు బ్రాహ్మణాదివర్ణములకనంతరమందు పుట్టినవి.

శ్లో॥ అనులోమవిలోమాభ్యాం । వర్ణాభ్యాం ముదితా స్సుతాః
మాతాపిత్రో శ్చ సాంకర్యా । ద్గ్రామబాహ్యాస్తు తేమతాః.

తా॥ అనులోమవిలోమసంకరులవల్ల నుత్పన్నమైనప్రతిలోమజాతులు గ్రామబాహ్యులనిచెప్పబడుదురు.

శ్లో॥ చతుర్యుగచతుష్పాదే । కలిధర్మప్రవర్తినా
జాతిద్వయేన యే జాతాః । స్తే తు ప్రోక్తా ద్విజాతయః. 88

తా॥ కలిధర్మమునుబట్టి జాత్యంతరములచే పుట్టినసంతా
నములు ద్విజులనబడుదురు.

శ్లో॥ బ్రాహ్మణా ద్రాజకన్యాయాం । విప్రో నామ ప్రజాయతే
బ్రాహ్మణా ద్వైశ్యకన్యాయాం । వ్యాపారో నామజాయతే.

తా॥ బ్రాహ్మణునివలన క్షత్రియజాతికన్యయందు విప్రుడును, బ్రాహ్మణునివలన వైశ్యస్త్రీయందుపుట్టినవాడు వ్యాపారుడనియుచెప్పబడును.

శ్లో॥ కృతే చతుష్పాదే చ । కలిధర్మప్రవర్తనాత్
నానాజాతిసముత్పన్నాః । ఋష్యశృంగాదయోఽభవన్. 90

తా॥ కృతయుగమందు కలిధర్మమువల్ల సముత్పన్నమైన ఋష్యశృంగ గౌతమ గార్గేయ శౌనకాదులు నానాజాత్యుద్భవులు.

శ్లో॥ వేణజాతేష వేశ్యాయాం । వశిష్ఠోప్యభవత్పురా
వశిష్ఠస్య కులే జాతో । వైదిక శ్చోచ్యతే బుధైః. 91

తా॥ వేణవేశ్యజాతులయందుబుట్టినవశిష్ఠునియొక్క కులము వైదికజాతికులమనబడును.

శ్లో॥ జాతః ఖలు పురా శక్తిః । శ్వసిష్ఠాత్పంచమస్త్రియాం
తత్పుత్రాద్వైదికవర్ణ శ్చ । లోకే మధుకరోఽభవత్. 92

తా॥ వశిష్ఠునివలన పంచమజాతిస్త్రీయందు పుట్టినశక్తియొక్కకులము మధుకరజాతికులమనబడును.

శ్లో॥ శక్తే శ్శ్వపచకన్యాయాం । పుంగనూరుపరాశరౌ
తయో శ్చ వంశ్యౌ లోకే తు । భవతః భూర్జకంటకౌ. 93

తా॥ శక్తిపురుషునివలన శ్వపచజాతిస్త్రీయందుబుట్టి పరాశరపుంగనూరులయొక్కకులము పాపజాతికులమనబడును.

శ్లో॥ పుంగనూరో శ్చ పుత్రౌ చ । శ్వపచో దాసరస్స్మృతః
ద్వితీయస్య చ పుత్రస్య । వంశః పారాశర స్స్మృతః. 94

తా॥ పుంగనూరునియొక్క పుత్రుడు శ్వపచదాసరజాతియ నిచెప్పి అనంతరము రెండవపుత్రుడైనపరాశరునివంశపారంపర్యము చెప్పబడును.

శ్లో॥ పరాశరా న్మచ్ఛ్యఘాత । కన్యాయాం సంగమా ద్దివా
వ్యాసోనామ కులే తస్య । కానీనః కీర్త్యతే కథా. 95

తా॥ పరాశరునివలన మత్స్యఘాతకజాతికన్యయందు పుట్టి నవ్యాసుడు కానీనజాతియనబడును.

శ్లో॥ పుత్రద్వయం ప్రసూతం తు । వ్యాసా ద్విధవయోషితః
ధృతరాష్ట్రః పాండవ శ్చ । గోళకౌ తౌ ప్రదీరితౌ. 96

తా॥ వ్యాసునివలన విధవస్త్రీలయందుపుట్టిన ధృతరాష్ట్ర పాండురాజులు గోళకజాతు లనబడుదురు.

శ్లో॥ వ్యాసాచ్చ దాసకన్యాయాం । జాతంపుత్రచతుష్టయం
వైశంపాయన పైలూచ । జైమినీ రోమహర్షణః. 97

తా॥ దాసీకన్యయందు వ్యాసునిచేత రోమహర్షణాదినలు గురు కుమాళ్ళు పుట్టించబడిరి.

శ్లో॥ వైశంపాయనపుత్రాణాం । వర్ణః కుండక ఉచ్యతే
తేషాం పుత్రా శ్చతుష్షష్టి । సహస్రాణ్యభవన్ పురా. 98

తా॥ వ్యాసపుత్రులైన జైమిని వైశంపాయనాదికుండక జాతులయొక్క సంతానములు ఆరువేలజనముగా వృద్ధినొందిరి.

శ్లో॥ చతుష్షష్టిసహస్రాణాం । మనుష్యాణాం పృథక్పృథక్
నానాగోత్రాణి వర్తంతే । తేషాం భేద స్సముచ్యతే. 99

తా॥ వైశంపాయనాదుల సంతానములు అరువది నాలుగు వేలజనములలో నానాజాతినామములు వర్తించును.

శ్లో॥ వివాహోఽదిమరాత్రౌ చ । తత్పత్నీం పంచమస్త్రీయం
దంపతీదర్శనం కుర్యా । త్పారంపర్యా దరుంధతీం. 100

తా॥ వశిష్టవంశజులైన వధూవరులు వశిష్ఠునకు పత్నియైన అరుంధతిని వివాహప్రథమరాత్రియందు దర్శనముచేయుదురు.

శ్లో॥ వివాహపంచమదినే । నీలలోహితకల్పనం
వేశ్యాహస్తేన కార్యం వై । వశిష్ఠోత్పత్తికారణాత్. 101

తా॥ వశిష్టవంశజులైన వధూవరులు వశిష్ఠునియొక్క జన్మకారణమువలన వేశ్యాఽశీర్వచనమును పొందుదురు.

శ్లో॥ కలౌ పంచసహస్రాణి । జాయతే వర్ణసంకరః
క్షత్రిపాలనరాహిత్యం । బ్రహ్మపూజావిసర్జనం. 102

తా॥ కలియుగాది అయిదువేలసంవత్సరములకు సంకర వర్ణముపుట్టుననిన్నీ బ్రహ్మపూజా క్షత్రియుపరిపాలన నశించునని చెప్పబడెను.

శ్లో॥ విష్ణు శ్శ్రుణు జగత్కర్తా । స తు దేవాధికో న చ
విశ్వకర్మా పరంజ్యోతి । స్స్వయం భో నిరుపాశ్రయః. 103
పంచబ్రహ్మ ఉత్కర్షో నిత్యం । పంచలింగైకకారకః
పంచనాడీషు సంచారీ । సహస్రారనివాసకః. 104
బ్రహ్మవిష్ణ్వీశ ముఖ్యా । సూర్యానిష్టాస దేవతాః
విశ్వవిజోఽభ్యవాధ్యక్షో । విశ్వాధీశో జగద్గురుః. 105
విశ్వస్య సృష్టివిషయ । స్థితి శ్చాఽపి లయ స్తథా
తిరోధానానుగ్రహే చ । జాయంతే విశ్వకర్మణః. 106

తా॥ విష్ణువు జగత్కర్తగాడు. దేవోత్తముడుగాడు. ఆపరంజ్యోతి స్వరూపుండైన విశ్వకర్మస్వయంభువున్ను తనకు ఆశ్రయము లేనివాడై సర్వజనులకు ఆశ్రయభూతుడు. పంచబ్రహ్మోత్కర్షుడు ను, పంచలింగకర్తయు ఇడా, పింగళ, సుషుమ్న, పూష, అలంపూషా నాడులయందు సంచరించువాడున్ను, సహస్రారచక్రమందు నివసించువాడున్ను బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్ర, సూర్యులనే, పంచబ్రహ్మ

లకాధారభూతుడున్ను ప్రపంచము యొక్క బీజమునుత్పత్తిచేసిన అధ్యక్షుడున్ను, జగద్గురువున్ను, ప్రపంచము యొక్క సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములకు హేతుభూతుడున్ను అయిన ఆవిశ్వకర్మ సర్వాధికులు.

శ్లో॥ అయఃకర్మా మనుశ్చాఽసీ। ద్దృగ్వేదాఽధ్యాపక స్తథా
దారుకర్మా మయశ్చాఽపి। యజుర్వేదపరాయణః. 107
తామ్రకర్మాఽభవ త్త్వష్టా। సామాధ్యాయీ మహాతపాః
శిలాశిల్పకర శ్చాఽసీ। చ్ఛిల్పీ చాఽథర్వణ స్తథా. 108
రౌప్యాదికర్మకృ ద్విప్రో। దైవజ్ఞః ప్రణవాత్మకః
ఏవం కర్మాణి వేదాశ్చ। బ్రహ్మభిః పంచ నిర్మితాః. 109

తా॥ మనుబ్రహ్మపతి ఋగ్వేదపారాయణులున్ను, అయఃకర్మధారకులనియును, మయబ్రహ్మపతి యజుర్వేదపారాయణులును దారుకర్మధారకులనియును, త్వష్టబ్రహ్మపతి సామవేదపారాయణులున్ను, తామ్రకర్మధారకులున్ను, శిల్పిబ్రహ్మపతి అథర్వణవేదపారాయణులున్ను, శిల్పకర్మధారకులనియు, విశ్వజ్ఞబ్రహ్మపతి ప్రణవవేదపారాయణులును సువర్ణకర్మధారకులనియు నీ ప్రపంచమునకు పంచబ్రహ్మలు పంచవిధకర్మలనువిధించినవారైరి.

శ్లో॥ విశ్వబ్రహ్మకులశ్రేష్ఠా। ధర్మజ్ఞా వేదపారగాః
వేదాంగానాంచ శిల్పానాం। వేత్తా స్యాద్యోగసంఖ్యయోః.
సత్యవాక్య స్సదాచారో। విద్యాకౌశలబుద్ధిమాన్
సర్వలక్షణసంపన్న। స్సర్వాలంకారశోభితః. 111
స్వజాతిస్త్రీపరిణయీ। ఏకపత్నీవ్రత స్తథా
ఏవం లక్షణసంపన్నో। బ్రాహ్మణః పరిచక్షతే. 112

తా॥ విశ్వబ్రహ్మకులమందు జన్మించినవారున్ను, ధర్మవేత్తలున్ను, వేదమునుచదివినవారున్ను, వేదాంగములయొక్కయు,

యోగసాంఖ్యములయొక్కయు, రహస్యమును గుర్తెరిగినవారున్ను,సత్యవాక్యవంతులున్ను, సదాచారవంతులున్ను, విద్యయందు నేర్పుగలబుద్ధిగలవారున్ను, సమస్తమైనశుభలక్షణములుగలవారున్ను, సర్వాలంకారములచేత ప్రకాశించువారున్ను, స్వజాతిస్త్రీనివివాహము చేసుకున్నవారున్ను, ఏకపత్నీవ్రతస్థులున్ను, అయినటువంటిశుభలక్షణములుగలవారు బ్రాహ్మణులని చెప్పబడుదురు.

శ్లో॥ అన్యజాత్యాంవివాహం చ । పుత్రోత్పత్తిం న కారయేత్
యది కుర్యాద్వమూఢాత్మా । బ్రాహ్మణో న భవేత్తుసః.

తా॥ అన్యజాతియందు వివాహమున్ను, పుత్రోత్పత్తిన్ని,కలుగచేయకూడదు. అట్టిపనులను చేసినయెడల బ్రాహ్మణులు కానేరరు.

శ్లో॥ బ్రహ్మర్షీణాం సానగాది । గోత్రాణాం విశేషతః
బ్రాహ్మణానాం పంచవేదాః । నష్టానే నియతాత్మనాం.
మనుసూత్రవిధానేన । సర్వకర్మాణి సర్వదా.

తా॥ బ్రాహ్మణులైన సానగాదిమహాఋషులయొక్క గోత్రములైన బ్రాహ్మణులు మనుసూత్రవిధానముగా సర్వకర్మలను ఆచరించవలయును.

శ్లో॥ కూటస్థరహితం మంత్రం । కూటస్థరహితాఽన్వయం
కూటస్థరహితం లోకం । కూటస్థరహితం గృహం. 115
కూటస్థరహితం కర్మ । కూటస్థరహితోద్భవం
కూటస్థరహితం వర్ణం । కూటస్థరహితం మతం. 116
కూటస్థరహితం ధర్మం । యత్ర తన్నాఽనుమన్యతే.

తా॥ కూటస్థరహితములైన యీపైనచెప్పబడువిషయములంగీకరింపబడ నేరవు.

శ్లో॥ న భూమి ర్న జలం చైవ । న తేజో నచ మారుతః. 117
న చాఽఽకాశం నచ బ్రహ్మ । న విష్ణు ర్న మహేశ్వరః
న సూర్యాదిగ్రహా స్సర్వే । న చ నక్షత్రతారకాః. 118
సర్వశూన్యనిరాలంబం । విశ్వకర్మా స్వయంప్రభుః

తా॥ సృష్టికిపూర్వము పృథివ్యాదిపంచ మహాభూతములున్ను, బ్రహ్మవిష్ణ్వాదిమూర్తులున్ను, సూర్యాదిసర్వగ్రహములున్ను, అశ్వన్యాదినక్షత్రములున్ను, ధృవాదితారలున్ను, లేక స్వయంప్రకాశమానులై సత్యజ్ఞానాఖండస్వరూపులైనఒకవిశ్వకర్మయే ప్రకాశించు చుండెను.

శ్లో॥ తస్మాచ్చ సకలం జాతం । పంచభూతాత్మకం జగత్. 119
బ్రహ్మవిష్ణుశ్చరుద్రశ్చ । ఇంద్రాదిత్యౌ తథైవచ
సూర్యాదిగ్రహగోళాని । తథా నక్షత్రతారకాః. 120
సృష్ట్వా సర్వ మిదం సమ్య । క్ప్రవివేశ తదంతరే.

తా॥ అపరబ్రహ్మమైనవిశ్వకర్మ పృథివ్యాదిపంచమహాభూతములనున్ను, బ్రహ్మాదిపంచమూర్తులనున్ను, సూర్యాదినవగ్రహములనున్ను, అశ్వన్యాదినక్షత్రములనున్ను, ధృవాదితారలనున్ను, సృష్టించి అవి నిశ్చేతన్యములైన వాటియందు తాను ప్రవేశించి సచేతనములనుగా చేసినవాడాయెను.

శ్లో॥ పూర్వభాగే మనుం చైవ । దక్షిణే చ మయం తథా. 121
త్వష్టారం పశ్చిమే చైవ । ఉదగ్భాగే తు శిల్పినం
విశ్వజ్ఞ మూర్ధ్వభాగే చ । పంచమూర్తీం శ్చ స్థాపయేత్.
ఏకమూర్తిం న సేవేత । బ్రాహ్మణానా మిదంవ్రతం.

తా॥ బ్రాహ్మణులు పూర్వభాగమందు మనుబ్రహ్మనున్ను దక్షిణభాగమందు మయబ్రహ్మనున్ను, పశ్చిమభాగమందు త్వష్టృబ్రహ్మనున్ను, ఉత్తర భాగమందు శిల్పిబ్రహ్మనున్ను, మధ్య

భాగమందు విశ్వజ్ఞబ్రహ్మనున్ను, స్థాపించి పూజించవలసినదేగాని ఏకమూర్తిని ఆరాధించకూడదు.

శ్లో॥ ధార్యం భస్మ త్రిసంధ్యం తు । గృహిణా జలసంయుతం
సర్వకాలే భవేద్భస్మ । యతీనాం జలవర్జితం. 123

తా॥ గృహస్థు త్రిసంధ్యాకాలములయందును జలసహితమైనభస్మమును ధరించవలసినది. యతులు త్రికాలములయందు జలరహితమైనభస్మమును ధరించవలయును.

శ్లో॥ ఊర్ధ్వపుండ్రం త్రిపుండ్రం చ । త్రిపుండ్రం నూర్ధ్వపుండ్రకం
మృదా కార్యం భస్మనా తు । ఏకం పుండ్రం న కారయేత్

ఇతి సనాతన ధర్మసంహితాయాం బ్రాహ్మణమహిమానువర్ణనం నామనవదశోఽధ్యాయః.

తా॥ మృత్తికచే ఏకోర్ధ్వపుండ్రమున్ను, భస్మముచే తిర్యక్ త్రిపుండ్రమున్ను, ధరించవలసినదిగాని మృత్తికచే నూర్ధ్వపుండ్రత్రయమున్ను, భస్మముచే ఏకతిర్యక్ పుండ్రమున్ను, పెట్టకూడదు.

ఇది సనాతనధర్మసంహితయందలి నవదశోఽధ్యాయ
తాత్పర్యసంగ్రహము.

## అథవింశోఽధ్యాయః.

॥౦॥

## ఆశౌచనిర్ణయః.

దేవాః.

శ్లో॥ సనాతనబ్రహ్మఋషే! । సర్వాగమవిశారద!
సర్వేషాం చైవ వర్ణానా । మాశౌచస్య విధిం వద. 1

తా॥ ఓ సనాతనబ్రహ్మఋషీ! సర్వవర్ణములకు ఆశౌచవిధిని చెప్పుమని దేవతలు కోరిరి.

బ్రహస్పతిః.

శ్లో॥ వక్ష్యామి వో మహాదేవా! । ఆశౌచానాం విధానతః
సర్వేషాం చైవ వర్ణానాం । శృణ్వంతు శ్రద్ధయా విధిం. 2

తా॥ ఓ దేవతలారా! సర్వవర్ణములకు ఆశౌచవిధిని చెప్పు చున్నానువినుండని చెప్పదొడంగె.

శ్లో॥ జాతకం మృతకం చేతి । ద్విధాఽశౌచ ముదీరితం
అల్పాధికవిభేదేన । పూర్ణాఽపూర్ణవిభేదతః. 3

తా॥ సర్వవర్ణములకు ఆశౌచము జాతకము, మృతకము అనిరెండువిధములు. అది అల్పము,అధికము,పూర్ణము, అపూర్ణము అని నాలుగువిధములు.

శ్లో॥ స్రావః పాతః ప్రసూతిశ్చ । త్రివిధం జాతకం మతం
అల్పాధికే సమాఖ్యాతే । తత్రాఽల్పాఽధికకాలకే. 4

తా॥ జాతము. స్రావము, పాతము, ప్రసూతి యని మూడు విధములు. అది కాలమునుబట్టి అల్పము. అధికము నగును.

శ్లో॥ ద్వ్యాహాద్ద్వాదశాహోర్ధ్వం । మాసామాసానువర్తి యత్
తద్వర్ణానాం క్రమాత్పూర్ణ । మపూర్ణ మితరత్పునః. 5
శుద్ధే ద్బ్రాహ్మణో దశాహేన । ద్వాదశాహేన క్షత్రియః
వైశ్య త్రయోదశాహేన । శూద్రశ్శుద్ధశ్చతుర్దశైః. 6
స్వధర్మనిరతానాం తు । శ్రేష్ఠవర్ణానుజీవినాం
మాస మాశౌచ మిత్యుక్త । మంత్యజానాంబుద్ధైఃక్రమాత్.

తా॥ బ్రహ్మ క్షత్రియ, వైశ్య, శూద్ర, ఛండాలులకు క్రమముగా 10, 12, 13, 14, రోజులు పూర్ణాశౌచము.

శ్లో॥ దశాహం బ్రాహ్మణ స్సృష్టే । స్నాన హోమాదివర్జితః
క్షత్రియో ద్వాదశాహం తు । వైశ్య త్రయోదశేన చ. 7

శూద్రాశ్చతుర్దశానీత । నిజకర్మవివర్జితః
శావాశౌచం ప్రకుర్వంతి । మాసేన వర్ణసంకరాః. 8

తా॥ యీదినములయందు సర్వవర్ణస్థులు నిత్యకర్మలను చేయరాదు. సంకరులు ముప్పదిరోజులు మృతాశౌచమును పట్టవలయును.

శ్లో॥ సర్వేషా మనులోమానా । మాశౌచం మాతృవద్భవేత్
పైతృకం ప్రతిలోమానా । మాశౌచం సద్భి రిష్యతే. 9
శూద్రాజ్జప్రతిలోమానా । మాశౌచం నాస్తి కించన
మాంసం శూద్రస్య శేషాణాం । సదా శౌచ మితి స్మృతిః.

తా॥ అనులోమవిలోమజాతులకు తలిదండ్రులవలెనే ఆశౌచముపట్టవలయును. నాలుగు మాసములవరకు గర్భస్రావము, తరువాత రెండుమాసములవరకు పాతము, తదనంతరము ప్రసూతి.

స్రావాద్యశౌచవిషయః.

శ్లో॥ తథాఽపి మరణే తేషాం । స్నానమాత్రం విధీయతే
గర్భస్య నిర్గమ స్స్రావ । అద్యే మాసచతుష్టయే. 11
తతో మాసద్వయే పాతః । ప్రసూతి స్స్యా త్తతఃపరం
ఆచతుర్థా భవే త్స్రావః । పాతః పంచమషష్ఠయోః. 12
అత ఊర్ధ్వం ప్రసూతిస్స్యా । ద్దశాహం సూతకం భవేత్
మాసత్రయే చతుర్థే చ । గర్భస్య స్రావ ఇష్యతే. 13
పాత స్స్యాత్పంచమే షష్ఠే । ప్రసూతి స్సప్తమాదిషు
స్రావే మాతు స్త్రిరాత్రం స్యా । న్నాశేషుత్రిషు సూతకం.
చతుర్థే తు చతూరాత్రం । పితా స్నానేన శుద్ధ్యతి
చతుర్థకంపత్ర్య-శిన । స్స్రావేత్రిదివసంపితుః. 15

తా॥ స్రావమందు తల్లికి,3,రోజులుఆశౌచము, 4, నెలలకు 4, రోజులుండవలయును, తండ్రికిస్నానమాత్రమునచే శుద్ధి, 4, మా

సములయందలికఠిన స్రావమునకుతండ్రికి 3 రాత్రులు జాతాశౌచము.

శ్లో॥ మృదుస్రావే తు సర్వేషాం । చతుర్థే స్నాన మాంత్రికం
త్రిషు మాసేషు గర్భస్య । స్రావే మాతు స్త్రిరాత్రికమ్.
స్రావే మాతు స్త్రిరాత్రంస్యా । త్సపిండాశౌచవర్జనం
పాతే మాతు ర్యథామాసం । పిత్రాదీనాం దినత్రయం. 17

తా॥ ఏనెలయందు గర్భపాతమగునో తల్లి అన్నిదినములుండవలయును. తండ్రిమొదలగువారికి 3, రోజులున్ను, యితరజ్ఞాతులు స్నానముమాత్రము చేయవలయును.

శ్లో॥ స్రావే చైవ పితు స్స్నానం । సపిండానాం విధీయతే
రజోదర్శనవ న్మాతుః । పతనే మాససంఖ్యయా. 18
షణ్మాసాభ్యంతరే యావ । ద్గర్భస్రావో భవేద్యది
తదామాసస్తమై స్త్రాసాం । దివసై శ్శుద్ధిరిష్యతే. 19
సద్యశ్శౌచం సపిండానాం । గర్భస్య పతనే సతి
త్రిరాత్రం స్రావ మాశౌచం । మాతురేవ విధీయతే. 20
స్రావే సద్యః పితు స్స్నానం । సపిండానాం నవిద్యతే.
మాససంఖ్యాదినం మాతుః । పాతేఽన్యేషాం దినత్రియం.21

తా॥ స్రావమందు తల్లికి 3, దినములుఆశౌచము, తండ్రికిస్నామాత్రమున శుద్ధి. జ్ఞాతులకు నేమియు పనిలేదు.

ప్రసవాఽశౌచవిషయః.

శ్లో॥ ప్రసూతౌ తు సపిండానాం । పూర్ణాశౌచ ముదీరితం
ఏకోదరాణాం త్రిదినం । సగోత్రాణాం న కించిన. 22

తా॥ ప్రసూతియందు జ్ఞాతులకుపూర్ణమైనజాతాశౌచము. సగోత్రులకు లేదు.

శ్లో॥ స్త్రీపుంసప్రసవే మాతు । రాత్రసవింశత్యహా క్రమాత్
అస్పృశ్యత్వం తు నైవాస్తి । సూతకే సూతికాం వినా.
శావాశౌచే తు సర్వేషా । మస్పృశ్యత్వం సదా భవేత్
సూతకీ మృతకీ చైవ । నస్పృశేతాం పరస్పరమ్. 24

తా॥ జాతాశౌచమునందు తల్లిని 20 రోజులవరకు తాక రాదు. ఇతరులను ముట్టితే దోషములేదు.

శ్లో॥ జనకస్యైకోదకానాం తు । త్రిరాత్రాచ్ఛుద్ధిరిష్యతే
పతితంసూతికామంత్యం । శవం స్పృష్ట్వా చ కాముతః. 25
స్నాత్వాసచేలం స్పృష్ట్వాఽగ్నిం । ఘృతంప్రాశ్యవిశుద్ధ్యతి.

తా॥ మృతకమందెవరిని ముట్టరాదు. ఇద్దరు వేరొకఆశౌచముగలవారు జాతకమందుగాని మృతకమందుగాని పరస్పరము తాకరాదు.అట్లుతాకిన కట్టువస్త్రములతో స్నానముచేసి నేయిని ప్రాశన చేయవలయును.

శ్లో॥ సూతికే సూతికా వర్జం । సంస్పర్శో న నిషిద్ధ్యతే. 26
సంస్పర్శే సూతికాయా స్తు । స్నానమేవ విధీయతే

తా॥ పురుడువచ్చినప్పుడు సూతికను తాకరాదు. ఇతరులను తాకవచ్చును. బాలింతను తాకితే స్నానముచేయవలయును.

శ్లో॥ సూతికా సర్వవర్ణానాం । దశరాత్రేణ శుద్ధ్యతి. 27
ఋతౌ చ న పృథ క్ఛౌచం । సర్వవర్ణేష్వయం విధిః

తా॥ సర్వవర్ణస్థులకు బాలింత 10రాత్రులకు శుద్ధియగును.

శ్లో॥ అజ గావో మహిష్య శ్చ । బ్రాహ్మణ్యా శ్చ ప్రసూతికాః.
దశరాత్రేణ శుద్ధ్యంతి । భూమిష్ఠం చ నవోదకం
బ్రాహ్మణానాం ప్రసూతౌ తు । దేహస్పర్శో విధీయతే.
సూతకే సూతికా వర్జం । సంస్పర్శో న నిషిద్ధ్యతే
సూతకే తు సపిండానా । మంగస్పర్శో న దూష్యతే. 30

తా॥ మృతాశౌచముకలవారికి తాకరాదు. తెలిసిముట్టితే సాంతపనము చేయువలయును. తెలియకముట్టితే తదర్ధము చేయవలయును.

శ్లో॥ అపుత్రాణాం తథా స్త్రీణాం । సాపిండ్యం పంచ పూరుషం
సమానోదకభావ స్తు । వర్తతే దశపూరుషం. 37
జన్మనామ్నస్మృతే రేకే । తత్పరం గోత్రముచ్యతే.
తా॥ జ్ఞాతులకు 5 పురుషులవరకు సాపిండులు. తరువాత 5 పురుషులవరకు సమానోదకులు. తరువాత సగోత్రులు.

శ్లో॥ సపిండతా తు పురుషే । పంచమే వినివర్తతే. 38
సమానోదకభాజ స్తు । జన్మనామ్నో రవేదన
సమానోదకభావస్య । నివృత్తిస్యాచ వేదనే. 39
జన్మనామ్నో రన్యతరా । విజ్ఞానేఽపి నివర్తతే
తా॥ సాపిండ్యులు 10 రోజులున్నూ, సమానోదకులు 3 రోజులున్నూ, ఆశౌచము పట్టవలయును.

శ్లో॥ గ్రంథార్థతో విజానాతి । వేద మంగై స్సమన్వితం. 40
సంకల్పం సరహస్యం చ । క్రియావాం శ్చే న్న సూతకం
ఏకాహా చ్ఛుధ్యతే బ్రాహ్మ్యా । యోఽగ్ని వేదసమన్వితః. 41
తా॥ వేదవేదాంతవేత్తయై వ్రతస్థుండైన బ్రాహ్మణుడు 1 రోజునచే శుద్ధుడగును.

శ్లో॥ బ్రాహ్మణస్య క్రియాహీనం । మహారోగిణ ఏవ చ
యథేష్టాచరణం ప్రాహు । ర్మరణాంత మశౌచకం. 42
తా॥ బ్రాహ్మణకర్మహీనుడు, రోగి, యథేచ్ఛసంచారి. వీరలెల్లప్పుడు ఆశౌచులనబడుదురు.

శ్లో॥ వ్యాధితస్య కదర్యస్య । ఋణగ్రస్తస్య సర్వదా
క్రియాహీనస్య మూర్ఖస్య । స్త్రీజితస్య విశేషతః. 43

శ్లో॥ స్నానం పితు రవికార్యంతే। జ్ఞాతినాం తు న కించన
నిదర్శం జ్ఞాతిమరణం। శ్రుత్వా పుత్రస్య జన్మచ. 58
సవాసా జల మాప్లుత్య। శుద్ధో భవతి మానవః

తా॥ పురుడు వెళ్ళినతరువాత జ్ఞాతులకు స్నాన మక్కర లేదు. తండ్రి పుత్రునిజననముగాని జ్ఞాతిమరణముగాని వినినచో వస్త్రములతోసహా స్నానముచేయవలయును.

శ్లో॥ అచ్ఛిన్ననాభే ర్మరణే। జనన్యాః పూర్ణసూతకం. 59
పిత్రాదీనాం సపిండానాం। త్రిరాత్రం ఋషిభిస్స్మృతం
ఛిన్ననాభి ర్యది మృతో। మృతో వా జాతతే యది. 60
పూర్ణాశౌచం జనన్యా శ్చ। పిత్రాదీనాం చ నిశ్చితః
జీవన్ భూతో యది తతో। మృత స్సూతక ఏవ తు. 61
సూతకం సకలం మాతుః। పిత్రాదీనాం త్రిరాత్రికం
గర్భే యది విపత్తి స్యా। ద్దశాహం సూతకం భవేత్. 62

తా॥ పుత్రజన్మగాని, జ్ఞాతిమరణముగాని విని, వస్త్రములతోకూడ స్నానము చేయవలయును. బొడ్డుకోయ్యక మునుపు శిశువు మృతిజెందినయెడల తల్లి 10 రోజులున్ను, జ్ఞాతులు మూడురోజులున్ను పురుడు పట్టవలెను. బొడ్డుకోసినతరువాత మృతిబొందిన శిశువునకున్ను చచ్చిపుట్టినశిశువునకున్ను, తల్లి,తండ్రి,జ్ఞాతులు 10రోజులు పురుడు పట్టవలయును. 10 రోజులలోపల శిశువు పోయినను పురుడే పట్టవలయును.

శ్లో॥ స్వగృహే పుత్రికాసూతి। ర్భవే త్తాతస్య జాతకం
త్రిరాత్రం చ తు తద్భ్రాతుః। పుత్రజన్మని విశ్రుతం. 63
స్త్రీజన్మచే త్తదర్థం స్యా। దిత్యాఽహ భగవాన్ మనుః

తా॥ స్వగృహమునందు కుమార్తె ప్రసవించినయెడల తండ్రికిని, శిశువుమేనమామలకున్ను 3 రోజులు పురుడు. ఆడపిల్లనైతే సగము.

శ్లో॥ బాలే దేశాంతరం నేచ । పతితే చ యతౌ మృతే. 64
సద్యశ్శౌచంయథాజ్ఞాతం । జాలాగ్న్యర్బంధనాదిషు
సద్యశ్శౌచే తు తావ త్స్యా । దాశౌచం సంస్థితస్య తు.
యావ త్స్నానం న కుర్వంతి । సచేలం బాంధవా బహిః.

తా॥ బాలుడు మృతిపొందినను దేశాంతరగతుడయినను, యతియయినను, పతితుడయినను, ఉరి, జలము, అగ్ని వీనియందు దుర్మరణము జెందిననుసచేలముగా సద్యస్స్నానముచే శుద్ధియగును.

శ్లో॥ ఋత్విజానాం దీక్షితానాం । యజ్ఞీయం కర్మ కుర్వతాం.
సత్రివ్రతి బ్రహ్మచారి । ధాతృ బ్రహ్మవిదాం తథా
దానే వివాహే యజ్ఞేచ । సంగ్రామే దేశవిప్లవే. 67
ఏతే సర్వేషు కార్యేషు । సద్య శ్శౌచం విధీయతే

తా॥ ఋత్విక్కులకు, దీక్షితులకు, యజ్ఞముచేయువారికి, సత్రివ్రతస్థుడు, బ్రహ్మచారి బ్రహ్మవేత్తలు దానము యజ్ఞము వివాహము యుద్ధము దేశవిప్లవములయందు వీర్లకు నీకార్యముల యందు సద్యశ్శుద్ధియగును.

(దశాహోర్ధ్వశిశుమరణాశౌచానుపనీతాఽశౌచనిర్ణయః.)

శ్లో॥ అర్వాగుపనయనాత్పితో । ర్భ్రాతౄణాం చ దినత్రయం.
అర్వాగ్దంతోద్గమా చ్చౌలా। త్తథాపనయనాత్క్రమాత్
సద్యో దినంత్రిరాత్రం చ । సపిండానాం ప్రకీర్తితం. 69

తా॥ ఉపనయనాత్పూర్వము మృతిజెందిన, తల్లి, తండ్రి, తమ్ములకు 3 రోజులు ఆశౌచము. పండ్లురాకమునుపు జ్ఞాతులకు సద్యస్నానము.చూడాకరణ పర్యంతమున్ను ఏకదినంఉపనయనము వరకు 3 రోజులు ఆశౌచము.

శ్లో॥ క్షత్రే షడ్భిః కృతే శావే । వైశ్యే నవభి రుచ్యతే
ఊర్ధ్వం త్రివర్షా చ్ఛూద్రే । తు ద్వాదశాహో విధీయతే.70

తా॥ చౌలముచేసిన శిశువు మృతిబొందినప్పుడు క్షత్రియులు 6 రోజులు వైశ్యులు 9 రోజులు శూద్రులు 12 రోజులకు శుద్ధులగుదురు.

శ్లో॥ అవిశేషేణ వర్ణానా । మర్వాక్సంస్థాపకర్మణః
త్రిరాత్రాత్తు భవే చ్ఛుద్ధి । స్తస్యాప్యహ్నో విధియతే. 71

తా॥ సర్వవర్ణస్థులకున్ను, అసగోత్రసంస్థాపనము చేసినప్పుడు 3 రోజులు ఆశౌచము పట్టవలయును.

శ్లో॥ అశౌచ మసపిండేషు । ప్రోషితే శ్రోత్రియే గురౌ
అతీతే నృపతౌ తద్వ । దృతుకాలే చ యోషితాం. 72

తా॥ సపిండులుకానివారికి, శ్రోత్రియులకున్ను, గురువునకున్ను, రాజునకున్ను, 3 రోజులు ఆశౌచము పట్టవలయును. స్త్రీలకు ఋతుకాలమందున్ను 3 రోజులకు శుద్ధి.

శ్లో॥ బ్రాహ్మణస్యోపనీతో హి । తత్క్రియం క్షత్రవైశ్యయోః
శూద్రో వివాహపర్యంత । మాశౌచం త్రిదినం విధిః. 73
మ్రియతే యత్ర తత్ర స్యా । దాశౌచం త్ర్యహమేవ తు

తా॥ బ్రాహ్మక్షత్రియవైశ్యులకు ఉపనయనపర్యంతమున్ను శూద్రులకు వివాహపర్యంతమున్ను 3 రోజులు ఆశౌచము. తరువాత యథావిధి ఆశౌచము పట్టవలయును.

శ్లో॥ అనూఢభార్య శ్శూద్రస్తు । షోడశాద్వత్సరాత్పరం. 74
మృత్యుం సమధిగచ్ఛేచ్చే । న్మాసా త్తస్యాఽపి బాంధవాః

తా॥ 16 సంవత్సరములు గలిగినవాడై వివాహము చేసుకొననిశూద్రుడు మృతిబొందినచో యథావిధిగా ఆశౌచముపట్టవలయును.

(కన్యామరణాశౌచః.)

శ్లో॥ అనూఢానాంతుకన్యానాంమృతౌ పిత్రోర్భ్రాతౄణాం చ దినత్రయం.
దిన మూఢాంతకనాం । ఇతి ధర్మవిదో విదుః

తా॥ వివాహముకాని కన్య మృతిచెందితే తల్లి,తండ్రిఅన్న దమ్ములు 3 రోజులు ఆశౌచము పట్టవలయును.

శ్లో॥ జ్ఞాతీనాం స్నాన మాచౌలా । దావాగ్దానా త్త్ర్యహం భవేత్ .76
వాగ్దానే తు త్రిరాత్రం స్యా । త్పితృభర్తృకులస్యచ

తా॥ జ్ఞాతులకు చౌలముకట్టంతము స్నానమాత్రమునశుద్ధి.వాగ్దానముచేసినయెడల భర్తృపితృవంశస్థులకు 3 రోజులు ఆశౌ

శ్లో॥ అనూఢానాం నే న్నిజః పత్యే । దశాహాంతస్మృతౌ భవేత్ .77
వివాహముకానిదై రజస్వలైనచో 10 రోజులుప
ట్టుది.

శ్లో॥ పిత్రోరుపరమే స్త్రీణాం । మాశౌచంతు కథం భవేత్
త్రిరాత్రేణ విశుద్ధి స్స్యా । దిత్యాహ భగవాన్ మనుః.78

తా॥ తల్లిదండ్రులు మృతిబొందినప్పుడు స్త్రీలు 3రోజులు ఆశౌచము పట్టవలయునని మనువు వచించెను.

శ్లో॥ పరిత్తాఽపత్యాసుయోషిత్సు సంస్కృతాఽసంస్కృతాసుచ
మాతాపిత్రో స్త్రిరాత్రం స్యా । దితరేషాం యథావిధి. 79

తా॥ వివాహమైనకన్య మృతిబొందిన తల్లిదండ్రులు 3రోజు లుండవలయును.

శ్లో॥ అజన్మప్రస్తు బాలాంతా । కన్యా యత్ర విపద్యతే
సద్య శ్శౌచం భవే త్తత్ర । సర్వవర్ణేషు నిత్యశః. 80

తా॥ పండ్లురానికన్య మృతిమైనచో అన్నివర్ణములకు సద్యస్నానముచేశుద్ధి.

(ఉపనీతమృతాఽశౌచవిషయః.)

శ్లో॥ ఉపనీతమృతే ప్రాజ్ఞం। సర్వేషాం మృతకం భవేత్
సోదకానాం త్రిదినం। సగోత్రాణాం తు మజ్జనం. 81
స్త్రీణా ముపనయస్థానే। వివాహః పరికీర్తితః
దశాహం తాన మాశౌచం। సపిండేషు విపశ్చితః. 82
దశాహేన సపిండాస్తు। శుధ్యంతి మృతసూతకే
త్రిరాత్రేణ సకుల్యాస్తు। స్నాత్వా శుధ్యంతి గోత్రజాః. 83

తా॥ ఉపనీతుడు మృతుడైతే జ్ఞాతులకు 10 రోజులు 10తరముల పర్యంతము 3 రోజులు తర్వాత స్నానము. వివాహమైన కన్యకు నీప్రకారమే ఆశౌచము వచ్చేది,

శ్లో॥ పరాశితేషు దారేషు। పరనారీసుతేషు చ
గోత్రిణః స్నానశుద్ధాస్తు। త్రిరాత్రేణైవ తత్పితా. 84
అనాశ్రితేషు పుత్రేషు। భార్యాస్వన్యగతాసు చ
పరపూర్వాసు చ స్త్రీషు। త్రిరాత్రాచ్ఛుద్ధి రిష్యతే. 85

తా॥ పరదారయందు తనకు కుమారుడు గలిగినను తన భార్యయందు ఇతరులకు సంతానము గలిగినను ఆ గుంతిండ్రలకు త్రిరాత్రము జ్ఞాతులకు స్నానముచే శుద్ధి. వీరలకు మరణమందిదే ప్రకారము.

శ్లో॥ మాత్రైకయా ద్విపితృకౌ। భ్రాతరా వన్యగోచరా
ఏకాహం సూతకం తత్ర। త్రిరాత్రం మృతకే తయోః 86
గృహే యస్య మృతః కశ్చి। దసపిండః కథంచన
తత్రాశౌచం తు విజ్ఞేయ। త్రిరాత్రం నాత్ర సంశయ. 87

తా॥ ఒకతల్లికి యిద్దరుతండ్రులవల్ల గలిగిన అన్నదమ్ములకు జాతము 1దినము. మృతము 3 రోజులు. యెవనియొక్క గృహమందు అసపిండుడు మృతుడగునో వానికి 3 రోజులు ఆశౌచము.

తా॥ చెల్లెలుసూతకము అన్నకేగాని అన్నభార్యకులేదు. అన్నసూతకము చెల్లెలికేగాని భాగకులేదు. అన్యగోత్రుల యొక్క ఆశౌచము ఆ మాబంధువులకేగాని వారిభార్యలకు నితరులకు లేదు. తండ్రితోబుట్టుకొడుకులు తల్లి, అక్క, చెల్లెలుకొడుకులు మేనమామకొడుకులు ఆత్మబంధువులు.

శ్లో॥ పితుః పితృష్వసుః పుత్రాః । పితుః మాతృష్వసుస్సుతాః.
పితుర్మాతులపుత్రాశ్చ । విజ్ఞేయాః పితృబాంధవాః
మాతుః పితృష్వసుః పుత్రాః । మాతుర్మాతృష్వసుస్సుతాః
మాతుర్మాతులపుత్రాశ్చ । విజ్ఞేయా మాతృబాంధవాః

తా॥ తండ్రికి బంధుత్వముగలవారు తండ్రిబంధువులు. తల్లికి బంధుత్వముగలవారు తల్లిబంధువులు.

శ్లో॥ శ్వశురయో ర్భగిన్యాం చ । మాతులాన్యాం చ మాతులే.
పితృష్వసరి తద్వచ్చ । పక్షిణీం క్షపయేన్నరః.

తా॥ శ్వశురులు తోబుట్టువు మేనమామ, వానిభార్య తల్లితోబుట్టువు వీరికి పక్షిణీఆశౌచముపట్టవలయును.

శ్లో॥ మాతులే శ్వశురే మిత్రే । గురౌ గుర్వంగనాసు చ. 94
ఆశౌచం పక్షిణీం రాత్రిం । మృతా మాతా మహీ యది.

తా॥ మేనమామ, శ్వశురుడు, మిత్రుడు, గురువు, ఈయన భార్య మాతామహి, వీరలకు పక్షిణీఆశౌచము.

శ్లో॥ నిషేకాదీని కర్మాణి । యః కరోతి యథావిధి. 95
సంభావయతి చాన్నేన । బ్రాహ్మణో గురు రుచ్యతే.

తా॥ అన్నముపెట్టి విద్యచెప్పినవారున్ను, సర్వకర్మలు తనకు చేయించినవారున్నూ గురువులు.

శ్లో॥ ఏకదేశం తు వేదస్య । వేదాంగాన్యథవా పునః. 96
యోఽధ్యాపయతి వృత్త్యర్థ । ముపాధ్యాయ స్స ఉచ్యతే

తా॥ వేదములోనొకభాగముగాని వేదాంగముగాని చెప్పినవారు ఉపాధ్యాయులు.

శ్లో॥ భిన్నమాతృష్వసుస్స్నిగ్ధ । పితృష్వసురపి స్వస్రీయం. 97
దత్తస్య భ్రాతృజననే । పారగే హ్యన్యగోత్రిణాం
స్నానమాత్రం సచేలం స్యా । న్నాశౌచం విద్యతే క్వచిత్

తా॥ అన్యగోత్రిదత్తుడు మృతుడైతే పూర్వగోత్రులకు స్నానమాత్రముననే శుద్ధి.

శ్లో॥ యా సపత్నీసుతా మాతా । సపత్నీ యా చ తే మిథః
అహోరాత్రేణ శుధ్యేత । స్నానవత్సో ఋషి రబ్రవీత్. 99

తా॥ సవితితల్లికుమారునికి సవితితల్లి అన్నయు 1 రోజు ఉండవలెనని వైవత్సఋషి పలికెను.

(అథ సజాత్యతిరాశౌచము.)

శ్లో॥ గ్రామేశ్వరే కులపతౌ । శ్రోత్రియే చ తపస్విని
శిష్యే పంచత్వమాపన్నే । శుచి ర్నక్షత్రదర్శనాత్. 100

తా॥ గ్రామాధికారి కులాధికారి శ్రోత్రియుడు తపస్వి శిష్యుడు వీరలమృతికి నక్షత్రదర్శనపర్యంత మాశౌచము.

శ్లో॥ గ్రామేశ్వరే దూరాంతే । పితృమాత్రాత్మబంధుషు
మిత్రే జామాతరి శ్రీశే । స్యాలకే మాతులే తథా. 101
చరే దేకాహ మాశౌచం । విదేశే స్నాన మాచరేత్

తా॥ తల్లిదండ్రియొక్కయు తనయొక్కయు బంధువుడు మిత్రుడు అల్లుడు భార్యతమ్ముడు మేనమామ శ్వశురుడు అత్త వీరలు స్వగృహమందు మృతిజెందితే 3 రోజులున్ను గ్రామమందైతే 1 రోజు అన్యగ్రామందు స్నానమాత్రముననే శుద్ధి.

శ్లో॥ జామాతా శ్వశుర శ్శ్వశ్రూ । మ్రియతే స్వగృహే యది.
ఆశౌచం త్రిదినం తత్ర । పరవేశ్మని పక్షిణ్

భగిన్యాం సంస్థితాయాం తు । భ్రాతర్యస్య పి చ సంస్థితే. 105
మిత్రే జామాతరి ప్రేతే । దౌహిత్రే భగినీసుతే
శ్యాలకే తత్సుతే చైవ । సద్యస్స్నానేన శుద్ధ్యతి. 104
భగిన్యస్వస్త్రః పిత్రోః । భ్రాతౄణామపి చ తత్సుతాః
ప్రియంతే చ స్వకన్యాశ్చ । స్నానం తేషాం తథోచ్యతే.

తా॥ తోబుట్టు తల్లిదండ్రులు, మాతామహులు వీరికుమాళ్లు వీరలకు వివాహమైనకన్య స్నానముచేయవలయును.

(అతిక్రాంతాశౌచనిర్ణయః.)

శ్లో॥ అత్రి మాసాత్త్రిరాత్రం స్యాత్ । షణ్మాసాత్పక్షిణీ తథా
పరమేకాహమావర్షాత్ । ఊర్ధ్వం స్నానేన శుద్ధ్యతి. 106
మాసత్రయే త్రిరాత్రం స్యాత్ । షణ్మాసాత్పక్షిణీ భవేత్
అహస్తు నవమాదర్వాక్ । ఊర్ధ్వం స్నానేన శుద్ధ్యతి. 107

తా॥ జ్ఞాతులకు మూడుమాసములకు 3 రోజులు. 6 మాసములవరకు పక్షిణి. తరువాత 1దినము. అనంతరము స్నానమాత్రమున శుద్ధి.

శ్లో॥ పితరౌ చేన్మృతౌ స్యాతాం । దూరస్థోఽపి హి పుత్రకః
శ్రుత్వా తద్దిన మారభ్య । దశాహం సూతకీ భవేత్. 108
యత్ర క్వచిత్ స్థితః పుత్రః । శ్రుత్వా పిత్రోర్విపర్యయం
జ్ఞాత్వా తద్దిన మారభ్య । దశాహం సూతకీ భవేత్. 109

తా॥ దూరదేశమందు మృతులైన తల్లిదండ్రులకు కాలమతిక్రమించిన మొదల కుమారుడు వినినది మొదలు 10 రోజులు ఆశౌచముపట్టి క్రియలు యథావిధిగా చేయవలయును.

శ్లో॥ అర్వాగ్వింశతివర్షాత్తు । మాతాపిత్రోర్మృతిం శ్రుత్వా
కృతక్రియోఽపి పుత్రాణాం । దశాహం సూతకం భవేత్.

ఊర్ధ్వం వింశతివర్షాత్తు । మాతాపిత్రో ర్మృతిర్యది
క్రియాక్రమే త్రిరాత్రం స్యా । ద్దశాహ మకృతక్రియః. 111
పిగతం తు విదేశస్థ । శ్శృణుయా ద్యోహ్యనిర్దశం
యచ్ఛేషం దశరాత్రస్య । తావదే వాఽశుచి ర్భవేత్. 112
దేశాంతరగతం శ్రుత్వా । కల్యాణం మరణం తథా
యచ్ఛేషం దశరాత్రస్య । తావదే వాఽశుచి ర్భవేత్. 113

తా॥ 20 సంవత్సరములలోపల విన్నయెడల తల్లికి తండ్రికి క్రియాలు జరిగియున్నను సరే 10 రోజులు ఆశౌచము పట్టవలయును. 20 సంవత్సరములకు మించితే క్రియలు జరిగియున్నయెడల 3 రోజులు. లేనియెడల 10 రోజులు ఆశౌచము.

శ్లో॥ పిత్రో ర్దశదినా దూర్ధ్వం । మరణం చ శ్రుతం యదా
శ్రుతో యది చేత్స్నానాత్పక్షిణ్యాశౌచ మిష్యతే. 114

తా॥ పదిరోజులు వెళ్ళినతరువాత తల్లిదండ్రులమృతిని వివాహమయినకన్య వినవలెనే పక్షిణి ఆశౌచం పట్టవలయును.

శ్లో॥ మరణం శ్రూయతే భ్రాతు । ర్దశాహా త్పరతో యది
దిన మేకం స్వసుః ప్రోక్తం । స్నానం స్యాద్భగినీపతేః. 115

తా॥ అన్నదమ్ములన్నను తోబుట్టువు 10 రోజులతరువాత విన్నయెడల 1 రోజు ఆశౌచము పట్టవలయును. ఆమెభర్తకు స్నానముచే శుద్ధి.

శ్లో॥ దశాహా త్పరతో భ్రాతా । మరణం శ్రూయతే స్వసుః
తస్యైకదిన మాశౌచం । తత్పత్న్యా స్నాన ముచ్యతే. 116

తా॥ తోబుట్టుమరణము 10 రోజులతరువాత విన్నయెడల అన్న 1 రోజు ఉండవలయును. ఆయనభార్యకు స్నానముచే శుద్ధి.

శ్లో॥ దశాహా త్పరతః కన్యా । మరణం శ్రూయతే యది
ఆశౌచం తద్దినం పిత్రో । ర్భ్రాతృస్సా శుచి నిశ్చయః. 117

తా॥ 10 రోజులతర్వాత కన్యమృతి వినిన తల్లిదండ్రులకు 1 దినము. ఇతరులకు లేదు.

శ్లో॥ పుత్రస్యాపనయా దూర్ధ్వం । మరణం శ్రూయతే యది
దశాహాత్పరతో యావ । దబ్దం స్యాత్త్రిదినం తథా. 118

తా॥ పదిరోజులతరువాత పుత్రమరణము వింటే సంవత్సరమువరకు 3 రోజులుండవలయును.

శ్లో॥ సాపత్న్యమాతృమరణం । దశాహాచ్చేద్బహి శ్శ్రుతం
పరిదద్యాత్తు స కర్తవ్య । స్త్రిదినం చాఽనపత్నికే. 119
పితృపత్న్యామతీతాయాం । మాతృతాయాం తు స్త్రీ యది
సంవత్సరే వ్యతీతేఽపి । త్రిరాత్ర మశుచి ర్భవేత్. 120

తా॥ సవతితల్లి మరణము 10 రోజులుతరువాత విన్నమొదల సంవత్సరమువరకు 3 రోజులు. తరువాత సచేలి. ఈమెకు సంతు లేకపోతే 3 రోజులు మొదటికి ఉండవలయును.

శ్లో॥ ప్రోషితభ్రాతృమరణే । దశాహాదవరక్రమే
త్రిరాత్రం సూతకం తత్ర । దశాహం పుత్రభార్యయోః.

తా॥ 10 రోజులుతరువాత అన్నలకు 3 రోజులున్న భార్యయు పుత్రులున్న 10 రోజులుండవలయును.

శ్లో॥ మహానద్యంతరం యత్ర । గిరిర్వా వ్యవధాయకః
వాచో యత్ర విభిద్యంతే । తద్దేశాంతర ముచ్యతే. 122

తా॥ మహానది, పర్వతము, అడ్డముగల దేశము భాషాభేదముగల దేశమున్ను అన్యదేశములు.

శ్లో॥ దశాహాంతం మృతే బాలే । పిత్రో ర్భ్రాతుశ్చ తత్ర తు
తచ్ఛేషేణైవ శావస్య । నివృత్తి రభిధీయతే. 123
పూర్వాశౌచే రాత్రిశేషే । పూర్వాశౌచాంతరం విశేత్
పూర్వార్ధ్వాహ్నం ద్విరాత్రం స్యా । ద్యామశేషే త్రిరాత్రకం

తా॥ విదేశమందు జ్ఞాతిమృతినైతే 10 రోజులలోపల మిగిలిన రోజులుండవలయును. తరువాత స్నానముచేయవలెను.

శ్లో॥ శావం మృతస్య పుత్రాణాం । స్థాపకస్య చ నాన్యపః
నివర్తతే తథాఽన్యస్య । పిత్రోర్న్యాస్తైరి సూతకం. 125

శ్లో॥ పిత్రోర్నాశౌచ మాఖ్యాత । మన్యాశౌచస్య బాధకం
పితురాశౌచమధ్యే తు । మాతా యది మృతా భవేత్.

తా॥ తండ్రిఆశౌచమధ్యమందు మాతృమృతినైతే తండ్రిఆశౌచముతర్వాత తల్లికి పక్షిణీపట్టవలయును.

శ్లో॥ పితాశౌచం సమాసాద్య । మాతాశౌచం తు పక్షిణీ
పతివ్రతా తు యా నారీ । భర్తార మనుగచ్ఛతి. 127

తా॥ పతివ్రతమాహాత్మ్యముచే భర్తతో మృతిచెందిన పక్షిణీపట్టవలయును

శ్లో॥ దినాంతరే మృతావాఽపి । పక్షిణీ న భవేత్తదా
మాతు రాశౌచమధ్యే తు । పితా యది మృతో భవేత్.

తా॥ తల్లిఆశౌచమధ్యను తండ్రిమృతిజెందితే తండ్రిమృతి మొదలుగాగృహులకు 10 రోజులు.

శ్లో॥ మాతాపిత్రోస్తు మరణే । తనయైర్యుగప చ్చ్రుతే
న పూర్వపగదాశౌచం । కుర్యాదితి వినిశ్చయః. 129

జననే జననం చేత్స్యా । న్మరణే మరణం తథా
పూర్వశేషే నివృత్తిస్స్యా । దుత్తరాశౌచవర్జనం. 130

తా॥ తల్లిదండ్రులమరణమును ఒకపర్యాయమే విన్నయెడల ఆశౌచము ఒకపర్యాయమే జరిగించవలయును.

శ్లో॥ మృతజాతకయోర్యోగే । యా శుద్ధ స్సాధు కథ్యతే
మృతేన శుద్ధ్యతే జాతం । నమృతం జాతకేన తు. 131

తా॥ కొద్దికాలమృతినందు బహుకాలజాతము శుద్ధియగును. గొప్పపురుషుడతో స్వల్పకాలమృతాశౌచము శుద్ధిగాదు.

శ్లో॥ పరతః పరతో శుద్ధ । రఘాఘ్నాదా విధీయతే
స్యాచ్చేత్పంచతమాత్ దహ్నాత్ । పూర్వేణాஉపి విశుధ్యతి.

తా॥ కొద్దిఅశౌచముగొప్పదానితో శుద్ధిగాదు. 5 రోజులకు లోపలవింటే పూర్వముతోనే శుద్ధియగును.

(గ్రామాశౌచనిర్ణయః.)

శ్లో॥ యావద్గ్రామస్య మధ్యే । తు శవం సంతిష్ఠతి
పతిస్య తావదాశౌచం । నిర్హృతే శుద్ధిరిష్యతే. 140

తా॥ గ్రామమధ్యమునందు శవముండునంతవరకు గ్రామవాసులకు అశుచి. తొలగించినతరువాత శుద్ధి.

శ్లో॥ చతుశ్శతగృహోపేతే । గ్రామే వీథ్యంతరే తథా
ఏకాదశ ధనుర్మాత్రా । దర్వాచీనేஉపి నాస్త్యఘం. 141

తా॥ 400 యిండ్లుగలగ్రామమునందు మరియొకవీథియైతే 11 ధనస్సులకులోపలివారికి ఆశౌచము.

శ్లో॥ స్త్రీశూద్రాద్యాజ్ఞ బాలానాం । శవ స్తిష్ఠతి యత్ర తు
తత్రాஉశౌచం గృహస్యైవ । గ్రామస్యాస్య న విద్యతే.

తా॥ స్త్రీ. శూద్ర, బాలులశవములు వున్నయింటివారికే అశుచి. ఇతరులయుండ్లవారికి లేదు.

శ్లో॥ వీథ్యంతరేஉపి తు గ్రామ । ఏకవింశతిమందిరే
బహుదూరవ్యవాయేஉపి । శావాஉశౌచ మితిస్మృతిః. 143

తా॥ వీథ్యంతరమందుగాని 21 యిండ్లతరువాతగాని ఆశౌచములేదు.

శ్లో॥ గ్రామమధ్యగతో యాన । చ్ఛవ స్తిష్ఠతి కస్యచిత్
గ్రామస్య తావదాశౌచం । నిర్గతే శుచితామియాత్. 144

నాద్యాదంతశ్శవే గ్రామే। నాధీయ్యాన్న జుహోతి చ
తాంపీఠ్యాంతరే కుర్యా। న్నను రేకదశాంతరే. 145

తా॥ గ్రామమునందు శవము ఉండునప్పుడు భోజనము హోమములు మొదలయినవి చేయరాదు. వీధిభేదించినయెడల చేయవచ్చును.

శ్లో॥ స్మృతిశ్రుత్యోర్విరోధే తు। శ్రుతిరేవ బలీయసీ
తస్మాదంతశ్శవే గ్రామే। జుహుయాచ్ఛ్రౌతపావకం. 146

తా॥ స్మృతికన్న శ్రుతి అధికముగాన స్మార్తకార్యములు చేయరాదు. శ్రౌతకార్యములు చేయవచ్చును.

శ్లో॥ గ్రామస్థే శవఘంటాలే। శూద్రేతరవృతే చిసన్నికౌ
నాధ్యేతవ్యం న భోక్తవ్యం। న హోమ న కదాచన 147

తా॥ హీనకులశవము సమీపమందున్నయెడల వేదపాఠ భోజన హోమాదులను చేయరాదు.

శ్లో॥ సహస్రబుధసంకీర్ణే। గ్రామే తదనికేఽపి వా
ఆలయస్య సమీపే తు। త్రింశద్దండాంతరే మృతౌ. 148
అర్చన స్నాపనాదీని। న కుర్యాదపి తత్ర తు.

తా॥ దేవాలయసమీపమందు శవ ముండిన వేద్యాలను చేయరాదు.

శ్లో॥ ఏకవీధ్యాం సమాఖ్యాతం। ఏవ విండైన్య హే స్థితే. 149
త్రింశద్ధనుషిబాధస్స్యా। ద్దైవంపిత్ర్యం చ వర్జయేత్
పంచాశచ్చాపసీమాంతే। ఏకవీధ్యాం శవే సతి. 150
అర్చనం చ హరేద్దానం। దేవదేవస్య వర్జయేత్
శూద్రాణాం మరణం స్యాచ్చే ద్గ్రామమధ్యే కథంచన
పూజమధ్యే మృతే తూష్ణీం। పూజశేషం సమాపయేత్.

తా॥ ప్రేతపాదముల సమీపమునపోరాదు. అట్లు చేసిన ఆయువు క్షీణించును.

శ్లో॥ మృతస్య బాంధవైః సార్ధం । కృత్వా తు పరిదేవనం
వర్జయే త్తదహోరాత్రం । దానం శ్రాద్ధాదికర్మ చేత్. 158

తా॥ మృతబంధువులతో కలసి రోదనము చేసిన యెడల హోమాదికర్మలను చేయరాదు. శ్రాద్ధమున్నూ పెట్టరాదు.

శ్లో॥ క్షత్రియం మృత మజ్ఞానా । ద్బ్రాహ్మణో యోऽనుగచ్ఛతి
కృత్వా శౌచ మహోరాత్రం । పంచగవ్యేన శుధ్యతి. 159

తా॥ క్షత్రియశవానుగమనము అజ్ఞానముచే బ్రాహ్మణుడు చేసిన యెడల 1రోజు అశౌచముపట్టి పంచగవ్యప్రాశన చేయవలయును.

శ్లో॥ శవం చ వైశ్యస్యాऽజ్ఞానా। ద్బ్రాహ్మణో యోऽనుగచ్ఛతి
సిక్షా కృత్వా తు ప్రాశ్నీయా । త్పంచగవ్యం విధానతః.

తా॥ వైశ్యునిఅనుగమించిన త్రిరాత్రప్రాయశ్చిత్తము చేయవలయును.

శ్లో॥ యః ప్రేత మలంకుర్యా । ద్గృహే ద్వ్యాస దహేచ్చ తం
స శుధ్యత్యేకకాలేన । కాలశేషం బహిర్వసేత్. 161
అహ్ని చేద్వహనం కుర్యా । దూర్ధ్వ మస్తమయా ద్రవేః
స్నాత్వా గృహం విశేద్బ్రహ్మ । రాత్రౌ చేదుదయాద్రవేః.
అజ్ఞాతిం చ పరం స్థాప్య । త్రిరాత్ర మశుచి ర్భవేత్.

తా॥ ప్రేతనుమోశినా అలంకరించినా పగలుఅయితే అస్తమానంవరకున్నూ రాత్రియయితే ఉదయంవరకు వెలుపలవుండి స్నానం చేయవలయును. అజ్ఞాతిస్థాపన చేసితే 3దినములు అశౌచము పట్టవలయును.

శ్లో॥ అసగోత్రస్సగోత్రో వా । యది స్త్రీ యది వా పుమాన్
ప్రథమేఽహని యో దద్యా । త్సదశాహం సమాపయేత్.

తా॥ సగోత్రుడైనను అసగోత్రుడైనను ప్రథమదినసంస్థాపన చేసినయెడల 10 రోజులు ఆశౌచము పట్టవలయును.

శ్లో॥ మిత్రబంధుసుహృత్పుత్రి । ధనధాన్యవిహీనకం
అనాథం బ్రాహ్మణం మృతం। యే వహంతి బుధోత్తమాః.
పదే పదే యజ్ఞఫల । మానుపూర్వ్యా ల్లభంతి తే
న తేషా మశుభం కించి । త్పాపం వా శుభకర్మణాం. 165
జలావగాహనా త్తేషాం । సద్య శ్శౌచం విధీయతే.

తా॥ మిత్రులు బంధువులు స్నేహితులు పుత్రులు ధనధాన్యములు లేనిఆనాథబ్రాహ్మణశవమును మోయువారికి ప్రతియుగమందును అశ్వమేధఫలము కలుగును. వారికి యెట్టియశుభమున్ను లేదు. వారికిస్నానముచేతనే శుద్ధియగును.

శ్లో॥ అనాథం బ్రాహ్మణం స్పృశ్య । క్షత్రియం వైశ్య మేవవా.
సద్యఏవ మహాయజ్ఞ । ఫలం ప్రాప్నోతి మానవః

తా॥ బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులలో అనాధమృతస్థాపన చేసినవారు మహాపుణ్యులగుదురు.

శ్లో॥ మృతస్య న్యాస సంస్కారే । బ్రాహ్మణో నైవ దూష్యతే. 167
అనాథమంత్రికర్తా చ । సద్య స్స్నాత్వా విశుద్ధ్యతి

తా॥ మోయబడుశవమునుచూచి సచేలస్నానము చేయవలయును.

శ్లో॥ ఉహ్యమానం శవం దృష్ట్వా । సవాసా జల మావిశేత్.
అలంకృతం శవం దృష్ట్వా । సచేల స్నాన మాచరేత్

తా॥ అలంకరించినశవమును చూచి సచేలస్నానము చేయవలయును.

శ్లో॥ బ్రహ్మచారీ న కుర్వీత । శవస్థాపనకాః క్రియాః. 169
యది కుర్యా చ్చరే త్కృచ్ఛ్రం । పున స్సంస్కార మేవ చ
ఆచార్యం స్వ ముపాధ్యాయం । పితరం మాతరం గురుం.
నిహృత్య తు వ్రతీ ప్రేతా । న్నవ్రతేన వియుజ్యతే
ఆచార్య పిత్రుపాధ్యాయా । న్నిహృత్యాఽపి వ్రతీ వ్రతీ. 171
యథావ్రతస్థోపి సుతః । పితుః కుర్యా త్క్రియాం సురాః
తథా మాతామహస్యాపి । దౌహిత్రః కర్తు మర్హతి. 172
యస్తు సహ సపిండోపి । పకుర్యాచ్చ్రయనాసనమ్.
బాంధవో బాంధవో వాపి । సదశాహేన శుద్ధ్యతి. 173

తా॥ బ్రహ్మచారి శవస్థాపనాదులు చేసిన యెడల కృఛ్రము ను ఆచరించవలయును. ఆచార్యుని ఉపాధ్యాయుని మాతృ పితరులను సంస్కరించిన బ్రహ్మచారికి దోషము లేదు. సహాధ్యాయి ఆచార్యులు పితృ మాతృ మాతామహులకు క్రియలొనర్చిన బ్రహ్మచారికి వ్రతభంగము లేదు.

(ద్రవ్యాఽశౌచనిర్ణయః.)

శ్లో॥ ద్రవ్యాణా మపి చాఽశౌచం । స్వామ్యాశౌచే విధీయతే
ఆశౌచాంతే తు శుద్ధ్యంతి । వారిణా ప్రోక్షితాని చేత్. 174

తా॥ ద్రవ్యాశౌచము స్వామిఆశౌచమందు చెప్పబడెను. వస్తువులు ఉదకముచే ప్రోక్షించబడినవైనప్పటికిన్ని ఆశౌచాంతము నందే శుద్ధి.

శ్లో॥ సంపర్కాఽశౌచవాన్ యస్తు । యస్స్యాత్యాశౌచవాన్ భవేత్
తస్య ద్రవ్యాణి శుద్ధాని । గ్రాహ్యాణి స్యుర్మనీషిభిః. 175

తా॥ సంపర్కాశౌచముగలవానియొక్క వస్తువులు ఉదకముచల్లి తీసుకొనవచ్చును.

శ్లో॥ ఆపత్కాలే ప్రతిగ్రాహ్య। మామమైకాహికం బుధైః
పూర్వం సంకల్పితం ద్రవ్యం। యజ్ఞాదిషు న దూష్యతే.
పక్వాన్నం తు స్థితం భోజ్యం। పూర్వోక్తం మనీషిభిః
తా॥ ఆమ ద్రవ్యమును ఆపత్కాలమందు గ్రహించవచ్చును. యీయామయమునందు పక్వాన్నముకూడ భుజించవచ్చును.

శ్లో॥ దాతృ భోక్త్రో రన్యతరో। జానాత్యాశౌచకారణం. 177
తదన్నం న ప్రదేయం స్యా। న్నచ భోజ్య మితి స్మృతిః
తా॥ దాత భోక్తలు ఆశౌచకారణము తెలిసిన తరువాత అన్నము పెట్టకూడదు. తినకూడదు.

శ్లో॥ యది భోజనమధ్యే తు। జానాత్యాశౌచకారణం. 178
అన్య గేహోదకై రాపో2। శనాది నైవ దూష్యతే
ద్రవ్యాణి స్వామిసంబంధా। దఘూహా న్స్వశుచీని చ. 179
స్వామిశుద్ధ్యైవ శుద్ధ్యంతి। వారిణా ప్రోక్షితాన్యపి
తా॥ భోజనమధ్యమునందాశౌచము వింటే దోషములేదు. ఆశౌచమువచ్చిన వారియొక్క వస్తువులు వారితో శుద్ధియగును.

శ్లో॥ లవణే మధు గౌడే చ। పుష్పమూలఫలేషు చ. 180
శాక కాష్ఠతృణేష్వప్సు। దధి సర్పిః పయస్సు చ
తైలౌషధ్యజినేచైవ। పక్వాపక్వే స్వయంగ్రహః. 181
తా॥ [illegible], తేనె, బెల్లము, పుష్పములు, గడ్డలు, ఫలములు, కూరలు, కట్టెలు, గెడ్డపెరుగు, నెయ్యి పాలు, నూనె మందు యివిమిగహో పక్వఅపక్వములు [illegible] .

శ్లో॥ పణ్యద్రవ్యేషు సర్వేషు। నాశౌచం [illegible]
అన్నసత్ర ప్రవృత్తానా। [illegible]
తా॥ అమ్మబడువస్తువులయందు ఆశౌచము [illegible] నముచేయువాని గృహమందు ఆమద్రవ్యాన్నము దోషములేదు.

శ్లో॥ యత్తు క్షేత్రగతం ధాన్యం । కూపవాపీషు యజ్జలం
అభోజ్యాదపి తద్భోజ్యం । యచ్చ గోషు గతం పయః. 183
ఆమం శాకం మధుఘృతం । దధి క్షీర మథౌషధం
గుడ స్తక్రం తథోదశ్చి । ద్భోజ్యా న్యేతాని నిత్యశః. 184

తా॥ భూమియందున్నధాన్యము, బావిలోనీరు, గోవుల యందలిపాలు, అపక్వాన్నము, శాకము, తేనె, నెయ్యి, పెరుగు, పాలు, ఔషధము, బెల్లము, మజ్జిగ, యివిగ్రహించితే దోషము లేదు.

శ్లో॥ వివాహోత్సవ యజ్ఞాది । ష్వంతరా మృతసూతకే
పూర్వసంకల్పితద్రవ్యం । దీయమానం న దూష్యతే. 185

తా॥ వివాహయజ్ఞాదులయందు మధ్య అశుచివచ్చినచో పూర్వము సంకల్పించబడినదానిని గ్రహించవలయును.

శ్లో॥ గృహీతమధుపర్కస్య । స్నానం యజ్ఞాదికర్మణి
ఋత్విగ్దీక్షితనామ్నాం చ । క్రతుభోక్తృ స్వపత్యకే. 186
వివాహే చోత్సవే చైవ । కన్యాయాం సూతకం విధిః
తథా కర్త్రవిపాకాదౌ । వ్యాధితస్య న సూతకం. 187

తా॥ యజ్ఞకర్తప్రారంభించినతరువాత ఆశౌచము వింటే స్నానమాత్రముచే శుద్ధి. యజ్ఞమునందు యజమానునికిని ఋత్విక్కులకును, వివాహమందు దాతృనకు కన్యలకున్ను విధియందు కర్త్ర భోక్తలకును, రోగికి పీడలకు ఆశౌచము లేదు.

శ్లో॥ ఉత్సాహే వ్రతదానే చ కర్తవ్యే । ముమూర్షో శ్చ న సూతకం
అనాథారణకృత్యేషు । రాజాదే ర్నాస్తి సూతకం. 188

తా॥ మరణప్రాయశ్చిత్తము పెట్టునప్పుడు ఆశౌచములేదు. గొప్పకార్యము చేయబోవురాజాదులకు ఆశౌచము లేదు.

శ్లో॥ ఋత్విజాం దీక్షితానాం చ । యజ్ఞీయం కర్మ కుర్వతాం
శిల్పికర్తృ బ్రహ్మచారి । దాతృబ్రహ్మవిదాం తథా. 189
దానే వివాహే యజ్ఞే చ । సంగ్రామే దేశవిప్లవే
ఆశౌచం కర్మమధ్యే తు । శావం సూతక మేవ వా. 190
ఆపత్యపి చ సర్వేషాం । సద్య శ్శౌచం విధీయతే

తా॥ ఋత్విక్కులు, దీక్షితులు, యజ్ఞము చేయువారు, శిల్పకర్తలు, బ్రహ్మచారి, దాత, బ్రహ్మవేత్తలు, దానమునందు, వివాహమునందు, యజ్ఞమునందు, యుద్ధమునందు, దేశోపద్రవమునందు ఆశౌచము వచ్చినట్లయితే సద్యశ్శుద్ధి చెప్పబడెను.

శ్లో॥ దీక్షితోఽప్యేకపుత్రశ్చే । న్మాతాపిత్రో ర్మృతి ర్యది.
సంస్థాప్య శాలా మాగత్య । యజ్ఞశేషం సమాపయేత్

తా॥ యజ్ఞమధ్యమందు తల్లిదండ్రులు మృతులైతే సంస్థాపనతర్వాత యజ్ఞశాలకువచ్చి శేషక్రియలు ముగించవలయును.

శ్లో॥ జ్యేష్ఠస్య తు క్రతో ర్మధ్యే । మాతాపిత్రో ర్మృతి ర్యది.
దీక్షారూపం నిధాయాత్ర । సంస్థాప్యాగ్నిం తతో హి సః
దీక్షితోఽప్యేకపుత్రశ్చే । న్మాతాపిత్రో ర్మృతి ర్యది.
దీక్షారూపం నిధాయాత్ర । సంస్థాప్యా న్యోదకక్రియః
సంస్థాప్య శాలా మాగత్య । యజ్ఞశేషం సమాపయేత్.184

తా॥ జ్యేష్ఠపుత్రుడు సంస్థాపనానంతరము యజ్ఞశాలప్రవేశించి శేషము పూర్తి చేయవలయును. ఆశౌచమధ్యమందు శ్రాద్ధము పెట్టకూడదు.

శ్లో॥ పూర్వం ప్రవృత్తిసీమాంతం । చౌలోపనయనాదిషు
వివాహే సుప్రతిష్ఠాసు । వృషోత్సర్గాదికేషు చ. 195
పూర్వప్రవృత్తియజ్ఞేషు । పాకయజ్ఞేషు సర్వసు
శాంతిహోమేషు సర్వేషు । యుద్ధాద్యవిహితేషు చ. 196

వ్యాఖ్యాదిశమనాద్యూర్థ । శాంతికే దానకర్మణి
సూతకే తు పరస్నాత్వా । ప్రణమ్య పరమేశ్వరమ్. 197

తా॥ వివాహ యజ్ఞ ప్రతిష్ఠా పాకయజ్ఞ శాంతి దానాది కర్మలు ఉపక్రమించినతరువాత ఆశౌచమువస్తే స్నానముచేసి భగవంతునకు నమస్కారము చేయవలయును.

శ్లో॥ ఏకాదశ్యాం న భుంజీత । వ్రతమేతన్న లుప్యతే
మృతకేఽపి న భుంజీత । ఏకాదశ్యాం సదా నరః. 198
స్మార్తకర్మ పరిత్యాగో । రాహోరన్యత్ర సూతకే
మృతకే సూతకే చైవ । న దోషో రాహుదర్శనే. 199
స్నాత్వా శ్రాద్ధం ప్రకుర్వీత । దానం శాఠ్యవివర్జితః
మృతకార్యం చ సంధ్యాం చ । వినా చైవ దానకర్మ చ.200
అన్యకర్మసు బ్రాహ్మణస్య । నాధికారోఽస్తి సూతకే.

తా॥ ఆశౌచమధ్యమునందు ఏకాదశిఉపవాసము చేయవలసినది. విడువరాదు. గ్రహణకాలమునందు ఆశౌచదోషము లేదు. సర్వక్రియలు చేయవచ్చును. పురుడు వచ్చినప్పుడు మృతకార్యము సంధ్యా దానము తప్ప బ్రాహ్మణుడు ఇతరములు చేయరాదు.

శ్లో॥ వైతానం మృతకార్యం చ । మంత్రోచ్చారణపూర్వకం.201
స్నానం కృత్వాఽర్ధవస్త్రస్సన్ । కుర్యాదితి వినిశ్చయః
సంధ్యా మానసమంత్రస్స్యా । త్ప్రాణాయామస్స్వమంత్రకః.
అర్ఘ్యం వాచికమంత్ర స్స్యా । దితి సంధ్యావిధి ర్భవేత్.

తా॥ మృతకార్యములు మంత్రోచ్చారణపూర్వకముగా చేయవలయును.సంధ్య మానసికముగానున్న మంత్రము చెప్పకప్రాణాయామమున్ను, అర్ఘ్యమువరకు మంత్రమున్నూ, చెప్పవలయును. ఇది సంధ్యావిధి.

దత్వా ప్రదక్షిణం కుర్యా । త్సూర్యం ధ్యాయే ద్వ్ధోత్తమః
బుధో దశాహ మాసీత । వైశ్వదేవవివర్జితః. 211

దర్శం చ పూర్ణమాసం చ । కర్మవైతానికం చయేత్
సూతకేఽపి త్యజే న్నోత్రహ । త్వాగ్నియశ్చిత్తే యతేసహి.

సూతకే తు సముత్పన్నే । స్మార్తకర్మ కథం భవేత్
జనమహానోప్యగ్నివితానస్య । కర్మత్యాగో న విద్యతే. 21

శాలాగ్నౌ కేవలే హోమః । కార్యఏవాన్యగోత్రజైః

తా॥ ఆశౌచమునాడు గాయత్రిచెప్పి అర్ఘ్యమును విడువవలయును. ఇతరము మానసికము. మంత్రములేకుండ ప్రాణాయామము చేయవలయును. శ్రౌతకర్మలున్ను, నిత్యాగ్నిహోత్రమున్ను ఇతరులచే చేయించవలయును.

ఇది సనాతనధర్మసంహితయందలి వింశత్యధ్యాయ

తాశ్వాస్యాంనిగ్రహము.

అథఏకవింశోఽధ్యాయః



మోక్షధర్మః.

శ్లో॥ ఇతి ధర్మా ఋషేః శ్రుత్వా । దేవతా గతసంశయాః
మోక్షధర్మాంశ్చ పప్రచ్ఛు । ర్భగవంతం సనాతనం.

తా॥ ఈచెప్పినధర్మమును విని దేవతలు నిస్సంశయులై తృప్తిపొందినవారై మోక్షధర్మమును చెప్పుమని భగవంతుని సనత్కుమారుని బ్రహ్మర్షిని కోరిరి.

శ్లో॥ శృణుత । శ్రద్ధయా దేవా! । మోక్షధర్మం మయేరితం
సుఖాసనే సమారూఢా । విజనే నిర్మలే స్థలే
సుషుమ్నా రంధ్రమార్గేణ । మనో నిర్మల మాగతః
అష్టాక్షరమహామంత్రం । జపేద్ధ్యాన సమన్వితః.
సహస్రారం ప్రాపయిత్వా । తత్ర సంస్థం మహేశ్వరం
నిత్యానందం నిర్వికల్పం । సచ్చిదానందరూపిణం.
పరిపూర్ణం నిర్గుణం చ । శాశ్వతం శృణు మక్షరం
అచలం విమలం శాంతం । ధ్యాయేత్ దేహాగ్రచేతనం. 5

తా॥ ఓ దేవతలారా! మోక్షధర్మమును జెప్పెద । శ్రద్ధతో వినుండు.

ముముక్షువైనపురుషుడు నిర్మలమైనవిజనస్థలమునందు సుఖాసనాసీనుండై పరబ్రహ్మాష్టాక్షరీమంత్రమును జపించుచు నిర్మలమైన మనస్సును సుషుమ్నానాడీద్వారా సహస్రారచక్రమునకు చేర్చి యెక్కడు వెలింగెడునిత్యానంద నిర్వికల్ప సచ్చిదానందరూపుండైన అచలపరిపూర్ణబ్రహ్మను ధ్యానము చేయవలయును.

శ్లో॥ శనైరుపైతి మనస । శ్శాంతిం ధ్యానబలాద్ధ్రువం
జాగ్రదాదిత్రయం సమ్యక్ । విద్ధ్యంతే పరమాత్మని. 6

తత స్స్వయం జ్యోతిరూపః । బ్రహ్మభిన్నో భవత్యసౌ
జీవన్ముక్తి మనుప్రాప్య । దేహాంతే పరమాత్మని. 7
ఏకీభూతో భవత్యాసు । ఘటాకాశ ఇవాఽచలే.

తా॥ అంతట క్రమముగా అవస్థాత్రయము బ్రహ్మమునం దులీనమై స్వయంజ్యోతియగు పరమాత్మ మిగులును. తదనంతరం జీవన్ముక్తి దశనుపొంది దేహాంతమునందు ఘటాకాశమువలెనే బ్రహ్మమందేకీభవించును.

శ్లో॥ ఇతి పరమరహస్యం । వేదవేదాంతసారం
కథిత మమలరూపం । మోక్షసామ్రాజ్యహేతు. 8
విదితసకలతత్త్వా । హేసురా! భావయధ్వం
న పునరిహ జని స్స్యాత్ । తాస్తిక స్యేతి సత్యం. 9

ఇతి సనాతనధర్మసంహితాయాం మోక్షధర్మోపదేశః.

తా॥ కనుకనీప్రకారము మీరుమోక్షధర్మములుసాధించుడి యని గురువర్యులగుమహాఋషి దేవతలకుపదేశించినవాడాయెను.

ఇది సనాతనధర్మసంహితయందలి మోక్షధర్మోపదేశము.

శ్లో॥ ప్రాక్తనస్యాఽస్య గ్రంథస్య । మయా తాత్పర్యబోధినీ
రచితా విదుషాం తుష్ట్యై । హ్యనుగృహ్ణాంతు మాం బుధాః
జగ్గారివంశసంభూత । లక్ష్మణార్యస్య ధీమతః
జ్యేష్ఠపుత్రేణ శిష్యేణ । విద్వత్సేవాఽవధానినః
ఆచంటపురవాస శ్రీ । రత్నాచార్యసుధీవరః
ధర్మామృత మిదం పీత్వా । ముద్రితే ముదితాశయాం
లోకేశపంచవక్త్రశ్రీ । విశ్వకర్మణే నమోఽస్తుతే.

ఇతి శ్రీవిశ్వకర్మపరబ్రహ్మార్పణమస్తు.